# విషయ సూచిక



# పాశ్చాత్యుల వృద్ధి క్షయములు

## 1

## ఆధునిక యుగము



క్రీ. వె. 1500 మొదలు ఇప్పటివరకు ఆధునిక యుగమని చెప్పవచ్చును. ఈ యుగములో ప్రపంచమం దనేకమైన మార్పులు సంభవించెను. ఆ మార్పులయొక్క స్వభావమును, వాని కారణములను విమర్శించినయెడల ఆధునికయుగ చరిత్రమునకు కొన్ని ప్రధాన లక్షణము లున్నట్లు స్పష్టమగును. ఈ లక్షణములలో కొన్ని ముఖ్యముగ పేర్కొ నతగియున్నవి. ఈ యుగములో ప్రపంచమందంతట యూరపు ఖండ వాసుల ప్రాబల్యము వ్యాప్తిగాంచెను. ప్రపంచములో చాల భాగమునకు వారు పరిపాలకులైరి. ఇట్టి రాజకీయ ప్రాబల్యముతో పాటు వారి ఆర్థిక ప్రాబల్యమునకుకూడ ప్రపంచమం దంతట వ్యాప్తికలిగెను. వర్తక వ్యాపారములు, పరిశ్రమలు చాలవరకు వారి అధీనములోనికి వచ్చుటయేగాక వా రేర్పరచిన సంప్రదాయములను బట్టి అవి జరుగవలసిన

వచ్చెను. దీనికి తోడు వారి విజ్ఞానమునకును, కొంతవరకు వారి మతమునకును ప్రాబల్యము లభించెను. న్యాయాన్యాయములు, మంచిచెడ్డలు, ధర్మాధర్మములు మొదలగు వానిని నిర్ణయించుటలో వారు వృద్ధిచేసిన తత్వములు, సూత్రములు ఆధారములయ్యెను.

కడచిన నాలుగువందల సంవత్సరములమధ్య యూరపు ఖండవాసులు, వారి సంతతివారగు అమెరికా ఖండవాసులు సంపాదించినంతటి ప్రాబల్యము ప్రాచీన మధ్య యుగముల లోని పాశ్చాత్యుల కుండినదికాదు. క్రీ. వె. 1500 వరకు ఆశియా ఖండ వాసులు వారితో సమానులుగ నుండుటయే గాక కొన్ని కాలములందు వారికంటె నధికులుగ నుండిరి. ఆశియాఖండ వాసులగు హూణులు, మంగోలులు, తార్తారులు, అరబ్బులు, తురకలు యూరపు ఖండములోని దేశములను జయించి కొన్ని శతాబ్దములు వానిని పాలించి యుండిరి. ఏడవ శతాబ్దము మొదలు పదునైదవ శతాబ్దము వరకు అరబ్బులు వృద్ధిచేసిన నాగరికత, విజ్ఞానము పాశ్చాత్యులకు మార్గదర్శకములుగ నుండెను. పదునారవ శతాబ్దమందుండి ఇదంతయుమారి యూరపుఖండవాసులయొక్కయు, ఇతర పాశ్చాత్యులయొక్కయు ప్రాబల్యము అన్ని విషయములలో ప్రపంచ మందంతట వ్యాపించెను. ఈ వ్యాప్తి ఆధునిక యుగచరిత్రమున కొక ప్రధాన లక్షణము. చాలవరకు ఆ వ్యాప్తియొక్క చరిత్రమే ఆధునిక యుగ చరిత్రమని కూడ చెప్పవచ్చును.

ఇదిగాక ఈ యుగములో పారలౌకికచింతకంటె ఇహలోకచింత ఎక్కువ ప్రాధాన్యము గాంచెను. ఇహలోక సుఖములం దదివరకుండిన విముఖత్వము నశించెను. సుఖమనుభవించుటకు భూలోకములో లెక్కలేని అవకాశము లున్నవనియు, ఆ అవకాశముల నుపయోగించుకొని ప్రతి మనుష్యుడు వాని జీవితకాలమును సుఖముగ గడపవలె ననియు తత్వవేత్తలు చెప్పసాగిరి. శరీరము సుఖపడుటకును, బలపడుటకును, ఆరోగ్యముగ నుండుటకును కావలసిన ఆహారము, వస్త్రములు, గృహములు, గృహోపకరణములు, విలాసములు, వినోదములు మొదలగు వానిని అధికముగ నుత్పత్తి చేయుట యందు మానవకోటి ఎక్కువ శ్రద్ధ వహించ దొడగెను. భూలోకమున స్వర్గమును నిర్మించుటయే ఉత్తమాదర్శమయ్యెను. ఆధునిక యుగచరిత్రకు ఇది రెండవ లక్షణమని చెప్పతగియున్నది.

వస్తుతత్వమును, సత్యమును తెలిసికొనుటకు ప్రయోగముల (Experiments) ద్వారా జరుగు పరిశోధనము ప్రధానసాధన మన్న భావము జిజ్ఞాసువులలో వ్యాపించి, దాని మూలమున సంపాదితమైన జ్ఞానమునకు అపారమైన విలువ కలుగుట ఆధునిక యుగచరిత్రమునకు మూడవ లక్షణము. దీని మూలమున పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయన శాస్త్రము, వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము, జీవశాస్త్రము మొదలగు శాస్త్రములు వృద్ధిగాంచి ప్రకృతి రహస్యము లనేకములు మానవునికి బయల్పడెను. ఈ కారణమున జల

శక్తి, ఆవిరిశక్తి, విద్యుచ్ఛక్తి, అణుశక్తి మొదలైన శక్తులను మనుష్యుడు వశపరచుకొనగలవాడయ్యెను. వాని సహాయమున సహజముగ నతని కుండు సృష్టిశక్తి, నిర్మాణశక్తి ఎన్నిరెట్లో వృద్ధిగాంచెను. వేలకొలది మైళ్ల దూరమందుండు వస్తువుల నతడు చూడగలవాడయ్యెను; అచ్చటి శబ్దము నతడు వినగలవాడయ్యెను; అతని గమనశక్తి అత్యంతము వృద్ధిగాంచెను. జ్ఞాన సంపాదనమునకును, సుఖసంపాదనమునకును పరిశోధనలును, ప్రయోగముల ద్వారా లభించు స్వానుభవమును ఉత్తమ సాధనములన్న నమ్మక మతనికి కలిగెను. మానవునిశక్తి అనంతమైనదను భావము వ్యాపించెను. ఆధునిక యుగములోని మానవులు ప్రాచీన మధ్య యుగములలోని మానవులకంటె శక్తిసామర్థ్యములందును, బుద్ధిబలమునందును, ఆలోచనశక్తి యందును ఎన్ని రెట్లో అధికులైరి. ఇట్టి ఆధిక్యము మనుష్యునికి లభించుట ఆధునిక యుగమునకు మరియొక లక్షణము.

ప్రయోగములద్వారా పరిశోధనము గావించి, ప్రకృతి రహస్యములను తెలిసికొని ప్రకృతిశక్తులను వశపరచుకొనుట యందు ఆసక్తి పదునైదవ శతాబ్దమందుండి యూరపు ఖండమున కొందరిలో పుట్టి, క్రమక్రమముగ వృద్ధిగాంచిన కారణమున వారి ప్రాబల్యము ప్రపంచమందంతట వ్యాపించుటకు అవకాశమేర్పడెను. ఐహిక సుఖములందు వారు విముఖులు గాక సుముఖులగుటకు కూడ చాల వర కిదియే కారణము. ఇందుచేతనే వారి ప్రాబల్యము రాజకీయములందు మాత్రమే

గాక, ఆర్థిక విషయములందును, విజ్ఞానవిషయములందును కూడ వృద్ధిగాంచెను. వారి ప్రాబల్యవ్యాప్తియందుండు విశేషమిదియే.

క్రీ. వె. అయిదవ శతాబ్దమందుండి పదునైదవ శతాబ్దమువరకు——అనగా సుమారు వేయిసంవత్సరముల కాలము —యూరపు ఖండ వాసుల చరిత్రమును గమనించిన యెడల ఆధునిక యుగమున వారికిట్టి ప్రాబల్యము లభించునని యనుకొనుట కెట్టిఅవకాశములు లేనట్లగుపడును. అంతకుపూర్వము ప్రాచీనయుగములో గ్రీకుల విజ్ఞానము మూలముననను, రోమనుల సామ్రాజ్య పరిపాలన సౌష్ఠవము మూలమునను పాశ్చాత్యులు గడించిన ప్రతిభ మధ్యయుగమున నశించెను. ఒక్క సామ్రాజ్యమునకు బదులు పెక్కు చిన్న చిన్న రాజ్యములు బయలుదేరుటయేగాక, ఈ రాజ్యములను పాలించుచుండిన రాజులు బలహీనులై అధికారమునంతను స్వల్పఖండములలో జమీందారులవలె నుండిన ఫ్యూడల్ (Feudal) భూస్వాముల పరము చేయవలసి యుండిరి. ప్రతిదేశమందును ఈ భూస్వాములు పరస్పరము యుద్ధముల గావించుచు శాంతి భద్రతలకు భంగము కలిగించి అరాజకమునకు కారకులుగనుండిరి. వర్తక వ్యాపారములు నశించెను. రోమన్‌లు నిర్మించిన రోడ్లు, వంతెనలు ఇతరప్రయాణ సౌకర్యములు పాడుపడెను. దేశములో ఒక ప్రాంతమునకును, ఇంకొక ప్రాంతమునకును సంబంధము లేకపోవుటచే ప్రతి గ్రామము విధిలేక స్వయంపోషకమై, ఉన్న దానితో తృప్తిపడవలసిన స్థితిలోనికి వచ్చెను. వ్యవ

సాయము తప్ప జీవనాధారము ప్రజల కింకొకటి లేకుండెను. దీనినికూడ స్వాతంత్ర్య విహీనులైన రైతులు సాగించుచుండిరి. పరిశ్రమల మూలమున గాని, వర్తక సాధనమునగాని ధనమును సంపాదించువారి సంఖ్య స్వల్పమయ్యెను. జమీందారులు స్వేచ్ఛానుసారముగ సుంకములను విధించుటచేత వర్తక వ్యాపారముల కెక్కువ యవకాశము లేకుండెను. అచ్చ టచ్చట కొన్ని పట్టణము లుండిన మాట వాస్తవమే కాని, వానిలోని ప్రజలలో చాల భాగము వ్యవసాయము మీదనే ఆధారపడి యుండిరి. వానిలోని వర్తకులు, నేత మొదలగు చేతిపనులను చేయుచుండినవారు గణములుగ (Guilds) నేర్పడి వారివారి వృత్తులకు సంబంధించిన చట్టము లనేకములను చేసి, ఇతరపట్టణములలోని వారిని విదేశీయులుగ భావించి వారి మూలమున పోటీలేకుండునట్లు పట్టణములను పాలించు చుండిరి. కనుక ఏ పట్టణమున కా పట్టణమే వర్తక కేంద్రమై ఇతర పట్టణములతో గాని, దేశమంతటితో గాని సంబంధము విస్తారము లేనిదిగ నుండెను. ఇదంతయు భారీ పద్ధతిని బాహుళ్యముగ పరిశ్రమల నడుప వీలుకానట్లు చేసెను. దేశము లన్నిటియందును దారిద్ర్యము తాండవమాడు చుండుటచే సుఖముగ జీవించుట కష్టసాధ్య మయ్యెను. రోమన్ సామ్రాజ్యముతోపాటు రోమన్ విద్యాశాలలు కూడ నశించుటచేత మతబోధచేయువారు తప్ప తక్కిన వారెవ్వరు విద్యనేర్చుకొనుట కవకాశము లేదయ్యెను. వీరు నేర్చుకొన్న విద్యకూడ మిక్కిలి సంకుచితమై మతగ్రంథములు కొన్నిటిని వల్లించుటతో పూర్తియగుచుండెను. మతమునకు

సంబంధించని విద్యలు విద్యలుకావను భావము వ్యాపించెను. మతాధిపతులు, వారి అనుచరులు బోధించిన బోధలే పరమ సత్యములని ప్రజలు భావించుచుండిరి. మూఢవిశ్వాసములు ప్రబలియుండెను. స్వతంత్రముగ ఆలోచించి సత్యమును తెలిసికొను ఇచ్ఛ యెవ్వరికి లేదయ్యెను. పుక్కిడి పురాణములు, సబబు సందర్భములు లేని కథలు గాథలు పరమసత్యములుగ పరిగణింపబడుచుండెను. ఇట్టి రాజకీయ ఆర్థిక వైజ్ఞానిక పరిస్థితులలో యూరపుఖండవాసు లెన్నటికైన ముందుకురాగలరను నమ్మక మెవ్వరికి కూడ లేకుండెను. అందుచేతనే పదమూడు, పదునాల్గవశతాబ్దములలో తూర్పు యూరపుదేశములు మంగోలుల వశమయ్యెను. పదునైదవ శతాబ్దమున తురకలు ఆగ్నేయభాగపు దేశములను జయించి తుదకు 1453 లో ప్రఖ్యాతిగాంచిన కాన్‌స్టాంటినోపిల్ నగరమును వశపరచుకొనిరి. పరిపాలనా విధానమందును, సైనిక శిక్షణమందును, యుద్ధరంగములలో వ్యూహములు పన్నుటయందును, శత్రువినాశనమునకై ఉపయోగింపబడిన ఆయుధసామగ్రియందును ఆశియాఖండమునుండి వచ్చి యూరపు ఖండవాసులను జయించిన వారు ఉత్కృష్టులుగ నుండిరి. కనుక మంగోలులయొక్కయు, తురకలయొక్కయు సామ్రాజ్యము యూరపుఖండమునం దంతట వ్యాపించు సూచనలుండెనేగాని, యూరపుఖండవాసుల ప్రాబల్యము ప్రపంచమందంతట వ్యాపించు చిహ్నములేవియు పదునైదవ శతాబ్దపుమధ్యభాగమువరకు కనుపించవయ్యెను.

కాని క్రమముగ యూరపుఖండములోని రాజకీయ ఆర్థిక సాంఘిక పరిస్థితులు మారెను. అచ్చటి విజ్ఞానము వృద్ధిగాంచెను. ఇతరఖండములలోనివారికి తెలియని యుద్ధ సాధనములు కొన్నిటిని వారు క్రొత్తగ కనిపెట్టగలవారైరి. ఇతరవిధములగు అనుకూలము లనేకములు క్రీ. వె. 1500 నాటికి వారి కేర్పడెను. అందుచేత కొంతకాలమునకు వారి ప్రాబల్యము ఖండాంతరములలోనికి వ్యాపించెను.

క్రీ. వె. 1500 నాటికి యూరపుఖండమున కలిగిన మార్పులలో కొన్ని ప్రధానముగ గమనింపదగియున్నవి. అట్లాంటిక్ మహాసముద్రము నానుకొని యుండు ఇంగ్లండు, ఫ్రాన్సు, స్పెయిన్, పోర్చుగల్ దేశములలో బలవంతులును, నిరంకుశులును అగు రాజులు సింహాసనాధిష్ఠితులైరి. క్రీ. వె. 1485 మొదలు క్రీ. వె. 1603 వరకు ఇంగ్లండును పాలించిన ట్యూడర్ వంశపురాజు లిట్టివారు. వీరు ఫ్యూడల్ భూస్వాముల నణచి, వారిభూములను వశపరచుకొని, వానిలో కొంత భాగమును తమ అనుచరులకు పంచిపెట్టిరి. ప్రజలయొద్ద నుండి పన్నులమూలమునను, విరాళముల పేరునను ధనమును సంపాదించి కూడబెట్టిరి. నౌకాదళమును వృద్ధిజేసి, దేశమునకు శత్రుభయము లేనట్లు చేసిరి. అదివరకు మతవిషయములలో అధికారము వహించియుండిన రోంపట్టణ పీఠాధిపతియగు పోపుయొక్క అధికారమును తొలగద్రోసి, తామే మతపీఠాధిపతులైరి. వర్తక వ్యాపారముల వ్యాప్తికి ఆటంకములు కలిగించుచుండిన పట్టణ గణముల (Guilds) అధికార

మును తగ్గించి బాహుళ్యముగ వ్యాపారముచేయు మధ్య వర్గమువారి ఆనుకూల్యమును సంపాదించిరి. ఈకారణము లన్నిటి మూలమున వీరిని అడ్డగల ప్రత్యర్థులు దేశములో లేకపోయిరి. అధికారమంతయు వీరిలో కేంద్రీకృతమయ్యెను. ఇదేవిధముగ ఫ్రాన్సు, స్పెయిన్, పోర్చుగల్ దేశములందు కూడ పదునారవశతాబ్దపు ప్రథమభాగము నాటికి నిరంకుశులు ప్రభువులైరి. వీరుకూడ రాజుల నెదిరించు భూస్వాముల నణచిరి; తమతో అధికారమునకై పోటీచేయుచుండిన పోపుల అధికారమును తగ్గించిరి. ఈ విధముగ నిరంకుశ ప్రభుత్వము స్థాపితమైన కారణమున వీరు క్రమక్రమముగ విదేశములందుకూడ రాజ్యములను సంపాదించగలవారైరి.

ఈ నాలుగు దేశములలో క్రీ. శ. 1500 నాటినుండి మరియొక మార్పుకూడ కలిగెను. ప్రజలలో జాతీయ భావము వృద్ధిగాంచుటయే ఈ మార్పు. అంతకుపూర్వము ఫ్రాన్సులోని ప్రజలు వారివారి మండలములపై ఎక్కువ అభిమానము కలవారుగ నుండిరి. స్పెయిన్ మొదలగు దేశములలోని వారుకూడ ఇట్టి స్థితియందే యుండిరి. కాని కొన్ని పరిస్థితుల మూలమున వారిలో సంకుచితమైన మండలాభిమానము నశించి విశాలమగు జాతీయభావము వృద్ధిగాంచెను. నూరు సంవత్సరముల కాలము (1337–1453) ఫ్రాన్సులోని ప్రజలు ఇంగ్లీషు వారితో యుద్ధము చేయవలసినవారైరి. ఆ కాలములో వారియందు జాతీయభావము వృద్ధిగాంచెను. అదేవిధముగ స్పెయినువారు, పోర్చుగల్

వారు అనేకసంవత్సరములకాలము వారిపై అధికారము వహించియుండిన మహమ్మదీయులతో పోరవలసి వచ్చిన కారణమున వారిలోకూడ జాతీయభావము వృద్ధిగాంచెను. వారిలో వారికి కొన్ని భేదములుండినను వారందరికి మహమ్మదీయులు శత్రువులుగ నుండిరి. వారందరుకలసి మహమ్మదీయులపై యుద్ధముచేసిరి. ఒక యుద్ధరంగమున అనేక సంవత్సరములు కలిసి యుద్ధము సాగించినవారిలో జాతీయ భావము వృద్ధిగాంచుట సహజము. ఇట్టి సందర్భములు మరికొన్ని ఏర్పడుటవలన ఇంగ్లీషు ప్రజలలోకూడ జాతీయ భావము వృద్ధిగాంచెను. ఈ భావమును మరింత అధికము చేయుటకు నిరంకుశులగు రాజులు పాటుపడిరి. అంతఃకలహములు లేనివారును, ఐకమత్యము గలవారును ప్రజలుగ నుండుట రాజుల కెప్పుడును లాభకరమగును. అట్టివారి సహాయమున విదేశములను జయించుట సులభతరమగును. కనుక క్రీ. శ. 1500 తర్వాత నీ దేశములను పాలించిన రాజులు నిరంకుశులగుటయేగాక జాత్యభిమాన పూరితులగు ప్రజలపై అధికారమును వహించువారైరి. క్రమక్రమముగ వారి ప్రాబల్యము వ్యాప్తిగాంచుట కిదియొక కారణమయ్యెను.

మరియొక విషయముకూడ నీసందర్భమున గమనింప దగియున్నది. జాతీయాభిమానముతో కూడిన ప్రజలను నిరంకుశముగ పాలింపగల రాజులులేని యూరపుఖండ దేశములు చాలకాలమువరకు వెనుకబడియుండెను. జర్మనీ, ఇటలీ దేశములిట్టివి. కొన్ని కారణముల మూలమున జర్మనీదేశ

మంతయు ఒకరాజుయొక్క పరిపాలనములోనికి రాజాల దయ్యెను. ఇటలీకూడ అట్టిస్థితియందే ఉండవలసివచ్చెను. సుమారు అయిదువందల చిన్నచిన్న సంస్థానాధీశులు జర్మనీ లోనుండిరి. క్రీ. వె. 1871 వరకు జర్మనీయందు కేంద్ర ప్రభుత్వమొకటి ఏర్పడినదికాదు. ఇటలీలోకూడ క్రీ. వె. 1871 లోనే కేంద్రప్రభుత్వ మేర్పడెను. అందుచేత రాజకీయ ముగ ఈ రెండుదేశములు ఇటీవలవరకు మిక్కిలి వెనుకబడి యుండెను. అందుచేతనే అవి పాశ్చాత్య ప్రాబల్యవ్యాప్తిలో ఇటీవలవరకు పాల్గొనలేకపోయెను. ఇంతేగాక ఇరుగుపొరుగున నుండు ఫ్రాన్సు, స్పెయిన్ మొదలైన దేశములను పాలించు చుండిన నిరంకుశుల దండయాత్రల కవి గురియగుచువచ్చెను.

క్రీ. వె. 1500 తర్వాత నిరంకుశప్రభుత్వలాభమును సంపాదించిన యూరపుఖండరాజ్యములలో మరిరెండు పేర్కొన దగియున్నవి. వానిలో రషియాఒకటి; ఆస్ట్రియా రెండవది. రషియాయొక్క ప్రాబల్యము చాలవరకు ఉత్తరఆశియాలో వ్యాపించెను. ఆస్ట్రియాప్రాబల్యము యూరపుఖండ మందలి మరికొన్ని దేశములపై వ్యాపించెను. కనుక మొత్తముమీద గమనింపదగిన విశేషమేదియో మనకు స్పష్టమగుచున్నది: జాతీయభావము, నిరంకుశప్రభుత్వముగలదేశములు ముందుకు రాగలవయ్యెను. తక్కినవి వెనుకబడియుండుటయో, లేక ముందుకువచ్చినవానికి వశమైపోవుటయో జరిగెను.

యూరపుఖండవాసుల ప్రాబల్యము క్రీ. వె. 1500 తర్వాత ఖండాంతరములందు వ్యాప్తిగాంచుటలో నిరంకు

శములగు జాతీయ ప్రభుత్వములు స్థాపితమగుటయేగాక మరి కొన్ని మార్పులు కూడ కారణములయ్యెను. వీరు పదునైదవ శతాబ్దమున తుపాకిమందును చేయుట నేర్చుకొనిరి. యుద్ధ విధానములో దీనిమూలమున గొప్ప విప్లవము సంభవించెను. అదివరకు ఉపయోగములోనుండిన ఆయుధములేవియు తుపాకీల దెబ్బకు నిలబడలేనివయ్యెను. ఇట్లే యూరపుఖండపువారు సముద్రయానసాధనము లనేకములను క్రొత్తగ కనిపెట్టిరి. విశాలములగు ఓడలను నిర్మించుటయేగాక, దిక్సూచి మొదలైన యంత్రము లనేకములను వారు నిర్మించిరి. శత్రు వినాశమందును, స్వాధికారస్థాపన మందును ఇట్టి క్రొత్తసాధనములు వారి కెంతో ఉపకరించెను. దీనికితోడు క్రీ. శ. 1500 తర్వాత వారిలో సాహసము, స్వాతంత్ర్యాభిలాష, వృద్ధిగాంచెను. ప్రమాదము లెన్నియున్నను లక్ష్యపెట్టక దూరదేశములకు వెళ్ళుటయందును, వానిని జయించుటయందును అత్యంతాసక్తిగలవా రనేకులు బయలుదేరిరి. కొలంబస్, వాస్కో-డిగామా మొదలగువారు చూపిన మార్గములో అనేకులు నడువసాగిరి. క్రొత్త చైతన్యము వారిలో పుట్టి వృద్ధిగాంచెను. ఇన్ని అనుకూల పరిస్థితు లేర్పడుటచేత క్రీ. శ. 1500 తర్వాత యూరపు ఖండవాసులు ప్రపంచమం దంతట వారి ప్రాబల్యమును స్థాపించగలవారైరి.

# 2

# స్పెయిన్, పోర్చుగల్ దేశముల ప్రాబల్యము

పాశ్చాత్యుల ప్రాబల్యమునకు పునాదుల వేసినవారు స్పెయిన్ పోర్చుగల్ దేశములవారు. స్పెయిన్ రాజుయొక్క ఉద్యోగమందుండిన కొలంబస్ అమెరికాఖండమును కనుగొనుటయు, పోర్చుగల్ రాజుయొక్క ఉద్యోగమందుండిన వాస్కోడిగామా ఇండియాకు క్రొత్తమార్గమును కనుగొనుటయు దీనికి కారణము. ఏ దేశపువారు కనుగొనిన మార్గమున వారుతప్ప వారిఅనుమతిలేక మరియెవ్వరును నడువరాదన్న సంప్రదాయము ఆకాలపు యూరోపియనులలో నున్నందున ఈ రెండు దేశములవారు మాత్రమే ఆక్రొత్తమార్గముల నుపయోగింపగలవారైరి. ఇదిగాక వీరిలో వీరికి స్పర్ధలురాకుండుటకై అప్పటి క్రైస్తవమత గురువగు పోపు యూరపుఖండమున కావలనున్న ప్రపంచమును రెండుభాగములుగ జేసి పశ్చిమభాగము స్పెయిన్ వాడును, తూర్పుభాగమును పోర్చుగల్

వారును వశపరచుకొనుటకేర్పరచెను. ఈ రెండుకారణముల వలన ఆఫ్రికా ఆశియాఖండములలో పోర్చుగీసువారును, అమెరికాఖండములో స్పెయిన్‌వారును జోక్యము కలిగించు కొనిరి. వర్తకవ్యాపారముల మూలమున లాభమును సంపాదించుట వారి ప్రధానోద్దేశమైనను ఈ ఖండములలోనివారిని క్రైస్తవమతములోనికి మార్చు ఉద్దేశముతోకూడ వీరచ్చటికి వెళ్లిరి.

క్రీ. శ. 1500 పూర్వము ఆశియా యూరపు ఖండములమధ్య జరుగుచుండిన వ్యాపారములో చాల భాగము మహమ్మదీయ మతావలంబకులగు అరబ్బీ వర్తకుల వశమందుండెను. ఆ వర్తకముపై సుంకములను విధించి మార్గమధ్యమందుండిన ఈజిప్టు మొదలగు దేశముల నేలుచుండిన మహమ్మదీయరాజులు ఎక్కువ ఆదాయమును సంపాదించుచుండిరి. కాని ఇండియా మొదలగు తూర్పుదేశములతో క్రొత్తమార్గమున వ్యాపారముచేయుటకు పోర్చుగీసువారు వచ్చుటచేత మహమ్మదీయ వర్తకులకును, రాజులకును విస్తారనష్టము కలుగునట్లేర్పడెను. అందుచేత వీరు పోర్చుగీసు వారి నడ్డగింపసాగిరి. వీరిని ఓడించినగాని తమ యుద్దేశములు కొనసాగజాలవని పోర్చుగీసువారు గ్రహించి, అందుకై సర్వప్రయత్నములగావించి, తుదకు క్రీ. శ. 1509 లో మన దేశపు పశ్చిమతీరమందుండు డయ్యూ ద్వీపసమీపమున జరిగిన నౌకాయుద్ధములో శత్రువులను పూర్తిగ నోడించి గొప్ప విజయమును సాధించిరి. పోర్చుగీసువారి ఓడలు గొప్పవగుటయు,

వేగముగ ప్రయాణము చేయగలుగుటయు, వారియొద్ద తుపాకి బల మధికముగ నుండుటయు వారి విజయమునకు కారణములయ్యెను. పోర్చుగల్ నుండి ఆఫ్రికా ఖండము మీదుగను, హిందూమహాసముద్రము మీదుగను ఇండియాను, ఇండియాకు తూర్పుననుండు దేశములను చేరుటలో మార్గమం దచ్చటచ్చట కొన్ని కీలక ప్రదేశములను సంపాదించుట పోర్చుగీసువారి కత్యవసరమయ్యెను. ఈ అవసరము తీరుటకై వారు అల్బూకర్క్ అనువాని నాయకత్వమున క్రీ. వె. 1508–1515 మధ్యన నౌకాదళమును సమకూర్చుకొని, శత్రువు లనేకయుద్ధముల నోడించి, గోవాపట్టణమును వశపరచుకొని, పోర్చుగీసు సాగర సామ్రాజ్యమునకు దానిని రాజధానిగ జేసి, తర్వాత సుమాత్రా, జావా మొదలగు తూర్పు ద్వీపములపై దండెత్తి, కీలక రేవుపట్టణములలో నొకటియగు మలాకాను స్వాధీనపరచుకొని, ఇరుగు పొరుగునందుండిన ఇండోచైనా రాజులతో మైత్రిని సంపాదించి, తర్వాత త న్నెదిరించిన టర్కీ పర్షియా దేశములవారిపై బడి, పర్షియన్ సింధుశాఖలోని ఆర్మజ్ పట్టణమును తీసికొని, అయిదు సంవత్సరములలో అరబ్బీల ప్రతిభను నాశముగావించి, దాని స్థానమున పోర్చుగీసు ప్రాబల్యమును హిందూ మహాసముద్ర తీరమందంతట స్థాపించిరి. వర్తకము నిలబడుటకు కావలసిన రేవు పట్టణములను వశపరచుకొనుటయే అల్బూకర్కు ఉద్దేశము. దేశముల లోపలికి ప్రవేశించి భూసామ్రాజ్యమును సంపాదించుట కితడిష్టపడిన వాడు కాడు. ఇతని తర్వాత అధికారములోనికి వచ్చినవారు కూడ నీ పద్ధతినే అనుసరించి,

సింహళద్వీపములో కొంత భాగమును వశపరచుకొనిరి. వారి వ్యాపారము చైనా, జపాన్ దేశములవరకు వ్యాపించెను. కాని వీరి ప్రాబల్యము వంద సంవత్సరముల కంటె నెక్కువగ నిలబడినదికాదు. పోర్చుగల్ మిక్కిలి చిన్న దేశము. అందులోని జనసంఖ్య పదునైదు లక్షలు మాత్రమే. అట్టి స్థితిలో వారి ప్రాబల్యమును నిలబెట్టుకొనుటకు కావలసిన గొప్ప నౌకాదళములను, సైన్యములను సమకూర్చుకొనుట వారికిసాధ్యము కాదయ్యెను. వారు, తాము వశపరచుకొనిన గోవా మొదలగు పట్టణములలోని స్త్రీలను వివాహమాడి, దానిమూలమున కలిగిన సంతతితో తమ అధికారమును స్థిరపరచుకొన ప్రయత్నించిరి గాని అది సఫలము కాకపోయెను. మతాంతరులను క్రైస్తవుల గావించుటలో వారు కొంత క్రౌర్యమును ప్రదర్శించిరి. అందుచేత తూర్పు దేశములలోని ప్రజలు వారిని అసహ్యించుకొనసాగిరి. ఇదిగాక క్రీ. శ. 1580 లో పోర్చుగల్, స్పెయిన్ రాజుల వశము లోనికి వచ్చెను. అందుచేత కూడ పోర్చుగీసువారి కనేక కష్టములు సంభవించెను. తుదకు క్రీ. శ. 1600 నాటికి వారు తక్కిన యూరోపియనుల పోటీకి నిలబడలేక వారి సామ్రాజ్యమును కోల్పోయిరి.

పోర్చుగీసువారు ఆశియాఖండమునకు వచ్చినట్లు స్పెయిన్‌వారు అమెరికా ఖండములోని మధ్య దక్షిణ భాగములకు వెళ్ళిరి. అప్పటి కా ప్రాంతములలో కొన్ని నాగరికత గాంచిన రాజ్యము లుండినను, మొత్తముమీద ప్రజలలో చాలభాగము అనాగరికులై యుండిరి. ఖండము విశాల

మైనదైనను అందలి జనసంఖ్య మిక్కిలి స్వల్పముగ నుండెను. నాగరికత గాంచిన రాజ్యములలో మెక్సికో దేశములోని అజ్టెక్ (Aztec) రాజ్యము, పెరుదేశములోని ఇంకా (Incas) రాజ్యము ప్రసిద్ధిగాంచి యుండెను. రాతి కట్టడములను, రోడ్లను, జలాధారములను నిర్మించుటయందు అచ్చటివా రెక్కువ నేర్పుచూపియుండిరి. బట్టలు నేయుటయందును, గనులలో పనిచేసి వెండిబంగారములను పైకి తీయుట యందును, వ్యవసాయము చేయుటయందును వారు కుశలులై యుండిరి. నక్షత్రశాస్త్రము, గణితశాస్త్రము, చిత్రలిపి, వా రెరిగి యుండిరి. కాని వారి మతము శిష్టాస్మృతి మిక్కిలి క్రూరములగు ఆచారములతో కూడియుండెను. ఇనుప సామానులు, తుపాకిమందు, తుపాకులు, పెంపుడు జంతువులు వారికి క్రొత్త. ఇట్టివారిపై స్పెయిన్‌వారు దండెత్తి, వారిలోని పరస్పర భేదముల నాధారముచేసికొని, స్వల్ప సైన్యములతో సునాయాసముగ క్రీ. వె. 1519 లో మెక్సికో పట్టణమును వశపరచుకొని, తమపై తిరుగుబాటుచేసిన ప్రముఖులను చిత్రవధ గావించి క్రీ. వె. 1521 నాటికి అజ్టెక్ రాజ్యము నంతను జయించిరి. ఈ పనిని సాధించిన వాడు కార్టెజ్ (Cortez) అను స్పెయిన్ నాయకుడు. అటు తర్వాత పది సంవత్సరములకు పిజరో (Pizarro) అను మఱి యొక స్పెయిన్ వీరుడు దక్షిణ అమెరికాలోని ఇంకా రాజుల నోడించి పెరూదేశమును వశపరచుకొనెను. ఈ విధముగ ప్రారంభమైన అమెరికాలోని స్పెయిన్ సామ్రాజ్యము క్రమ క్రమముగ మధ్య దక్షిణ అమెరికాలో వ్యాపించెను. క్రీ. వె.

1550 నాటికి బ్రెజిల్ దేశము తప్ప తక్కిన భాగమంతయు స్పెయిన్‌వారి పాలనలోనికి వచ్చెను. బ్రెజిల్ దేశమును పోర్చుగల్‌వారు జయించి పాలించిరి. కొలంబస్ అమెరికా ఖండమును కనిపెట్టిన తర్వాత అరువది సంవత్సరములు దాటకపూర్వమే మధ్య దక్షిణ అమెరికాలలో యూరపు ఖండవాసుల ప్రాబల్యము స్థిరపడెను.

తాము జయించిన ప్రదేశములలో స్పెయినువారు తమ దేశములోని పట్టణములవంటి పట్టణములను, భవనములను, చర్చిలను, పాఠశాలలను నిర్మాణము గావించిరి. ఈ ప్రదేశములను పాలించుటకు స్పెయిన్‌నుండి వచ్చిన ఉద్యోగస్థులలో కొందఱు వర్తక వ్యాపారములకై వచ్చిన తదితరులలో కొందఱు అచ్చటనే స్థిరనివాసముల నేర్పరచుకొనిరి. వీరితో స్పెయిను దేశపుస్త్రీలు ఎక్కువగ రాని కారణమున వీరు అమెరికాస్త్రీలతో కాపురము చేయవలసినవారైరి. ఈ రెండు జాతుల మధ్య వివాహసంబంధములేర్పడి కాల క్రమమున మధ్య దక్షిణ అమెరికాలలో మిశ్రమజాతి వృద్ధిగాంచెను. ప్రస్తుత మచ్చటనున్న పదికోట్ల జనము ఇట్టి మిశ్రమ జాతికి సంబంధించినవారే. వీరందఱు స్పెయినుభాషను మాటలాడుచున్నారు. బ్రెజిల్ దేశములోనివారు మాత్రము పోర్చుగీసుభాషను మాటలాడెదరు. అమెరికా ఖండవాసులను క్రైస్తవ మతావలంబకులుగ చేయుటయందు స్పెయిన్ పాదిరీలు ఎక్కువ శ్రద్ధ వహించిరి. క్రమక్రమముగ వారందఱు క్రైస్తవులైరి. వారి యుపయోగార్థము ప్రతిపట్టణములో

అధమపక్షము ఒక చర్చి, ఒక వైద్యశాల, ఒక పాఠశాల స్థాపింపబడుట మామూలయ్యెను. క్రైస్తవ మతవ్యాప్తి మూలమున అంతకు పూర్వముండిన మతములు మాత్రమే కాక, ఆ మతములతో సన్నిహిత సంబంధముగల ప్రాచీన అమెరికన్ నాగరికతలు కూడ నశించెను. స్పెయిన్ వారి సామ్రాజ్యాధికార ప్రారంభదశలో పశ్చిమఇండియా ద్వీపములందును (West Indies) తదితరప్రదేశములందును ఉండిన అమెరికన్లు అనేక కష్టములకు పాలైరి. వారిచేత శక్తికి మించిపనిచేయించుట స్పెయిన్ అధికారులకు మామూలయ్యెను. ఆకారణమున వారిలో కొన్నికులములవారు, తెగలవారు నిర్మూలితులైరి. వారిస్థానమున పనిచేయుటకు ఆఫ్రికా ఖండమునుండి నీగ్రోలను బానిసలుగచేసి, తెచ్చుట స్పెయిన్ వారి కవసరమయ్యెను. ఇదికూడ వారిరాజ్యపరిపాలన లోపములలోనొకటి. ఇట్టి లోపము లనేకములుండినను మొత్తముమీద యూరపు ఖండపునాగరికతా విజ్ఞానములు ప్రపంచమంత వ్యాపించుటలో స్పెయిన్ పోర్చుగీసువారు చేసినసేవ అపారమని గుర్తించుట అవసరము. మధ్యదక్షిణ అమెరికాలు పాశ్చాత్యనాగరికప్రపంచములో కలిసిపోవుట కిదియే కారణము. ఇదిగాక భిన్నజాతుల వారు పరస్పరము వివాహాము చేసికొనుట నింద్యాచారము కాదని దక్షిణ అమెరికాలోని మిశ్రజాతి సంతతివారు ఋజువు చేయగలిగిరి.

పోర్చుగీసువారిది వ్యాపారసామ్రాజ్యము. వ్యాపారము వృద్ధిగాంచుటకు కావలసిన ప్రదేశములను మాత్రమే వారు ఖండాంతరములలో సంపాదించిరి. స్పెయిన్ వారిసామ్రాజ్యము

అమెరికాలోని దేశములనేకములను పసిఫిక్ సముద్రములో ఫిల్ప్పైన్ ద్వీపములను వారుజయించి, వానిలో తమ వలసల నేర్పరుచుకొనిరి. బ్రెజిల్ దేశమొక్కటే పోర్చుగీసు సామ్రాజ్యములోని వలసరాష్ట్రము. పోర్చుగీసుసామ్రాజ్య స్థాపనము మూలమున ఆశియా యూరపు ఖండములమధ్య వ్యాపార మత్యధికమయ్యెను. పోర్చుగల్ దేశమునకు ప్రధాన పట్టణమైన లిస్బన్ సమస్తైశ్వర్యములతో తులతూగ గలదయ్యెను. ఇంగ్లీషు, డచ్చి, ఫ్రెంచివర్తకు లచ్చటికివచ్చి ఆశియాఖండపు సరకులను పోర్చుగీసువారియొద్దనుండి కొని, ఉత్తరయూరపు దేశములలో విక్రయించి లాభముసంపాదించుచుండిరి. స్పెయిన్ సామ్రాజ్యఫలితము లంతకంటె భిన్నములుగనుండెను. వారు జయించిన మెక్సికో, పెరు మొదలగు దేశములలో వెండి బంగారము లమితముగ లభించుచుండెను. వారు వానిని యూరపుఖండమునకు తెచ్చి. వానితో తమకు కావలసిన పదార్థములనన్నింటిని కొని, సుఖముగ జీవింపసాగిరి. దీనిఫలితముగ యూరపులోని వెండి బంగారముల చెలామణి పదిపండ్రెండురెట్లు వృద్ధిగాంచి ధరలు విపరీతముగ పెరిగెను. దీనిమూలమున సామాన్య ప్రజలలోను కార్మికులలోను కొంత అసంతృప్తియు ఆందోళనయు కలిగి కొన్ని అల్లరులకు తిరుగుబాటులకు కారణమయ్యెను. ఇంతకుపూర్వము భూస్వాములొక్కరే ధనికవర్గమున చేరియుండిరి. ఇప్పుడు వర్తకవ్యాపారములమూలమున ధనమునుసంపాదించిన సాహుకారీవర్గము ప్రాధాన్యముగాంచసాగెను. ప్రతిదేశమందును వారిపలుకుబడి వృద్ధియగు అవకాశము లేర్పడెను. దీనితో

పాటు ఆశియానుండియు అమెరికానుండియు అనేకపదార్థము లెక్కువగ యూరపు ఖండమునకు వచ్చుటచేత వాని ననుభవించు అలవాటు అచ్చటివారిలో వ్యాపించెను. పంచదార, ప్రత్తిబట్టలు, పట్టుబట్టలు, సుగంధద్రవ్యములు, రంగులు, లోహపుసామానులు, దంతపుసామానులు, ఔషధములు పూర్వముకంటె నిప్పుడధికముగ వాడుకలోనికివచ్చెను. పొగాకు, తేయాకు, కాఫీ, బంగాళాదుంపలు, నిమ్మ, నారింజ, అరటి, అనాస మొదలగువానికి యూరోపియను లనేకు లలవాటుపడిరి. ఇట్టిపదార్థములు లేనియెడల సుఖముగ జీవించుట సాధ్యముకాదన్న భావము వ్యాపించసాగెను. అన్నివర్గములలో సుఖముగ జీవించుట కెక్కువ అవకాశము లేర్పడెను. ఇదంతయు స్పెయిన్ పోర్చుగల్ దేశములవారి యాటపూన్యమున యూరోపియన్ల ప్రాబల్యము ఖండాంతరములలో వ్యాపించుటవలన కలిగిన ఫలితములు.

వర్తకవ్యాపారములు వృద్ధిగాంచుటతప్ప పోర్చుగీసువారు ఆశియాకు వచ్చుటవలన ఆశియాఖండవాసులలో గొప్పమార్పు లేవియు కలుగలేదు. యుద్ధవిద్యలయందు ఆశియావారికంటె పోర్చుగీసువారెక్కువ నేర్పరులుగనుండిరే గాని తక్కిన విషయములందు వారియొద్ద నుండి నేర్చుకొనదగిన విశేషము లేవియు ఆశియాఖండవాసులకు కనుపించలేదు. నాగరికతయందును విజ్ఞానమందును వారు పోర్చుగీసువారికంటె ఉత్తములుగ నుండిరి. కాని స్పెయిన్‌వారి మూలమున మధ్య దక్షిణ అమెరికాలలో గ్రహింపదగిన మార్పులనేకములు కలిగెను. అక్కడివారు ఎక్కువ నాగరికత కల

వారు కాకపోవుటయు, విద్యలన్నిటియందు వారు హీనదశలో నుండుటయు దీనికి కారణము. స్పెయిన్ వారి కృషిమూలమున అమెరికా దేశములకు గుఱ్ఱములు, పశువులు, గాడిదలు, పందులు, గొఱ్ఱెలు, కోళ్లు మొదలగునవి తీసికొని పోబడెను. నిమ్మ, నారింజ, ద్రాక్ష, నారదినుసు లనేకములు, పట్టు, పట్టుపురుగులు, పంచదార, కాఫీ, నీలిమందు, ఇనుము మొదలైనవాని ఉపయోగములను వారు అమెరికావారికి నేర్పిరి. ఇదే విధము వారు అనేకపరిశ్రమలను కళలను అచ్చట ప్రవేశపెట్టిరి. క్రైస్తవమత సిద్ధాంతములను ఇతర యూరపుఖండపు శాస్త్రములను వారచ్చట ప్రచారము చేసిరి. కనుక స్పెయిన్ వారు అమెరికాలో కలిగించినంత మార్పును పోర్చుగీసువారు ఆశియాఖండములో కలిగించుట కవకాశము లేకపోయెను.

క్రీ. శ. 1600 నాటికి పోర్చుగీసువారి ప్రతిభ తగ్గెను. స్పెయిన్ వారి ప్రతిభ విస్తారము తగ్గకపోయినను, అప్పటినుండి వృద్ధిగాంచు అవకాశములు దానికి లేకపోయెను. ఇట్టి పరిస్థితులేర్పడుటకు ఇంగ్లీషువారి యొక్కయు డచ్చివారి యొక్కయు, ఫ్రెంచివారియొక్కయు పోటీకి ఈ రెండుదేశములవారు నిలబడకపోవుటయే ప్రధానకారణము. వీరిమధ్య పోటీ అధికమగుటకు క్రైస్తవమతములో పదునారవ శతాబ్ద ప్రథమార్ధభాగమున కలిగిన విప్లవము ముఖ్యహేతువులలో నొకటి యగుటచేత దాని స్వరూపవివరణ మవసర మగుచున్నది.

# 3

## మత విప్లవము

మానవునిజీవిత విధానమందు కలుగు విపరీతమైన మార్పునకు విప్లవమని పేరు. పదునారవ శతాబ్దపు పూర్వార్థమున నిట్టి విప్లవము క్రైస్తవమత మందుకలిగెను. దాని స్వరూపమును గ్రహించుటకుపూర్వము మతమునకుగలకొన్ని ప్రధానలక్షణముల పేర్కొనుట అవసరము. గొప్ప మతములలో నొక్కొక్కదానికి ఏవియో కొన్ని ప్రమాణగ్రంథములున్నవి. హిందూమతమునకు వేదములు, భగవద్గీత మొదలగునవి ప్రమాణగ్రంథములైనట్లు. క్రైస్తవమతమునకు బైబిలు ప్రమాణగ్రంథము. కాని ఇట్టిగ్రంథములలోని విషయములను గురించి ఆయామతముల ననుసరించువారికి సందేహములు, అనుమానములు, వాదోపవాదములు కలుగుచుండుట సహజము. అట్టి వాదోపవాదములను తీర్చగల అధికారులు ప్రతి మతమందు కొందఱున్నారు. పీఠాధిపతులట్టివారు. పదునారవ

శతాబ్దమువరకు క్రైస్తవులకు రోమ్‌పట్టణపీఠము నధిష్ఠించిన "పోపు" అధికారిగనుండెను. అతడును, అతడునియమించిన ఇతరఉద్యోగులును ప్రజలకు కలిగిన సందేహములను తీర్చుచు ప్రమాణగ్రంథములకు వ్యాఖ్యానము చేయుచుండిరి. వీరందఱు పురోహితవర్గమునకు చెందిన అధికారులు (Priests). ఇట్టి వర్గమొకటి యుండుట ప్రతిమతమున కొకలక్షణము. ఇది గాక ప్రతి మతమందు భగవంతుడు, స్వర్గము, నరకము, ఆత్మ మొదలగు పరోక్షవిషయములగురించి సిద్ధాంతములు కొన్ని కలవు. ప్రమాణగ్రంథములతోపాటు ఇట్టి సిద్ధాంతములను నమ్ముట ఆయామతముల ననుసరించువారికి సహజము. ఇది మతమునకు మూడవలక్షణము. ఇట్లే భగవంతుని కటాక్షము పొందుటకును, నరకబాధను తప్పించుకొనుటకును, స్వర్గసౌఖ్యము ననుభవించుటకును ప్రతిమతములో కొన్ని సాధనములు ప్రశంసింపబడియున్నవి. తపస్సు, వ్రతములు, ప్రార్థన, పుణ్యక్షేత్రములకు యాత్రలు, మొదలైనవి ఇట్టి సాధనములు. ప్రతిమతము కొద్దిగనో గొప్పగానో ఇట్టిబాహ్య కర్మల ప్రాధాన్యమును గుర్తించి యున్నది. కర్మలనవసరములని బోధించు మతములు లేవు. మతమున కిది నాల్గవలక్షణము. ఈ నాలుగులక్షణములలో కొన్నింటియందుగాని అన్నింటియందుగాని విపరీతమైన మార్పుకలిగిన యెడల గొప్ప మత విప్లవము సంభవించినట్లు చెప్పవచ్చును.

అదివరకు క్రైస్తవ మతమునకు ప్రధానములుగనున్న లక్షణములలో కొన్నింటియందు పదునారవ శతాబ్దమున

గొప్పమార్పు కలిగెను. ఈమార్పు మొదటి లక్షణములో కలుగలేదు. పదునారవ శతాబ్దము తర్వాతకూడ క్రైస్తవు లందఱు బైబిలునే ప్రమాణగ్రంథముగ స్వీకరించి యుండిరి. కాని వారిలో కొందఱది మొదలు పోపుయొక్క ఆధిపత్యమును నిరసించిరి. ఇదిగాక ఇట్టివారిలో అనేకులు వేయి సంవత్సరములుగ ననుసరింపబడుచుండిన వ్రతములు; సంస్కారములు, పూజా విధానములు మొదలగు వానిని ఖండించి, అట్టివి అవసరము లేదని ప్రతిపాదించిరి. వీని ఫలితముగ మొదటిలక్షణమునగాక తక్కినవానిలో క్రైస్తవ మతమందు విప్లవము సంభవించి క్రైస్తవులు రెండు ప్రధానశాఖలుగ విడిపోయిరి. ప్రాచీన సంప్రదాయములను, వానితోపాటు పోపుయొక్క ఆధిపత్యమును అంగీకరించినవారు రోమన్ క్యాతలిక్ (Roman Catholic) శాఖవారైరి. తదితరులు ప్రొటెస్టాంటు (Protestant) శాఖవారైరి. ప్రొటెస్టాంటు శాఖకు చెందిన వారిలో క్రమక్రమముగ ఉపశాఖలనేకములు బయలుదేరెను. మతఐక్యతకు బదులు భిన్నత్వమేర్పడుటయే పదునారవశతాబ్దపు క్రైస్తవమత విప్లవమునకు లక్షణము.

ఈ విప్లవమునకు మతసంబంధములైన విషయములు మాత్రమే కారణములుకావు. వీనిలో రాజకీయ, ఆర్థిక, సాంఘిక, రాజకీయ వైజ్ఞానిక కారణము లనేకములు కలిసియుండెను. పదునారవ శతాబ్దప్రారంభము నాటికి పోపులు, పురోహితవర్గములో చేరినవారనేకులు భోగలాలసులై వారి కాలమును ఐహికసుఖములందును, ఏదియో ఒక నెపముబెట్టి

ప్రజలనుండి ధనము లాగుటయందును గడపుచుండిరి. విద్యా విహీనులైనవారును మంత్రవాక్యములను క్రమముగ నుచ్చరించుటకూడ తెలియనివారును మతోద్యోగములలో నియమింపబడుచుండిరి. మతాధికారులలో అవినీతి ప్రబలెను. మతాధికారులు బ్రహ్మచారులుగ నుండవలెనను సంప్రదాయముండినను వారిలో ననేకులు దానికి విరుద్ధముగ ప్రవర్తించుచుండిరి. పోపులలోకూడ ఇట్టివారు కొందఱు కలరు. దీనికితోడు వీరు ఇతరరాజులవలె తమరాజ్యమును వృద్ధిచేసికొనుటయందును, అందుకై కుట్రల పన్నుటయందును, యుద్ధముల సాగించుటయందును ఎక్కువ శ్రద్ధను చూపించుచు మతవిచారమందును ప్రచారమందును నిర్లక్ష్యభావమును వహించియుండిరి. పేదలను రోగులను పోషించి రక్షించుటకును, ఇతర ధర్మకార్యముల చేయుటకును భక్తులిచ్చిన భూములనుండి వచ్చిన ఆదాయమును మతాధిపతులు ధర్మకార్యములకై ఖర్చుపెట్టక స్వసుఖములకై వ్యర్థపుచ్చుచుండిరి. నీతివిషయములలో తక్కినవారికి మార్గదర్శులుగ నుండవలసినవారీవిధముగ నవినీతిపరులగుటచేత పోపుయొక్క ఆధిపత్యముపై క్రైస్తవులలో విరోధభావము వృద్ధిగాంచెను.

కాని పోపులలోను, తక్కిన మతాధికారులలోను అవినీతి క్రొత్తగాదు. అప్పుడప్పుడు అవినీతిపరులు వారిలో కొంద ఱుండియుండిరి. కాని జనసామాన్యములో వారి యెడల గౌరవభావము ఇంతకుపూర్వము మెండుగ నుండెను. పదునైదవ శతాబ్దమందుండి యూరపుఖండములోని ఇతర

పరిస్థితులు మారుటచేత నీ గౌరవభావము తగ్గి, వారియెడల విరోధమును వహించినవారి సంఖ్య అధికమయ్యెను. ప్రజలలో జాత్యభిమానము పుట్టిన కారణమున రోమ్ పట్టణవాసియగు పోపు పరజాతివాడనియు అతనియధికారమునకు తాము లోబడి యుండుట జాతిగౌరవమునకు భంగకరమనియు కొందరు భావించిరి. మధ్యయుగమున పోపులకు మతాధికారముతోపాటు క్రైస్తవులందఱిపై కొన్ని పన్నుల విధించి వసూలుచేయుట, కొన్ని రకములైన నేరముల జేసినవారిని తమన్యాయస్థానములలో విచారణచేసి శిక్షించుట మొదలగు అధికారములుండెను. నిరంకుశ ప్రభుత్వమును స్థాపింప కంకణము గట్టుకొనిన రాజులకిది నచ్చినదికాదు. పోపులకుండు అధికారమునంతను తామేవహించుటకు వారుసంకల్పించిరి. అట్టిరాజులు పోపులపై విరోధమువహించుట కీసంకల్పమే ప్రధానకారణము. పోపుల అధికారము తొలగినయెడల చర్చి వశమందుండిన భూములు తమ వశమగునని వీరుభావించిరి. మతాధిపతులకు భూములుగాని ధనధాన్యములుగాని అవసరములేదను వాదమును వీరు లేవదీసి బలపరచిరి. మధ్యవర్గమునకుచెంది, ఎదియో ఒక విధమున ధనలాభమును సంపాదించుటయే పరమార్థమను భావముతోనుండిన నూతనవర్తకులు రాజుల వాదమునకు ద్రోహదముచేసిరి. చర్చి వశమందుండు ధనము, భూమి దేశాదాయము వృద్ధియగుటలో తోడ్పడుట లేదనియు, దానిమూలమున సోమరితనము వృద్ధియగుచున్నదనియు, అది వర్తకుల వశమైనయెడల వారు దానిని వ్యాపారమందును పరిశ్రమలయందును వినియోగించి ఆదాయమును వృద్ధిచేయగలరనియు

వీరు ప్రచారముచేయసాగిరి. పోపులు ఇట్టి ప్రచారమున కిష్ట పడరైరి. ఇదిగాక వడ్డీవ్యాపారము, క్రయవిక్రయములలో ధర్మవిరుద్ధముగ నధికమైనధరలను విధించుట మొదలగువానిని పోపులు ఖండించుచుండిరి. ఇందుచేత ధనికులలో ననేకులు పోపులకు విరోధులైరి. కనుక అధికారకాంక్ష ధనకాంక్ష మొదలగునవి కూడ మతవిప్లవమునకు కారణములయ్యెను.

పోపులయందును మధ్యయుగపు క్రైస్తవసిద్ధాంతములందును కర్మలయందును పదునారవశతాబ్ద ప్రారంభమగు నాటికి విద్యావంతులు కొందఱిలోకూడ విరోధభావము ప్రబలెను. మధ్యయుగపు పండితులు నేర్పిన విద్యలకును పదునైదవశతాబ్ద మందుండి పండితు లభిమానించిన విద్యలకును భేదమేర్పడుటయే దీనికి కారణము. పదునైదవశతాబ్దమందుండి ప్రాచీన గ్రీకుల గ్రంథములను చదువుట పండితులకు పరిపాటి అయ్యెను. అట్టివారే పండితులని యనిపించుకొనువారైరి. గ్రీకులు హేతువాదమును సమర్థించినవారు. ప్రతి మనుష్యుడు స్వయముగ నాలోచించి సత్యమును తెలిసికొనుట అవసరమని వారు బోధించిరి. అధికారపదవులలో కొంద ఉన్నంత మాత్రమున వారిమాటలలో ఎక్కువ సత్యమున్నదని యనుకొనుట పొరపాటని వారిమతము. అట్టి గ్రంథములను యూరపు ఖండములోని పండితు లెక్కువగ చదువుటచేత హేతువాదానుసారమగు అభిప్రాయములు ప్రచారములోనికి వచ్చెను. దీనికితోడు క్రొత్తగ కనిపెట్టబడిన అచ్చుయంత్రము మూలమున గ్రంథములు చౌకగ సామాన్యుల అందుపాటు

లోనికి వచ్చెను. పూర్వముకంటె నిప్పుడు పుస్తకముల చదువువారి సంఖ్య వృద్ధిగాంచెను. కనుక నూతనాభిప్రాయములు పండితులలో మాత్రమేగాక సామాన్యులలోకూడ వ్యాపించెను. ఇదిగాక గ్రంథకర్తలు దేశభాషలలో గ్రంథములను వ్రాయసాగిరి; కొందరు బైబిలును కూడ దేశభాషలలోనికి అనువదించిరి. మధ్యయుగమున ల్యాటిన్ భాష పండితభాషగను, పవిత్రమైన భాషగను పరిగణింపబడియుండెను. చర్చిలయందు దానిని తప్ప మతేభాషను వాడరాదను సంప్రదాయముండెను. దేశభాషలలో గ్రంథములు బయలు దేరుటచేత ల్యాటిన్ భాషయం దిదివరకున్న గౌరవము తగ్గెను. అదియొక్కటే పవిత్రభాషయని చెప్పు చర్చి యెడలను పోపులయెడలను కూడ గౌరవభావము తగ్గెను. ఎవనికివాడే ఆలోచించుకొని సత్యమును తెలిసికొనవలయునను సిద్ధాంతము కూడ ఈ గౌరవభావము తగ్గుటకు కారణమయ్యెను.

మత విప్లవమును లేవదీయుటకు మధ్యయుగమున కూడ కొందఱు ప్రయత్నించిరిగాని వారికిట్టి అనుకూల పరిస్థితులు సమకూరనికారణమున వారి యుద్యమములు ఫలించినవి కావు. పదునారవ శతాబ్దమందట్లుగాక విప్లవమునకు కావలసిన పరిస్థితులన్నియు నేర్పడియుండెను. రాజులు, వర్తకులు, విద్యావంతులు, సామాన్యప్రజలు—వీరందఱు విప్లవమునకు సుముఖులుగ నుండిరి. ఇట్టి తరుణమున జర్మనీ దేశములో మార్టిన్ ల్యూతర్ (Martin Luther) ఈ క్రొత్త పరిస్థితులను పురస్కరించుకొని విప్లవోద్యమము నచ్చుట ప్రారం

భించెను. ఇతడు క్రీ. వె. 1483 లో నొక సామాన్యమైన రైతుకుటుంబమునబుట్టి విద్యలనేర్చికొని విశ్వవిద్యాలయములలో నొకదానియం దాచార్యుడుగ నుండెను. క్రీ. వె. 1517 లో నచటికి పోపుయొక్క ప్రతినిధియొకడు పాప పరిహార పత్రములనమ్మి, పోపు రోమ్ నగరములో కట్టదలచిన సెంటుపీటర్ చర్చికి కావలసిన కోట్లకొలది ద్రవ్యమును సంపాదించు నుద్దేశముతో నుండెను. తగిన క్రయమిచ్చి పాప పరిహార పత్రమును కొనినయెడల కొన్నవాడంతకుపూర్వము ఎన్ని పాపములను చేసియుండినను పోపుయొక్క ఆశీర్వాద బలమువలన నరకబాధను తప్పించుకొనగలవాడగునని పోపుయొక్క ప్రతినిధి ప్రచారము చేయుచుండెను. అనేకులాకారణమున పత్రములు కొనసాగిరి. ల్యూతర్ దేనిని సహించక, పత్రముల మూలమున పాపము పరిహరింపబడజాలదనియు, వేనిని విక్రయించుట మతమును దుర్వినియోగము చేయుటయనియు చెప్పుచు పోపుయొక్క అధికారమును ఎదిరించెను. ఈ విధముగ నింతటిధైర్యముతో పోపు నెదిరించిన వారంతకు పూర్వమెవ్వరులేరు. జర్మనీలోనివా రనేకులు ల్యూతర్‌ను ప్రశంసించిరి. కాని పోపు అత్యుగ్రుడై ల్యూతర్‌ను బహిష్కరించుచు నొక బహిష్కార పత్రమును పంపెను. ల్యూతర్ దానినందుకొని, బహిరంగముగ బజారులో దానిని కాల్చివేసెను. పోపు మఱింత యుగ్రుడై, మతవిరోధి (Heretic) అను నేరమును ల్యూతర్‌పై మోపి. అతనిని విచారణ చేయవలసినదిగ చక్రవర్తిని కోరెను. విచారణ సమయమున నెట్టి జంకు లేక, అతి ధైర్యముతో

ల్యూతర్ తనవాదమును నిలబెట్టుకొనుటయేగాక మత విషయములలో పోపునకెట్టి అధికారము లేదనియు, పోపు అను పీఠాధిపతి యొకడుండుట క్రైస్తు బోధించిన మతమునకు విరుద్ధమనియు వెల్లడించెను. చక్రవర్తి యతనికి కారాగృహశిక్షను విధించెను, కాని జర్మనీలోని చిన్న సంస్థానాధీశులలో నొకడును ల్యూతర్‌ను మొదటినుండియు పోషించి గౌరవించుచున్నవాడును అగు స్యాక్సనీ రాజు (Elector of Saxony) అతనిని సంవత్సరకాలము దాచి రక్షించెను. ఆ సంవత్సరమున ల్యూతర్ బైబిలును జర్మన్ భాషలోని కనువదించి మతమునకును వాఙ్మయమునకును అపారమైన సేవ చేసెను. పోపుయొక్క ఆధిపత్యమును, మధ్యయుగపు క్రైస్తవ సిద్ధాంతములను కర్మలను ఖండించుచు నతడితర గ్రంథము లనేకములను రచించెను. వీని ఫలితముగ ఉత్తర జర్మనీలోని సంస్థానాధీశు లనేకులు, సామాన్య ప్రజ లతనికి అనుచరులై, పోపు ఆధిపత్యమును నిరాకరించి ప్రొటెస్టాంటు శాఖలో చేరిరి. ఈ విధముగ క్రీ. శ. 1517–1521 మధ్యన మతవిప్లవము జర్మనీదేశమందు ల్యూతర్ నాయకత్వమున జన్మించెను.

క్రమక్రమముగ నిది వృద్ధిగాంచెను. పరకీయులగు పోపుయొక్కయు చక్రవర్తియొక్కయు అధికారమును తొలగించుట కిదియే సమయమని దేశాభిమానులగు జర్మనులనేకు లందుచేరిరి. పురోహితుల శృంఖలములనుండి తప్పించుకొని బైబిలొక్కదానినే నమ్ముట యుత్తమమార్గమనుబోధ అనే

కుల నాకర్షించెను. చర్చియొక్క భూములను ధనమును అపహ రించుటకు తగినసమయము లభించెనని జమీాన్ దారులు ప్రొటె స్టాంటులైరి. కొంతకాలమునకు ల్యూతర్ సిద్ధాంతము యూరపు ఖండములోని మఱికొన్ని దేశములలోనికి వ్యాపించి అక్కడి వారుకూడ ప్రొటెస్టాంటులైరి. ఈదేశములలో నొక్కొక్క దానియందొక ప్రఖ్యాతిగాంచిన విప్లవనాయకుడు బయలు దేరెను. స్విట్జర్లాండులో జ్వింగ్లీ (1484-1531), కాల్విన్ (1500-1564), స్కాట్లెండులో జాన్ నాక్సు మొదలగు వారిట్టివారు. ఇంగ్లండులో నధికారకాంక్షగలరాజులే విప్లవ నాయకులైరి. తుదకు క్రీ. వె. 1560 నాటికి ఉత్తరయూరపు లోని ఇంగ్లండు, స్కాట్లెండు, డెన్మార్కు, నార్వే, స్వీడన్, హాలెండు, ఉత్తరజర్మనీ దేశములు, మధ్యయూరపులోని స్విట్జర్లాండు, బొహిమియా దేశములు ప్రొటెస్టాంటుమతమును స్వీకరించెను. ఫ్రాన్సులోకూడ కొందఱు ప్రొటెస్టాంటులైరి.

ప్రాచీన సంప్రదాయములందును సిద్ధాంతము లందును నిజమైనగౌరవాభిమానములుండిన క్రైస్తవులు ప్రొటెస్టాంటు శాఖయొక్క ప్రాబల్యమును నిరోధించుటకు సమకట్టిరి. ముక్తినిసాధించుటకు భక్తియొక్కటేచాలుననియు కర్మలవస రములేదనియు ల్యూతర్ ప్రతిపాదించెను. దానిఫలితముగ పుణ్యక్షేత్రములకు యాత్రలుచేయుట పరలోకవాసుల సుఖమునకై పూజలుచేయుట గతించిన భగవద్భక్తుల నామ స్మరణముచేయుట, పర్వదినములను పవిత్రములుగ భావిం చుట, మొదలగు ప్రాచీనాచారములు వెనుకబడిపోయెను

ప్రొటెస్టాంటులలో అతివాదులు కొందఱు చర్చిలలోని సుందర విగ్రహములను నాశముచేసిరి; అనేక చిత్రపటముల రూపు మాపిరి; మఠములలోని ప్రాచీన గ్రంథములను చింపివేసిరి. దేవాదాయములను రాజులు జమీందారులు వర్తకులు వశ పరచుకొనుటచేత మధ్యయుగములో మఠాధిపతులు నడుపు చుండిన విద్యాసంస్థలు పాడుపడెను. క్యాతలిక్ శాఖలోని నాయకుల కిదియంతయు దుర్భరమగు మనోవేదనను కలి గించెను. తమ మతములో లోపములుకొన్ని యుండుట చేతనే ఇట్టి మతవిప్లవము సంభవించెనని వారు గ్రహించి, ఆలోపములను పోగొట్టి, తమ మతమును సంస్కరించి, దాని ఘనతను పునఃస్థాపితము చేయుటకు వారు గట్టి ప్రయత్న ములచేసిరి. అందుకై వారు ట్రెంటుమహాసభ (Council of Trent) ను క్రీ. శ. 1545—1563 మధ్యన సమావేశపరచి లోపము లనేకములను సంస్కరించి పోపులు మఠాధిపతులు నీతిమంతులగునట్లు గావించిరి. సిద్ధాంతములు, వ్రతములు, సంస్కారములు మొదలగు వానియందు మాత్రము వారికి ఎట్టి మార్పు అవసరమున్నట్లు తోచినదికాదు. కాని ప్రాచీన సిద్ధాంతములలోని సత్యములను సమర్థించుటకు వారు క్రొత్త యుక్తులను చూపిరి. ఈ సభయొక్క కృషిఫలితముగ క్యాత లిక్ మతము పునరుద్ధారణమగుటయేగాక మఱింత బలపడి ప్రొటెస్టాంటు మతవ్యాప్తి నరికట్టెను. ఈ పునరుద్ధరణోద్య మమున లయోలా (Loyola) అను స్పెయిను దేశపువాడు సుప్రసిద్ధుడయ్యెను. అతడు జెస్యూట్ (Jesuits) లను క్రొత్త సన్యాసివర్గము నొకదానిని స్థాపించి, దాని సాధనమున

క్యాతలిక్ మతము యూరపుఖండమందు నిలబడునట్లును ఖండాంతరములలో వ్యాపించునట్లును జేసెను.

యూరపుఖండములో లేచిన మత విప్లవముయొక్క ప్రభావము ఆధునిక ప్రపంచ చరిత్రమందు కనుపించు చున్నది. యూరపుఖండవాసుల ప్రాబల్యము ప్రపంచ మందు స్పెయిన్ పోర్చుగల్‌వారి యాజమాన్యమున మాత్రమేగాక డచ్చి, ఇంగ్లీషు, ఫ్రెంచి వారి యాజమాన్య మునకూడ నధికముగ వ్యాపించుట కిది ప్రధాన హేతు వయ్యెను. యూరోపియనుల పరిపాలనాధికారము మాత్రమే గాక వారి వలసలు కొన్ని ఖండములలో స్థాపితమగుటకు కూడ నిది కారణమయ్యెను. ప్రొటెస్టాంటు మతవ్యాప్తి మూలమున యూరపు ఖండములో కోల్పోయిన ఆధిక్యతను ఖండాంతరములందు సంపాదించుటకు క్యాతలిక్కులు ప్రయ త్నముల చేయుటకును, దానిమూలమున ఇతరఖండములలో క్రైస్తవ మతము వ్యాపించుటకును కొంతవఱకు ఇదియే హేతువు.

ఎవరికిష్టమువచ్చిన మతమును వా రనుసరించవచ్చు నన్న న్యాయమున కా కాలమున క్యాతలిక్కులు గాని ప్రొటెస్టాంటులుగాని అంగీకరించిన వారుకారు. క్యాతలిక్కు లను నిర్మూలముచేయవలెనని ప్రొటెస్టాంటులు, ప్రొటె స్టాంటులను రూపుమాపవలెనని క్యాతలిక్కులు, ఇందుకై యుద్ధములను కూడ చేయుట ధర్మమని రెండుపక్షముల వారును పట్టుపట్టియుండిరి. మత సహనము మందునకైనను కనుపించకుండెను.

మతవిప్లవము మూలముననను, మతసహనము లేక పోవుట వలనను సంభవించిన యుద్ధములనేకములలో నాలుగు ముఖ్యముగ పేర్కొనదగి యున్నవి. డచ్చివారు స్వాతంత్ర్య సంపాదనమునకై గావించిన యుద్ధము, ఇంగ్లండు స్పెయిన్ దేశముల మధ్యన జరిగినయుద్ధము, జర్మనీలోని ముప్పది సంవత్సరముల యుద్ధము, ఫ్రాన్సులోని మతయుద్ధములు ఈ నాలుగింటిలో చేరినవి. ప్రస్తుతము యూరపు ఖండములోని హాలెండు దేశపు ప్రజలకు డచ్చివారని పేరు. వీరును, వీరికి పొరుగుననుండు బెల్జియం దేశమువారగు ఫ్లెమింగులును పదునారవ శతాబ్దప్రారంభము నాటికి కొన్ని రాజకుటుంబముల మధ్యజరిగిన వివాహసంబంధముల మూల మున స్పెయిన్ రాజుల పాలనలోనుండిరి. వీరిలో డచ్చివారు ప్రొటెస్టాంటు మతమును స్వీకరించిరి. ఫ్లెమింగులు క్యాథలిక్కులుగ నుండిరి. స్పెయిన్ రాజు స్పెయిన్ ప్రజలు క్యాథలిక్కులు. ఇదిగాక హాలెండు బెల్జియం దేశములలో వర్తక వ్యాపారములకు ప్రసిద్ధిగాంచిన పట్టణము లనేకము లుండెను. అందు ధనికులగు వర్తకులు, చేతిపనులయందు ఆరితేరిన పారిశ్రామికులు విస్తారముగ నుండిరి. ఆ పట్టణముల లోని వారనేక విషయములలో స్థానిక స్వాతంత్ర్యము ననుభ వించు చుండినవారు. వివాహ సంబంధముల మూలమున నేర్పడిన వారసత్వపుహక్కులవలన దేశము లనేకములు ఒక రాజుయొక్క పరిపాలనలోనికి వచ్చుట ఆకాలపు ఆచా రము. ప్రజలలో జాతీయ భావములేని ఆ రోజులలో దీనిని సదాచారముగనే పరిగణించు చుండిరి. క్రీ. శ. 1519 లో

హాలెండు బెల్జియములకు పరిపాలకుడుగ వచ్చిన అయిదవ చార్లెస్ (Charles V) తల్లిద్వారా స్పెయిన్ దేశమునకును అమెరికాలోని స్పెయిన్ సామ్రాజ్యమునకును ప్రభువయ్యెను. తండ్రిద్వారా ఆస్ట్రియా హాలెండు బెల్జియం తదితర దేశములు కొన్నిటికి రాజై, జర్మనీకి చక్రవర్తిగ నెన్నుకొనబడి విశాల సామ్రాజ్యమున కధిపతి అయ్యెను. ల్యూథర్‌కు కారాగృహశిక్ష విధించినవాడితడే. ఇన్ని దేశములను పాలించుటలో నేర్పడిన క్లిష్టసమస్యలను పరిష్కరించుటయందు నిమగ్నుడగుటచేత ల్యూథర్ లేవదీసిన విప్లవమును అణచలేని వాడయ్యెను. క్రీ. శ. 1556 లో నతడు మృతిజెందెను. అప్పుడతని సామ్రాజ్యము రెండు భాగములుగ విభజితమై స్పెయిన్ అమెరికాలోని స్పెయిన్ సామ్రాజ్యము హాలెండు బెల్జియములు అతని కుమారుడగు రెండవ ఫిలిప్పు (Philip II) పాలనలోనికి వచ్చెను.

రెండవ ఫిలిప్పు (1556-1598) స్పెయిన్ దేశపువాడు. క్యాథలిక్కు మతమును పునరుద్ధరించుటకును, ప్రొటెస్టాంటు మతమును నిర్మూలము గావించుటకును తన జీవితమును వినియోగింప దీక్షవహించిన వాడు. తన ప్రజలలో నొకరగు డచ్చివారు ప్రొటెస్టాంటు శాఖలో చేరుట నతనికెంత మాత్రము గిట్టక వారిని అనేక విధముల బాధింపసాగెను. ఇదిగాక యితర ప్రాంతములం దతడు గావించుచుండిన యుద్ధములకు కావలసిన ధనమునంతను హాలెండు బెల్జియములోని వర్తకులపై పన్నులను విధించి ప్రోగుచేయసాగెను. ఇందుకై

వారి కదివరకుండిన పరిపాలనా స్వాతంత్ర్యమును రద్దుచేసెను. అందుపై వారు తిరుగబడి అతనిపరిపాలనమును కూలద్రోసి స్వరాజ్యమును స్థాపించుటకై స్వాతంత్ర్యయుద్ధమును ప్రారంభించిరి. కాని నిపుణులగు అతని యుద్యోగస్థులు క్యాతలిక్కులగు ఫ్లెమింగులను ప్రొటెస్టాంటులగు డచ్చివారి నుండి విడదీయగలిగిరి. ఆ కారణమున డచ్చివారొక్కరే స్వాతంత్ర్యయుద్ధమును సాగింపవలసివచ్చెను. అందు వారు చూపిన ధైర్య సాహసములు, చేసిన త్యాగములు, వారి నాయకుడగు విలియం ది సైలెంటు (William the Silent కనుపరచిన శౌర్యము, చిరస్మరణీయములు. భూయుద్ధము దోడినను వారు నిరాశ చెందక కడు నేర్పుతో నౌకా ముసు నిర్మించుకొని విసుగువేసటలులేక పోరుచునే వచ్చి తుదకు వారి కృషి ఫలించి హాలెండు స్వతంత్రరాజ్య నేర్పడెను. ఆధునిక కాలమున పరాయి ప్రభుత్వమును గించి విప్లవము మూలమున స్వరాజ్యమును స్థాపిన వారిలో డచ్చివారు మొదట పేర్కొనదగియున్నారు. కష్టపడి వారు స్వరాజ్యమును సంపాదించిన వారగుచేత స్వాతంత్ర్యముయొక్క విలువను వారు గ్రహించినట్లు మరి యెవ్వరు గ్రహించి యుండలేదు. స్వాతంత్ర్య య్యమును సాగించుచుండిన కాలమందే వారు నౌకాబలమును ర్మించు కొని, స్పెయిన్ పోర్చుగల్ దేశములతో పోటీకి ది ఆసియా ఖండపువారితో వ్యాపారము ప్రారంభించిరి. తాము ప్రొటె స్టాంటులైనను తమదేశమునకు వచ్చిన క్యాతలిక్కులయందు సహనముచూపి మతముపేర పౌరుల బాధించుపద్ధతిని రద్దు

చేసిరి. విద్యావ్యాప్తికి వారెంతో పాటుపడిరి. అందుచేతనే స్వాతంత్ర్యమునకు జన్మభూమియను ప్రఖ్యాతి వారిదేశమునకు వచ్చెను. గుడ్డిలో మెల్ల యన్నట్లు మతయుద్ధముల మూలమున కలిగిన సత్ఫలములలో డచ్చి స్వాతంత్ర్య సంస్థాపనము పరిగణింప దగియున్నది.

ప్రొటెస్టాంటు మతమును స్వీకరించిన దేశములలో ఇంగ్లండుకూడ చేరియుండెను. రెండవ ఫిలిప్పు అచ్చట కూడ కాతలిక్కు మతమును పునరుద్ధరింపనెంచి ఇంగ్లండు దేశము నాకాలమున పాలించుచుండిన ఎలిజబెత్ రాణిపై కత్తికట్టి, ఆమెను సింహాసనమునుండి తొలగించుటకు పెక్కు కుట్రలు పన్నెను. దానిని సహించక సాహసవంతులగు ఇంగ్లీషునావికులు యూరపు అమెరికాల మధ్యన సంచారము చేయు స్పెయిన్ ఓడల నడ్డగించి అందులోని వెండి బంగారములను ఇతరములైన సరకులను దోచుకొనసాగిరి. తుదకు ఫిలిప్పు క్రీ. శ. 1588 లో "ఆర్మేడా" (Armada) అను పేర బ్రహ్మాండమైన నొక నౌకాబలమును నిర్మాణముచేసి, దానిని ఇంగ్లండు పై దండెత్తుటకు పంపెను. కాని ఇంగ్లీషు వారు దాని నెదుర్కొని యుద్ధములో దానిలో చాల భాగమును నాశముచేసిరి. తక్కిన నౌకలు తుపానుల మూలమున వినాశము లయ్యెను. ఈ యుద్ధముతో స్పెయిన్ యొక్క నౌకాధిక్యము అడుగంటెను. ఇంగ్లీషువారు నౌకాధిపత్యమునకును సాగర సామ్రాజ్యమునకును పట్టాభిషిక్తులై ఆసియా అమెరికా ఖండములతో వ్యాపారము చేయుటకును,

ఆ ఖండములలో రాజ్యములు సంపాదించుటకును అవకాశ ములు సంపాదించిరి.

క్రీ. వె. 1562 మొదలు క్రీ. వె. 1598 వరకు ఫ్రాన్సు దేశములోకూడ మతయుద్ధము లతి తీవ్రముగ సాగెను. లెక్కలేని క్రూరహత్యలు, దారుణములగు దహన ములు, సాధారణము లయ్యెను. ప్రొటెస్టాంటు లధికముగ నుండిన నగరము లనేకములు నాశములయ్యెను. తుదకు క్రీ. వె. 1598 లో ప్రొటెస్టాంటు పక్షనాయకుడును బోర్బన్ వంశమునకు చెందినవాడును అగు నాల్గవ హెన్రీ శత్రువుల నోడించి సింహాసన మధిష్ఠించెను. కాని దేశములో నధిక భాగము క్యాతలిక్ శాఖకు చెందియుండెను; ప్రొటెస్టాంటులు అల్పసంఖ్యాకులుగ నుండిరి. అటిస్థితిలో ప్రొటెస్టాంటు శాఖకు చెందినవాని రాచరికము స్థిరముగ నుండజాలదన్న విషయమును గ్రహించి నాల్గవ హెన్రీ క్యాతలిక్ మతమును స్వీకరించి, ప్రొటెస్టాంటులను తృప్తిపరచుటకై నాంటిస్ శాసనమను పేర (Edict of Nantes) నొక శాసనముగావించి వారికిష్టమువచ్చినట్లు మతవిషయములలో వారు ప్రవర్తించ వచ్చునని అభయమిచ్చెను. ఈ ఏర్పాటు రెండుపక్షముల వారికి సంతృప్తి కలిగించినందున మతయుద్ధములు ముగిసి ప్రజలలో ఐకమత్యము, దేశాభిమానము ప్రబలమై యూర పులో ఫ్రాన్సుయొక్క రాజకీయ నాయకత్వమునకు దారితీసి స్పెయిన్‌యొక్క ప్రతిభ తగ్గుటకొక ప్రధాన హేతువయ్యెను.

మతయుద్ధము లన్నిటిలో మిక్కిలి బీభత్సమైనది జర్మనీలో క్రీ. 1618 మొదలు క్రీ. వె. 1648 వఱకు జరిగిన

ముప్పది సంవత్సరములయుద్ధము. ఇది జర్మనీలోని ప్రొటె స్టాంటులకును క్యాతలిక్కులకును మధ్య ప్రారంభమయ్యెను. కాలక్రమమున నితరదేశ పరిపాలకులు వారివారి స్వార్థమును వృద్ధిచేసికొను నుద్దేశములో కొందఱు ప్రొటెస్టాంటు పక్షమునను మఱికొందఱు క్యాతలిక్కు పక్షమునను చేరి యుద్ధమును మఱింత భీకరముగను దీర్ఘముగను గావించిరి. ప్రొటెస్టాంటు పక్షమును వహించినవారు డెన్మార్కు స్వీడన్ దేశము నేలుచుండిన ప్రొటెస్టాంటు రాజులేగాక ఫ్రాన్సుదేశము నేలుచుండిన క్యాతలిక్కురాజులుకూడ నుండిరి. జర్మనీ అంతర్యుద్ధమును పురస్కరించుకొని ఆ దేశముల లోని రాష్ట్రముల కొన్నిటిని సంపాదింపవచ్చుననియు, పదు నాఱవశతాబ్దమునకు పూర్వ మందుండి వారికి శత్రువులుగ నుండిన ఆస్ట్రియా స్పెయిన్ రాజులపాలనలోని భాగముల నపహరించి వారి బలము నణగద్రొక్కవచ్చుననియు వారిట్లు చేసిరి. క్యాతలిక్కు పక్షమును చేరినవారిలో స్పెయినురాజు ప్రధానుడు. ఆస్ట్రియారాజు జర్మనీకికూడ చక్రవర్తిగ నెన్నుకొనబడినవాడగుటచేత ముప్పది సంవత్సరముల యుద్ధమాతని యాజమాన్యముననే ప్రారంభమయ్యెను. ఈ యుద్ధము వలన జర్మనీదేశము పిప్పియైపోయెను. జనసంఖ్యలో అర్ధభాగము నశించెను. పల్లెలు పట్టణములు పాడుపడెను. ఇదివరకే చిదికిపోయిన దేశము దీనిమూలమున రాజకీయార్థిక ప్రపంచమున నామరూపములు లేనిదై ఫ్రాన్సు ఆస్ట్రియా మొదలగు పరదేశముల దండయాత్రలకును దెబ్బలకును గురికావలసివచ్చెను. నామకముగ నది

వఱకు చక్రవర్తికుండిన అధికారముకూడనీ యుద్ధములో నంత రించెను. సంస్థానాధీశులు సంపూర్ణ స్వతంత్రముగలవారైరి. యూరపు ఖండములోని దేశపురాజు లనేకు లీయుద్ధములో పాల్గొనిన కారణమున క్రీ.శ. 1648 లో జరిగిన వెస్టుఫేలియా (Treaty of Westphalia) సంధివలన నా ఖండమునకు సంబంధించిన మఱికొన్ని సమస్యలుకూడ పరిష్కారమయ్యెను. హాలెండు, స్విట్జర్లాండు దేశముల స్వాతంత్ర్యము నందఱు గుర్తించిరి.

మతయుద్ధముల తీవ్రతమూలమున మతసహనము యొక్క అవసరమును అనేకులు గ్రహించిరి. యుద్ధముల మూలమున నొక మతమువారు మఱియొక మతమువారిని రూపుమాపుట అసాధ్యమన్నమాట అందఱికి స్పష్టమయ్యెను. అట్టి పరిస్థితిలో నెవరిమతమును వా రనుసరించుటయు, అన్ని మతములవారు దేశాభివృద్ధికిని ప్రపంచ సౌభాగ్యమునకును కలసి పనిచేయుటయే శ్రేయస్కర మనియు ప్రజలు అభిప్రాయపడిరి.

మతవిప్లవము మూలమున వృద్ధిగాంచిన మతవిద్వేషముయొక్క ప్రభావ మాధునిక యుగచరిత్రములో ననేక విషయములందు కనబడుచున్నది. సామ్రాజ్యసంస్థాపనమునకై ఇంగ్లీషు, డచ్చి, ఫ్రెంచి జాతులవారు స్పెయిన్ పోర్చుగల్ వారితో పోటీకి దిగుట కిదియొక ప్రబల కారణమయ్యెను. యూరపుఖండములో క్యాతలిక్కు మతమునకు మతవిప్లవము వలన కలిగిన నష్టమును భర్తీచేయుటకో అన్నట్లు పదునాఱవ

శతాబ్దమందుండి క్యాతలిక్ మతప్రచారకులు ఆశియా అమెరికా మొదలగు ఖండాంతరములకు వెళ్ళి వారిమతము నచ్చటి ప్రజల కుపదేశింపసాగిరి. ప్రస్తుత మీఖండములలో ననేకులు క్రైస్తవులుగ నుండుట కిదియొక ప్రబలకారణము. ఇందులో కూడ ప్రొటెస్టాంటులు క్యాతలిక్కులతో పోటీకిదిగి ప్రొటెస్టాంటు సిద్ధాంతములను విదేశములవా రనుసరించునట్లు మత ప్రచారము గావించిరి. ఇదిగాక మతాంతరులగు రాజులు పెట్టు బాధలనుండి తప్పించుకొని తమ కిష్టమువచ్చిన మతము ననుసరించుటకు కావలసిన అవకాశము లుండుననుభావముతో యూరపుఖండములోనివారు అమెరికాకును ఇతర సమశీతోష్ణమండలములకును వలసవెళ్ళి అచ్చటి యూరోపియన్ నాగరికత విజ్ఞానముల ప్రాబల్యమును వృద్ధిచేయుటకు కూడ మతవిప్లవ మొక ప్రధాన హేతువు. ఇదే కారణమున కొన్ని యూరోపియన్ దేశములలోని వర్తకులు నేర్పరులగు చేతిపనివాండ్రు వారి మాతృదేశములను వదలి ఇతరదేశములకు వచ్చి వారి పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడిరి. ఫ్రెంచి రాజులు పెట్టిన బాధల నోర్వలేక ప్రొటెస్టాంటు లనేకులు ఇంగ్లండు హాలెండులకువచ్చి ఈదేశములలో క్రొత్త పరిశ్రమల స్థాపించుట దీనికొక తార్కాణము.

# 4

# డచ్, ఇంగ్లీషు, ఫ్రెంచి వాణిజ్యము, వలసలు

స్వాతంత్ర్య సంపాదనమునకై స్పెయిన్ రాజులతో పోరాడి విజయము సంపాదించిన డచ్చివారిలో నొక విధమైన నూతన చైతన్యము ఉత్సాహము నిర్మాణశక్తి వృద్ధిగాంచెను. అన్ని విధముల తమ దేశము వృద్ధిగాంచవలయునను కాంక్ష వారిలో పుట్టి పెరిగెను. స్పెయిన్ వారి నోడించుట కష్టము కాదన్న మాటను వారు గ్రహించి వారితో పోటీకిదిగి వర్తక వ్యాపారములందును సామ్రాజ్య సంపాదనమందును వారిని మించవలయునను ఆవేశముతో పనిచేయసాగిరి. క్రీ. శ. 1580 లో పోర్చుగల్, పోర్చుగీసు సామ్రాజ్యము స్పెయిన్ వారి పాలనలోనికి వచ్చుటచేత, ఆఫ్రికా, ఆసియా ఖండములలోని పోర్చుగీసు వర్తక సామ్రాజ్యమును స్పెయిన్ సామ్రాజ్యములలో నొక భాగముగ డచ్చివారు భావించి దానిని నిర్మూలము చేయుటకు సమకట్టిరి. అందుకై వారు

గొప్ప నౌకాబలమును నిర్మించుకొని క్రమక్రమముగ హిందూ మహాసముద్రమును ప్రవేశించి పోర్చుగీసువారి ననేక యుద్ధములందోడించి వారివశమందుండిన మలాకా, సింహళము మొదలగు ప్రదేశముల నాక్రమించి, క్రమ క్రమముగ జావా, సుమత్రా, సెలబీస్ మొదలైన ద్వీపములను జయించి వశపరచుకొనిరి. ఇదంతయు చాలవరకు క్రీ. వె. 1600 మొదలు క్రీ. వె. 1660 మధ్య జరిగెను. దూరప్రాచ్యమున తామీవిధముగ స్థాపించుకొన్న సామ్రాజ్యములో రాకపోకలు నిరాటంకముగ జరుగుటకై వారు మార్గమధ్యమున దక్షిణ ఆఫ్రికాలోని కేపు (Cape) ప్రాంతమున క్రీ. వె. 1652 లో నొక వలసను నిర్మించిరి. ఇందులోని డచ్చివారే వృద్ధియై తుదకు బోయర్లను పేర దక్షిణ ఆఫ్రికాలోని రాష్ట్రములు కొన్నిటికి పరిపాలకులైరి. డచ్చివారు అమెరికాతో కూడ వారి వ్యాపారమును సాగించుటకై అచ్చటికివెళ్లి ఉత్తర అమెరికాయొక్క తీరమున న్యూ ఆంస్టర్డం (New Amsterdam) అను పట్టణమును నిర్మించిరి. ఇదియే ఇప్పటి సుప్రసిద్ధమైన న్యూయార్కు (New York). ఇదిగాక దక్షిణఅమెరికాలో వారు గయానా (Guiana) వశపరచుకొనిరి. కాని అమెరికాలోని వారి సామ్రాజ్య సంపాదన ప్రయత్నములు విస్తారము ఫలించినవి కావు. జావా మొదలగు తూర్పు ద్వీపములలో వారు స్థాపించిన సామ్రాజ్యము రెండవ ప్రపంచ యుద్ధము ప్రారంభమగువరకు—అనగా మూడు వందల సంవత్సరముల కాలము—అవిచ్ఛిన్నముగ నుండెను. డచ్చివారచ్చటికి వచ్చినప్పు డీ ద్వీపములను చిన్న చిన్న సుల్తాను

లనేకులు పాలించుచుండిరి. అంతకుపూర్వము పోర్చుగీసువారు వారిని పెట్టుచుండిన బాధల మూలమున వారిలో కొందఱు డచ్చివారి పక్షమున జేరిరి. వారిలో నెవరియొద్దకూడ యూరోపియనుల నెదిరించుటకు కావలసిన నౌకాబలము గాని సైన్యములుగాని ఆయుధములుగాని మందుగుండు సామానులుగాని యుండినవి కావు. అందుచేత వారిని వశపరచుకొనుట డచ్చివారికి సులభమయ్యెను. డచ్చివారితో కలిసి దూర ప్రాచ్యద్వీపములతో వ్యాపారము గావించి లాభము సంపాదించుటకు ఇంగ్లీషువారు ప్రియత్నించిరి గాని డచ్చివారు దాని కంగీకరింపక వారికి కొన్ని చిక్కులు కలిగించిరి. అందుచేత వారు తూర్పుద్వీపముల వ్యాపారమందంత శ్రద్ధవహింపక భరతఖండముపై తమ దృష్టిని కేంద్రీకరించిరి.

ఆర్మేడా యుద్ధమందు స్పెయిన్ వారి నోడించి నప్పటి నుండి ఇంగ్లీషువారు ఆసియా అమెరికాలతో వ్యాపారము చేయుటయం దధికమైన ఉత్సాహమును చూపిరి. ఆసియా దేశములలో వ్యాపారమునకై వారు క్రీ. వె. 1600 లో తూర్పు ఇండియా సంఘమను పేర నొకవర్తక సంఘమును స్థాపించిరి. క్రీ. వె. 1612 లో వీరు సూరత్ పట్టణము నొద్ద జరిగిన నౌకాయుద్ధములో పోర్చుగీసువారి నోడించిరి. అప్పటినుండి వారిమూలమున నెట్టి ప్రమాదములేక ఇంగ్లీషు వారు వర్తకమును సాగించుకొనగలవారైరి. కాని ఆకాలములో జావా మొదలగు సుగంధద్వీపములలో (Spice Islands) వ్యాపారము చేయుటయే ఎక్కువ లాభకరముగ నుండెను.

అక్కడ దొరకు మిరియాలు, లవంగము, జాజికాయ, ఏలకులు మొదలగు సుగంధ ద్రవ్యములకే యూరపు ఖండమునం దెక్కువ గిరాకియుండెను. అందుచేత ఇంగ్లీషువా రచ్చటికి వెళ్ళి, ఆ వ్యాపారములో పాల్గొనజూచిరి. కాని డచ్చివారు వారికి అడ్డుతగిలి క్రీ. వె. 1621 లో అంబొయన అనుచోట ఇంగ్లీషువర్తకులు కొందరిని హత్యచేసిరి. అందుపై ఇంగ్లీషువారు సుగంధ ద్వీపములలో వ్యాపారమును తగ్గించి ఇండియాతో వ్యాపారముచేయుట లాభకరమని ఇచ్చట కొన్ని ఫ్యాక్టరీలను స్థాపించుకొనిరి. క్రీ. వె. 1621 మొదలు సుమారు డెబ్బది సంవత్సరములు ఇంగ్లీషువారికిని డచ్చివారికిని విరోధము మెండుగ నుండెను. దీనిఫలితముగ కొన్ని యుద్ధములు సంభవించి, వానిలో డచ్చివా రోడిపోయిరి. అమెరికాలో వారివశమందుండిన న్యూయార్కు న్యూజెర్సి ప్రదేశములు ఇంగ్లీషువారి వశమగుట కిదియే కారణము. క్రమక్రమముగ డచ్చివారిపోటీ తగ్గెను. హాలెండు మిక్కిలి చిన్నదేశమగుటయేగాక క్రీ. వె. 1680 తర్వాత ఫ్రాన్సును పాలించుచుండిన రాజులు హాలెండులో అనేక యుద్ధములచేయసాగిరి. అందులో డచ్చివారికి ఇంగ్లీషువారి సహాయ మవసరమయ్యెను. ఆ కారణమున వారు ఇంగ్లీషువారికి మిత్రులై వారి వ్యాపారమున కాటంకము గలిగింపరైరి.

ఇంగ్లీషువారు ఆసియాదేశములకు వచ్చుటలో వారి ప్రధానోద్దేశము వర్తకలాభమును సంపాదించుటయే, కాని అమెరికా విషయమై వారి ఉద్దేశము లంతకంటె విశాల

ములుగ నుండెను. ఉత్తర అమెరికా ఖండములో వలసలు స్థాపించుట కనేకానుకూల్యములుండెను. అందుచేత వారిలో కొందఱు మాతృదేశమగు ఇంగ్లండును వదలి అచ్చట వలసలు స్థాపించిరి. ఇంగ్లండులో జీవనోపాధిలేక కష్టపడుచుండిన వారనేకులు క్రమక్రమముగ నిందు చేరిరి. మఱికొందఱు మతస్వాతంత్ర్యము ననుభవింపవచ్చునను నుద్దేశముతో నచటికి వెళ్లిరి. ప్రొటెస్టాంటు శాఖలో నొకటియగు ప్యూరిటన్ శాఖకు చెందినవారనేకులు క్రీ.శ. 1620 తర్వాత అచ్చటికి వెళ్లి "న్యూ ఇంగ్లండు" వలసలను స్థాపించిరి. అదే విధముగ క్యాతలిక్కులు కొందఱు క్రీ. శ. 1632 లో మేరీలాండు వలసను స్థాపించిరి. మఱికొందఱు వర్తకవ్యాపారముల కెక్కువ యవకాశముండుననియు, ఇంగ్లండులో దొరకనట్టియు ఇంగ్లండువారి ఔన్నత్యరక్షణమున కవసరమైనట్టియు, కలప, తారు, నార, ఇనుము, రాగి, మొదలగునవి సులభముగ అమెరికాలో లభించుననియు తలచి, అచ్చటి వలసలకు వెళ్లిరి. ఈ విధముగ రకరకములగు నుద్దేశములతో ఇంగ్లీషువారనేకులు ఉత్తర అమెరికాలోని తూర్పుతీర ప్రదేశములకు వెళ్లి క్రీ. శ. 1765 నాటికి పదుమూడు వలసరాష్ట్రములను నిర్మాణము చేసికొనిరి.

ఈ వలసరాష్ట్రములకు సంబంధించిన విశేషములలో రెండు ముఖ్యముగ గమనింప తగియున్నవి. వీనిలో కాపురము చేయుటకువచ్చిన ఇంగ్లీషువారు వారి మాతృభాషను, వాఙ్మయమును, ఆచారవ్యవహారములను, మర్యాదలను

ఇంగ్లండునుండి తెచ్చుకొని వీనిలో ప్రవేశపెట్టిరి. కనుక ఇచ్చట వ్యాప్తిగాంచిన విజ్ఞానము నాగరికత యూరపు ఖండపు విజ్ఞాన నాగరికతలలో నొక అంతర్భాగమగు ఇంగ్లీషు నాగరికత. ఆధునికయుగమున యూరోపియనుల ప్రాబల్యము ప్రపంచమందంతట వ్యాపించుటలో నీ వలసలు ప్రాధాన్యము వహించెను. ఉత్తర అమెరికా ఖండమంతయు ఆంగ్లేయ నాగరికతకు కేంద్రమగుట కిదియే కారణము. ఇది గాక యీ పదుమూడు రాష్ట్రములలో ఇంగ్లండులో నా కాల మందుండిన ప్రజా పరిపాలన సంస్థలు ప్రవేశ పెట్టబడెను. ప్రతిరాష్ట్రమందును ఇంగ్లండునుండివచ్చిన గవర్నరుతో పాటు రాష్ట్రములోని ప్రజలెన్నుకొనిన ప్రజా ప్రతినిధి సభ యొకటియుండెను. దీని అనుమతిలేక చట్టములను చేయుట గాని పన్ను విధించుటగాని జరుగజాలకుండెను. కనుక ప్రజా పరిపాలన పద్ధతులు ప్రపంచములోని పశ్చిమార్ధ గోళములో వ్యాపించుటయందు కూడ ఈ వలసరాష్ట్రములు ప్రాధాన్యము వహించెను.

ఖండాంతరములతో వర్తక వ్యాపారముల చేయుట యందును, వానిలో వలసలను నిర్మించుకొనుటయందును డచ్చివారు ఇంగ్లీషువారు చూపినంత శ్రద్ధను నేర్పును ఫ్రెంచి వారు చూపకపోయినను వారుకూడ పదునేడవ శతాబ్దమం దుండి ఇట్టి యుద్యమములలో పాల్గొనిరి. ఆసియాఖండ దేశములతో వర్తకము సాగించుటకై వారొక తూర్పిండియా సంఘమును స్థాపించిరి. కాని ఇది విస్తారము వృద్ధిగాంచలేదు. వలసల నిర్మాణములో వీరుచేసిన ప్రయత్నము లింతకంటె

ఫలవంతములయ్యెను. ఉత్తర అమెరికాలో వీరు క్రీ. శ. 1605 లో అకేడియా రాష్ట్రమును, క్రీ. శ. 1608 లో కనడా రాష్ట్రమును నిర్మించిరి. వీనిలో కాపురముచేయుటకు వచ్చిన ఫ్రెంచివారు ఏబది సంవత్సరములకాలము అనేక కష్టములకు లోబడవలసిన వారైరి. వారిసంఖ్య స్వల్పమగుటచేతను, భూమి సారవంతము కాకపోవుటచేతను, ఇరుగు పొరుగునందుండిన ఇండియన్ ఆదిమనివాసు లతిధైర్యముతో వీరి నెదిరింపగలవారగుటచేతను వీరికి కొన్ని ఇబ్బందులు కలిగెను. క్రమక్రమముగ వీ రా కష్టములను నివారించుకొనగలిగిరి. మత ప్రచారకు లనేక ప్రయాసలకోర్చి, అగమ్యములగు నడవులలో నివసించుచుండిన ఇండియన్‌లతో సంబంధము కల్పించుకొని, వారిని క్రైస్తవులుగ జేసిరి. సాహసవంతులగు పరిశోధకులు దూరప్రయాణము లొనరించి మిసిసిపీ నది మీదుగ తిరిగితిరిగి తుదకు దాని ముఖద్వారము చేరిరి. అచ్చట ఫ్రెంచి ప్రభుత్వము న్యూ ఆర్లియన్సు నగరమును నిర్మించి మిసిసిపీ నది ప్రాంత ప్రదేశమునంతను "లూయిసియానా" (Louesiana) అను పేర తమపరిపాలనలోనికి వచ్చినట్లు ప్రకటించిరి. కనడాను లూయిసియానా తో కలుపుటకు వారు సుమారు అఱువది కోటలను మార్గమధ్యములో నచ్చటచ్చట నిర్మింపజూచుటచేత వారికిని ఇంగ్లీషువారికిని విరోధము ప్రబలి యుద్ధములకు కారణమయ్యెను.

ఫ్రెంచివారి వలసలనుగుఱించియు సామ్రాజ్య సంపాదనముగుఱించియు రెండు విశేషములు పేర్కొనదగియున్నవి. మత యుద్ధములు ముగిసిన తరువాత ఫ్రాన్సు దేశమునకు

పాలకులైన బోర్బన్ వంశపు రాజులు, వారి మంత్రులు యూరపుఖండ వ్యవహారములం దెక్కువ శ్రద్ధను వహించి అచ్చటనే గొప్ప సామ్రాజ్యమును స్థాపించు ప్రయత్నములో నుండి వారికున్న సైన్యములను ధనధాన్యములను అందుకై ఎక్కువగ వినియోగించిరి. ఖండాంతరములలో సామ్రాజ్యమును స్థాపించుటకు వారిష్టపడినను యూరపు వ్యవహారములే వారికి ప్రధానము లయ్యెను. అందుచేత వారిఖండాంతర సామ్రాజ్య ప్రయత్నము లంత ఫలింపజాలవయ్యెను. వారి ప్రయత్నములకును, డచ్చివారు ఇంగ్లీషువారు చేసిన ప్రయత్నములకును ఇందువలననే గొప్పభేదము కనుపించుచున్నది. ఖండాంతరసామ్రాజ్య సంపాదనమున కత్యవసరమైన నౌకాబలమును వారు నిర్మించుకొనకుండుట కిదియే కారణము. దీనితోపాటు మఱియొక విశేషముకూడ గమనింప దగి యున్నది. కనడాలో స్థిరనివాసము లేర్పరచుకొనిన ఫ్రెంచి వారు మాతృదేశమగు ఫ్రాన్సులోని ఆచారవ్యవహారముల తోడను పరిపాలనా విధానములతోడను వచ్చిరి. అందుచేత కనడాలో ఫ్రెంచి నాగరికతకును విజ్ఞానమునకును ప్రాబల్యము కలిగెను. కనడాను ఇంగ్లీషువారు జయించిన తరువాతకూడ ఫ్రెంచివారు కాపురముండు క్వెబెక్ (Quebec) రాష్ట్రములో ఇప్పటివఱకు ఈ ప్రాబల్యము స్థిరపడియే యున్నది.

డచ్చి ఇంగ్లీషు ఫ్రెంచివారి వర్తకవ్యాపారములు వలసలు ఖండాంతరములలోనికి వ్యాపించుచుండిన కాలములో యూరపుఖండమం దనేకయుద్ధములు, యుద్ధసన్నాహములు జరుగుచుండెను. మొత్తముమీద ఆధునిక యుగములోని

యూరపుఖండ చరిత్రమునకు యుద్ధసన్నాహములు యుద్ధములు ప్రధానలక్షణమయ్యెననికూడ చెప్పవచ్చును. ఆధునిక యుగము ప్రారంభమగు నాటికి ఇంగ్లండు, ఫ్రాన్సు, స్పెయిన్, పోర్చుగల్, ఆస్ట్రియా మొదలగు దేశములు నిరంకుశ ప్రభువుల పాలనలోనికి వచ్చుటయు క్రీ. వె. 1500 తరువాత వారినిరంకుశత్వము దినదినాభివృద్ధిగాంచుటయు దీనికి ప్రధాన హేతువు. ఈప్రభువులు వారివారి వంశముయొక్క కీర్తిప్రతిష్ఠలవృద్ధిచేసికొనుటయే పరమార్థమనియు అందుకు తమరాజ్యముల విస్తీర్ణమును పెంచుటయే ఉత్తమసాధనమనియు భావించి క్రొత్తరాష్ట్రములను దేశములను సంపాదించుటకొఱకే వారిశక్తిసామర్థ్యములను అవకాశములను వినియోగింపసాగిరి. మతవిప్లవము మూలమున చర్చియొక్క అధికారము శిథిలమయ్యెను. పోపులు వారినడ్డజాలరైరి. ఇంగ్లండువంటి కొన్ని దేశములలో రాజే మతాధికారియయ్యెను. వర్తకవ్యాపారములు వృద్ధిగాంచుచుండుట చేత ధనికులపై ఎక్కువ పన్నులవిధించి యుద్ధసన్నాహమునకును, యుద్ధము సాగించుటకును కావలసిన ద్రవ్యమును మఱింతసులభముగను అధికముగను వసూలుచేయుటకు వసతులేర్పడెను. క్రీ. వె. 1500 తరువాత యూరపుఖండమున రెండుప్రఖ్యాతరాజవంశము లుండెను. ఫ్రాన్సుదేశము నేలిన బోర్బన్ వంశము వానిలోనొకటి; ఆస్ట్రియా స్పెయిన్ దేశముల నేలిన హాప్సబర్గు (Hapsburg) వంశము రెండవది. ఈ రెండింటికి మధ్య విరోధమేర్పడి యుద్ధములనేకములకు హేతువయ్యెను. మత యుద్ధములుకూడ పేరునకు మతయుద్ధములేగాని వానిని సాగిం

చిన రాజులు రాజ్యకాంక్షతోడనే వానిలోనికి దిగిరి. ఇట్టి సందర్భములోనే యుద్ధములను చేసినవారిలో ఎవరిపక్షము న్యాయము, ఎవరిది అన్యాయము అని విమర్శించుట అనవసరము అసంగతము.

ఇంగ్లండుకూడ అవకాశమున్నప్పుడీ యుద్ధములలో పాల్గొనుచునే యుండెను. స్పెయిన్ వారు, డచ్చివారు ఓడిపోయినతరువాత వీరికి ఫ్రెంచివారితో విరోధము ప్రాప్తించెను. ఫ్రెంచిరాజులు వారిరాజ్యమును పెంచుకొను ప్రయత్నములో హాలెండు బెల్జియముల జయింప జూచుచుండిరి. వారి యుద్దేశము నెరవేరిన యెడల ఇంగ్లండుయొక్క స్వాతంత్ర్యమునకు ప్రమాదము కలుగుటయేగాక డచ్చి వలసరాజ్యము వర్తక వ్యాపారములు బలవంతులగు ఫ్రెంచివారి అధీనమై ఇంగ్లీషు వారికెంతో నష్టము కలిగించుట తప్పదు. ఇదిగాక హాప్సబర్గువారితో ఫ్రెంచివారు చేయుచున్న యుద్ధములందు వారు గెలిచినయెడల యూరపుఖండములో చాలభాగము ఫ్రెంచి పాలనలోనికి వచ్చి స్పెయిన్‌వారి అమెరికా సామ్రాజ్యము కూడ వారి అధీనము కావచ్చును. కనుక ఇంగ్లండొక ద్వీపమైనను, యూరపు ఖండములోపల జరుగు యుద్ధములలో ఇంగ్లీషువారేదో ఒకపక్షము నవలంబింప వలసియుండెను. క్రీ. వె. 1688 లో ఇంగ్లండులో జరిగిన రాజకీయ విప్లవమునకు ఫలితముగ హాలెండు రాజగు విలియమ్ ఇంగ్లండునకుకూడ రాజయ్యెను. హాలెండునకు ఫ్రాన్సునకు అదివఱకే విరోధ మున్నందున నదిమొదలు ఇంగ్లండుకు కూడ ఫ్రాన్సుపై విరోధము తప్పదయ్యెను.

దీనికితోడు మఱిరెండు సందర్భములీ విరోధమును వృద్ధిజేసెను. ఉత్తర అమెరికానంతను తమపరిపాలనములోనికి దెచ్చుకొను ఉద్దేశముతో ఫ్రెంచివారు కనడా లూయియానలను కోటల సాధనమున కలిపి ఇంగ్లీషువారి పదమూడు కాలనీలు వ్యాపించుటకు వీలులేనట్టి పరిస్థితులను కల్పించుచుండిరి. ఇండియాలో కూడ సామ్రాజ్య సంపాదనమునకై వారి మధ్య పోటీ ప్రబలెను. పదునేడవ శతాబ్దమున మొగలాయి సామ్రాజ్యము సౌష్ఠవముగనున్నందున యూరోపియనులు ఇండియాలో రాజ్యము సంపాదించుట కవకాశము లేదయ్యెను. క్రీ. వె. 1707 తరువాత మొగలాయి సామ్రాజ్యము క్షీణింప సాగెను. దాని స్థానమున బలిష్ఠ ముగల భారతీయ సామ్రాజ్య మింకొకటి ఏర్పడలేదు. చిన్నచిన్న రాజు లనేకులు స్వాధికారమునకై పెనుగులాడుచుండిరి. అట్టి అరాజక పరిస్థితులలో వర్తకమునకై వచ్చిన ఫ్రెంచివారు ఇంగ్లీషువారు రాజ్యముల సంపాదించుట కవకాశము లుండుట గ్రహించి అందుకై పరస్పరము యుద్ధములలోనికి దిగిరి.

క్రీ. వె. 1688 మొదలు క్రీ. వె. 1815 వఱకు ఇంగ్లీషు ఫ్రెంచి వారి మధ్య అనేక యుద్ధములు జరిగెను. వీనిలో స్పానిష్ వారసత్వపు యుద్ధము (1702–1713), ఆస్ట్రియా వారసత్వపుయుద్ధము (1740–1748), సప్త సంవత్సరయుద్ధము (1756–1763), ఫ్రెంచి విప్లవ యుద్ధములు (1792–1815) ముఖ్యముగ పేర్కొనదగియున్నవి. వీనిలో మొదటిదానికి

యూరపుఖండము మాత్రమే యుద్ధరంగముగ నుండెను. రెండుమూడు యుద్ధములు యూరపునందేగాక ఇండియా అమెరికాలలోని ఫ్రెంచి ఇంగ్లీషువారిమధ్య జరిగెను. ఫ్రెంచి విప్లవ యుద్ధములు కూడ నిదేవిధముగ ప్రపంచమం దనేక భాగములలో జరిగెను. వీనిలో నొక్కొక దానిని గుఱించి ప్రత్యేకముగ వివరించుట యనవసరము. స్పానిష్ వారసత్వ యుద్ధమువలన ఉత్తర అమెరికాలోని అకేడియా, హడ్సన్ బే ప్రాంతము, న్యూఫౌండ్లాండు అనువానిని ఫ్రెంచివారు ఇంగ్లీషువారి కియ్యవలసి వచ్చెను. సప్తసంవత్సర యుద్ధ ఫలితముగ ఫ్రెంచివారు కనడాను, ఇండియాలో వారి సామ్రాజ్య సంపాదన ప్రయత్నములను వదలుకొనిరి. దీని మూలమున ఉత్తర అమెరికా, ఇండియాలలో ఫ్రెంచి సామ్రాజ్యమునకు బదులు ఇంగ్లీషు సామ్రాజ్యము స్థాపిత మయ్యెను.

## ప్రషియా

ఖండాతరములలో వలసలకును, వర్తక వ్యాపారముల కును, సామ్రాజ్యములకును డచ్చి ఇంగ్లీషు ఫ్రెంచివారు పోటీ చేయుచుండినకాలములో యూరపు ఖండమున రెండు నూతన రాజ్యములు ముందుకు వచ్చెను. వానిలో మొదటిది జర్మనీ దేశములోని ప్రషియారాజ్యము; రెండవది రషియారాజ్యము. ఆధునికయుగము ప్రారంభమగునాటికి జర్మనీదేశమున కంతకు పేరున కొక చక్రవర్తి యుండినను (అతనికి పవిత్రమైన రోమన్ చక్రవర్తి; Holy Roman Emperor అని బిరుదు) దేశము

సుమారు నాలుగైదు వందల సంస్థానములుగల భాగమై రాజకీయముగ మిక్కిలి వెనుకబడియుండెను. మత విప్లవము మూలముగ సంస్థానాధీశుల పరస్పర వైషమ్యము మఱింత వృద్ధిగాంచెను. ముప్పది సంవత్సరములయుద్ధము ఆర్థిక క్షయమును గూడ తెచ్చిపెట్టెను. ఇదే సమయమని పరాయివారగు ఫ్రెంచివారు, స్వీడన్‌వారు, ఆస్ట్రియావారు జర్మనీలో ప్రవేశము సంపాదించి, యథాశక్తిగ జర్మన్ రాష్ట్రములను వశపరచుకొనుచుండిరి. కాని అప్పటి సంస్థానాధీశులలో బ్రాండెన్‌బర్గు సంస్థానమునకు పాలకులైనవారు మిక్కిలి సమర్థులుగ నుండిరి. వారు హోహెన్‌జోల్లరెన్ (Hohenzollaren) వంశమునకు చెందినవారు. తక్కిన రాజకుటుంబములవలె వారుకూడ తమ వంశపు కీర్తి ప్రతిష్ఠల వృద్ధిజేయ సమకట్టి కొనుగోలు చేసియు, వివాహబాంధవ్యముల సాధించియు, వారసత్వ హక్కుల నాధారము చేసికొనియు, కష్టపడి యుద్ధముచేసియు, కొంచెము కొంచెముగ వారిరాజ్యమును వృద్ధిజేసికొన ప్రారంభించిరి. క్రీ. వె. 1713 లో వీరు రాజబిరుదమును సంపాదించి ప్రష్యారాజ్యమునకు రాజులైరి. క్యాతలిక్ రాజులబాధల నుండి తప్పించుకొని వచ్చిన ప్రొటెస్టాంటు చేతిపనివాండ్రకాశ్రయ మిచ్చి తమరాజ్యములో నూతన పరిశ్రమలను స్థాపించిరి. జాగరూకతతో సమర్థులగు సైనికుల నేరి గొప్ప సైన్యమును తయారు చేసిరి. దుర్వ్యయమననేమియో తెలియక విస్తార ధనమును చేకూర్చిరి. ఇంతకును ఇతర రాజ్యములతో పోల్చిచూచిన యెడల వీరి ప్రష్యా

రాజ్యము మిక్కిలి చిన్నది. కాని క్రీ. వె. 1740 మొదలు క్రీ. వె. 1786 వఱకు దీనిని ఘనుడని ప్రఖ్యాతి గాంచిన ఫ్రెడరిక్ (Frederick the Great) పాలించెను. ఇతడాకాలపు రాజులందఱివలె చాణక్యనీతి ననుసరించినవాడు. అధికారము నకు వచ్చినవెంటనే నతడదివఱకు ఆస్ట్రియాపాలనలో నుండిన సైలీషియా అనురాష్ట్రముపై దండెత్తి వశపరచుకొనెను. అది అనేక ప్రకృతిసంపదలతోగూడిన ప్రదేశము. అందుండి యతనిని తఱుముటకు ఆస్ట్రియారాణి విశ్వప్రయత్నము చేసెను గాని లాభములేకపోయెను. సప్తవత్సరయుద్ధములో ఆస్ట్రియా ప్రాన్సు దేశములొకపక్షమునను, ప్రషియా ఇంగ్లండులు రెండవపక్షమునను చేరి యుద్ధము గావించెను. అందు ఫ్రెడరిక్ అసమానమైనప్రజ్ఞనుచూపి,తనరాజ్యమునురక్షించు కొని యోధాగ్రేసరులలో నొకడను ప్రఖ్యాతిని గాంచెను. ప్రజలయభివృద్ధికై అతడనేక సంస్కరణముల గావించెను. వ్యవసాయమున క్రొత్తపద్ధతులను, పంటలను ప్రవేశపెట్టెను. న్యాయపరిపాలనమును చక్కబెట్టెను. విద్యాధికు లనేకుల బోషించెను. యూరపుఖండములోని గణింపదగిన రాజ్యము లలో ప్రషియా ఒకటియగున ట్లతడురాజ్యమును పాలించెను.

## రషియా

రషియాదేశము యూరపుఖండపు తూర్పుభాగమందుండు విశాలమైనదేశము. ఇందులోనివారు స్లావు జాతివారు. మధ్యయుగమున దీనిని మంగోలులు జయించి పాలించినందున పశ్చిమయూరపు విజ్ఞానముతోడి సంబంధము చాలతగ్గెను.

నల్లసముద్రముతోగాని బాల్టిక్ సముద్రముతోగాని సంబంధము లేని కారణమున విదేశములతో విస్తారము వ్యాపారము కూడ లేకుండెను. ప్రజలలో చాలభాగము విద్యావిహీను లగు రైతులు. వారు ప్రపంచముతో సంపర్కము లేక వారి వారి కుగ్రామములలో జీవితమంతను గడుపుచుండిరి. పట్టణ వాసులుకూడ పాశ్చాత్యనాగరికతకు దూరులుగనుండిరి. అట్టి దేశమునకు క్రీ. వె. 1689 లో ఘనుడగు పీటరు (Peter the Great) రాజయ్యెను. ముప్పదియైదు సంవత్సరము లతడు గావించిన కృషిమూలమున పరిస్థితులన్నియు మారి రషియా రాజ్యము యూరపుఖండపు అగ్రరాజ్యములలో నొక్కటి యయ్యెను.

పీటరుకు పాశ్చాత్య నాగరికతయం దెక్కడలేని వ్యామోహము. దానిని ప్రవేశపెట్టినగాని తనరాజ్యమునకు తరణోపాయము లేదను దృఢసంకల్పము కలవాడై సింహాసనము నధిష్ఠించిన వెంటనే ఉత్తమ కుటుంబములకు జెందిన ఏబది రషియన్ యువకులనేరి ఇంగ్లండు హాలెండు దేశములకు పంపెను. తరువాత రెండుసంవత్సరముల కతడే పాశ్చాత్య దేశములకు వెళ్లి నౌకానిర్మాణ శాలలను, రేవుపట్టణములను, కర్మాగారములను స్వయముగ సందర్శించి స్వదేశమునకు మరలివచ్చినపుడు, తనతోకూడ నేర్పరులగు ఇంజనీయర్లు, నౌకానిర్మాణ నిపుణులు, వివిధములగు చేతిపనులలో ఆరితేరినవారు, ఖనిజములనుత్రవ్వి పైకితీయగలవారు, విద్యాలయములందును వైద్యశాలలందును పనిచేయ నేర్పుగలవారు—మొదలగు వారి ననేకులను దెచ్చెను. పాశ్చాత్యులు

ధరించుబట్టలనే రషియాలోని ప్రముఖులు ధరించవలెననియు పొడుగుగడ్డములను, కుచ్చుమీసములను మాని వారు పాశ్చాత్యులవలె శుభ్రముగ ముఖక్షౌరము చేసికొనవలెననియు, స్త్రీలు గోషాపద్ధతిని వదలి పురుషులతో కలసి స్వేచ్ఛగ సంచరింపవలెననియు అతడు శాసించెను. ప్రషియాలోని సైనికవిధానము ననుసరించి రషియాసైన్యము నతడు సంస్కరించెను. హాలెండు పద్ధతి ననుసరించి నౌకానిర్మాణము నతడు ప్రారంభించెను. అత డనేక కాలువలను రోడ్లను నిర్మించెను. పోలీసు పద్ధతిని, పోస్టుపద్ధతిని ప్రవేశ పెట్టెను. వైద్యము, ఇంజనీరింగు, నౌకాశాస్త్రము, ఖనిజశాస్త్రము మొదలగు వానిని నేర్చుకొనుటకు విద్యాలయముల స్థాపించెను. పశ్చిమ యూరపు దేశములందుండు స్మృతుల ననుసరించి రషియాలోని స్మృతులను సరిదిద్దెను. చర్చియొక్కయు సైన్యముయొక్కయు అధికారములను రూపుమాపి నిరంకుశ ప్రభుత్వమును స్థాపించెను. ఎట్లైనను నల్లసముద్రములోనికి ప్రవేశము సంపాదించుట కత డిరువది సంవత్సరములు టర్కీ రాజ్యముతో పోరెను గాని లాభములేక పోయెను. బాల్టిక్ సముద్రములోనికి ప్రవేశముసంపాదించుటకై స్వీడన్ రాజుతో నతడ దేవిధముగ పోరి తుద కందు విజయముగాంచి, దానికి సమీపమున సెంటుపీటర్సుబర్గు అను పట్టణమును కట్టి (దీని కిప్పుడు లెనిన్‌గ్రాడ్ Leningrad అనిపేరు). దానిని రషియాకు రాజధానిగ జేసెను. పశ్చిమయూరపువా రదివరకు రషియా దేశమును వెనుకబడిన ఆసియా దేశములలో నొకటిగ పరిగణించు చుండెడివారు. కాని పీటరుయొక్క

సంస్కరణములు పూర్తియైనప్పటినుండి వారా యభిప్రాయ ముసు మార్చుకొని రషియాను పాశ్చాత్య రాజ్యములలో నొకదానివలె గౌరవభావముతో చూడసాగిరి.

పీటరు ప్రారంభించిన పద్ధతులను క్రీ. శ. 1762 నుండి క్రీ. శ. 1796 వఱకు పాలించిన కాతరిన్ మహారాణి (Catharine II) మఱింత బలపరచెను. ఆమె రాజ్యకాలములో టర్కీతో కొన్ని యుద్ధములు జరిగెను. వాని ఫలితముగ క్రిమియా ద్వీపము, నల్లసముద్రముయొక్క ఉత్తర తీరము రషియా పాలనలోనికి వచ్చెను. రషియా వర్తకపు నౌకలకు బాస్పరస్ (Bosporus), డార్డనెల్సు (Dardanelles) జలసంధులమీదుగ మధ్యధరాసముద్రములోనికి ప్రవేశము లభించెను. టర్కీ రాజ్యములో రషియాయొక్క పలుకుబడి వృద్ధిగాంచెను. ప్రషియా నా కాలమున పాలించుచుండిన ఫ్రెడరిక్, ఆస్ట్రియాను పాలించుచుండిన మెరయా తెరీసా మహారాజ్ఞి, రషియాను పాలించుచుండిన కాతరైన్ మహారాజ్ఞి వీరు ముగ్గురు కలసి, పోలెండు రాజ్యముపై కుట్రలు పన్ని, దానిని విభాగముచేసి, ఒక్కొక్కరు ఒక్కొక్క భాగము నపహరించిరి. ఇది బహిరంగమైన దోపిడియని తక్కిన రాజ్యములవారు భావించిరి గాని వారిలో నెవరుకూడ పోలెండుకు సహాయము చేయరైరి. సామాన్య ప్రజలకు రాజకుటుంబములపై అసహ్యము కలుగుటకే పోలెండు విభజన ప్రధాన కారణమయ్యెను. ఒకేజాతికి జెందిన పోలిష్ ప్రజలను మూడు ముక్కలుజేసి, ఒక్కొక్కముక్కను వారితో నెట్టి

సంబంధములేని పరాయిరాజుల వశముచేసికొని ప్రజల ఐకమత్యమునకు భంగము కలిగించిన కారణమున నిది మొదలు పోలిషు జనములో జాతీయభావము వృద్ధిగాంచి ఆధునికయుగములో జాతీయతత్వము బలపడుటకు దారితీసెను.

పదునెనిమిదవ శతాబ్దమున యూరపు ఖండములోని దేశము లనేకములను పరిపాలించిన రాజులు నిరంకుశత్వమందును, నిరంకుశత్వము మూలమున సాధింపదలచిన యుద్దేశములందును, అనుసరించిన రాజనీతియందును ఒకరి నొకరు పోలియుండిరి. ఫ్రాన్సును పాలించిన పదునాల్గవ లూయి (Loius XIV–1643–1715), పరిషియాను పాలించిన ఫ్రెడరిక్, రషియాను పాలించిన పీటరు కాతరైన్, ఆస్ట్రియాను పాలించిన మెరయా తెరిసా జోసప్ చక్రవర్తులు ఒకేవర్గమునకు చెందినవారు. వారిని ప్రాజ్ఞులగు నిరంకుశ ప్రభువులని (Enlightened Despots) పేర్కొనుట మామూలు. వారి అధికారము నిరంకుశమైనది. పార్లమెంటులుగాని, చర్చిగాని, ఇతర సంస్థలేవిగాని వారి యధికారమునకు హద్దులు కల్పించి యుండలేదు, వారి కిష్టమైనదే శాసనము. తమ రాజ్యముల నేదో యొకవిధమున పెంచుకొనుటయే వారు పరమార్థముగ భావించిరి. దానిని సాధించుటలో వారు నీతి అవినీతి యన్న వివక్షతను గమనించుట యనవసరమని తలచిరి. రాజనీతిక్కిని సామాన్యవ్యక్తుల నీతికిని భేదముండవలెనని వారిమతము. యుద్ధముల గావించియు, బలహీనులగు రాజుల బెదరించియు భయపెట్టియు తమ రాజ్యములను వృద్ధిచేసి

కొనుటకు వారెల్లప్పుడు ప్రయత్నించుచుండిరి. కాని ఈ ప్రయత్నము సఫలమగుటకు వారియొద్ద గొప్ప సైన్యములు, సైనికపరికరములు, కోటలు ఉండుట అత్యావసరమని వారు గ్రహించిరి. ధనములేక వీనిని సంపాదించుట సాధ్యము కాక పోవుటచేత, ధన సంపాదనమునకు కావలసిన మార్గములను వారు వెదకి వానిని అనుసరించువారైరి. వారి మతములో వెండి బంగారములే ప్రధానమైన ధనము. అవి యుండిన యెడల తక్కిన వస్తువుల వేనినైన కొని సంపాదింపవచ్చును. విదేశములకెక్కువ విలువగల వస్తువుల నెగుమతిజేసి, విదేశముల నుండి తక్కువ విలువగల వస్తుసామగ్రిని కొనుచున్న యెడల వెండిబంగారముల సమకూర్చుట సులభమగునన్న భావముతో వారు ఎగుమతులను ప్రోత్సహించుచు, దిగుమతుల తగ్గించుచు విదేశవ్యాపారమును నియమమందుంచుచుండిరి. ఇట్టిపద్ధతికి మర్కెంటలిసం (Mercantilism) అని పేరు. తమ దేశములలోని ప్రజలకు కావలసిన అహార పదార్థములు వస్త్రములు ఇతరసామగ్రి సాధ్యమైనంతవఱకు తమదేశమందే ఉత్పత్తి యగునట్లు వారు చూచుచుండిరి. వ్యవసాయమును, పరిశ్రమలను, రోడ్లను, కాలువలను, వృద్ధిచేయుటయందు వారీకారణముననే ఎక్కువ శ్రద్ధను చూపిరి. వలసరాష్ట్రములను సంపాదించుటలో కూడ వారి ప్రధానోద్దేశ మిదియే. ఇతర రాజ్యములపై ఆధారపడ వలసినది లేక తమతమ వలసలనుండి తమకు కావలసిన ప్రధానవస్తువులను తెచ్చుకొనినయెడల వెండిబంగారములు తమదేశమునుండి విదేశములకు పంపవలసిన అగత్యముండ

దని వారు భావించిరి. వారనుసరించిన పరిపాలనా విధానమునకు వారి విపరీతరాజ్యకాంక్ష, అందుకై వారుచేయనెంచిన యుద్ధములు, యుద్ధసన్నాహములు ఆధారములుగనుండెను. వారు తలపెట్టిన సంస్కరణములన్నియు వీనికి అంగములు. యుద్ధములకు మధ్యయుగమున లేని ప్రాధాన్యము ఆధునికయుగములో కలుగుటచేత మానవ జీవితమంతయు పూర్తిగ మారిపోవలసి వచ్చెను.

# 5

# రాజకీయ విప్లవయుగము (1640-1800)

## (ఇంగ్లండు అమెరికాలలో విప్లవము)

నిరంకుశులగు రాజులతో ప్రారంభమైన ఆధునిక యుగమందు కొంతకాలము గడచినతర్వాత నిరంకుశ రాజత్వమును తొలగించుటకై విప్లవము లనేకములుజరిగెను. వానిఫలితముగ ప్రపంచములోని ప్రభుత్వ విధానమంతయు మారిపోయెను. అనేక దేశములలో నిప్పటి విధానమునకును క్రీ. శ. 1500 ప్రాంతమందుండిన దానికిని పోలికయే కనుపించదు. ఈ విప్లవములలో పదునేడవ శతాబ్దమున జరిగిన ఇంగ్లీషు విప్లవము, క్రీ. శ. 1776—83—87 లో జరిగిన అమెరికన్ విప్లవము, క్రీ. శ. 1789 లో ప్రారంభమైన ఫ్రెంచి విప్లవము గణుతింప దగియున్నవి.

## ఇంగ్లండులో విప్లవము

ఇంగ్లండులో క్రీ. వె. 1485 మొదలు క్రీ. వె. 1603 వఱకు ట్యూడర్ వంశపువారు నిరంకుశముగ పాలించిరి. ప్రజలు వారి నిరంకుశత్వమునందు సుముఖులుగనే యుండిరి. దానికి రెండు కారణములు కలవు. క్రీ. వె. 1485 పూర్వము దేశమం దంతర్యుద్ధములు సంభవించి ప్రజలశాంతి భద్రతలకు భంగము కలిగించెను. ఆ యుద్ధములకు ఫ్యూడల్ భూస్వాములు అధికార దుర్వినియోగమే ప్రధానకారణము. ట్యూడర్ రాజులు అంతర్యుద్ధమును సమాప్తిగావించి, భూస్వాముల నణగ ద్రొక్కి, దేశమందు శాంతిని నెలకొల్ప భూస్వాములు మఱెన్నటికి తలయెత్తకుండ నుండుటకు కావలసిన ఏర్పాటులను గావించిరి. అందుచేత ప్రజలు హర్షించి, ట్యూడర్ల నిరంకుశత్వము అవసరమన్న భావముతో నుండిరి. ఇదిగాక ట్యూడర్లు మిక్కిలి లౌకిక జ్ఞానము కలవారు. వారు నిరంకుశులైనను పైకి సాంకుశులుగనే కనుపించుచుండిరి. రాజుయొక్క అధికారమును నియమబద్ధముగ చేయుటకు మధ్యయుగములో ఏర్పడిన పార్లమెంటు సభయెడల గౌరవ భావముగలవారై, చట్టముల నన్నిటిని పార్లమెంటు సాధనముననే చేయుచుండిరి. నయభయములతో పార్లమెంటును వశపరచుకొని వారు వారికి కావలసిన కార్యములనన్నిటిని పార్లమెంటుచేతనే చేయించుకొనుచుండిరి. అందుచేత వారి నిరంకుశత్వము ప్రత్యక్షముగ గాక పరోక్షముగ నుండెను.

క్రీ. వె. 1603 లో స్టూవర్టువంశపు రాజులు వారసత్వపు హక్కుచేత ఇంగ్లండుకు రాజులైరి. వీరు స్కాట్లెండు

దేశపువారు. ఇదిగాక క్రీ. వె. 1603 నాటికి ఇంగ్లండులో నిరంకుశరాజత్వము యొక్క అవసరముకూడ తీరిపోయెను. బలవంతులగు భూస్వాము లదృశ్యులైరి. రాజుల నెదిరించు సామర్థ్యముగల చర్చి లేకపోయెను. వర్తకవ్యాపారముల ద్వారా ధనమును సంపాదించినట్టియు శాంతి పరిస్థితు లత్యావ సరములని భావించినట్టియు మధ్యవర్గమువారు పలుకుబడిగల వారైరి. ప్రజలలో అట్టివారనేకులున్నప్పుడు నిరంకుశ రాజ త్వమున కంత యవసర ముండదు. కాని స్టూవర్టు రాజులు పరిస్థితులలోని మార్పులను గమనించక ట్యూడర్లవలె నిరంకుశులుగనుండ సమకట్టిరి. ఇదిగాక వీరిలో మొదటి వాడగు జేమ్సు ఎట్టి లౌకికజ్ఞానము లేనివాడు. ఇతని కుమారు డగు చార్లెసులో కూడ నిట్టి జ్ఞానము కొంత లోపించి యుండెను. సమయానుకూలముగ ప్రవర్తించుట యనిన నేమియో వీ రెరుగనివారు. తమ అధికారము భగవదనుగ్రహమువలన వచ్చినదనియు, రాజులు భగవంతుని ప్రతినిధుల నియు, వారేమిచేసినను ప్రజలు వారికి లోబడియుండవలసిన వారనియు వా రుపపాదించిరి. సిద్ధాంతములు సిద్ధాంతము లుగ నున్నయెడల ప్రజలకు ప్రమాదమేమియు సంభవించదు. కాని స్టూవర్టురాజులు వీని ననుసరించి దేశమును పాలించ సాగిరి. పార్లమెంటు అనుమతిలేక చట్టముల చేయరాదనియు పన్నుల విధింపరాదనియు మధ్యయుగమందుండి ఆచారమై వచ్చుచున్నను వారు దానికి విరుద్ధముగ పన్నుల విధించిరి. స్టూవర్టురాజులలో మొదటి ఇద్దరు ఆంగ్లికన్ శాఖకు చెందిన ప్రొటెస్టాంటులై, ప్యూరిటన్ శాఖకు చెందినవారిని బాధించ

సాగిరి. కాని పార్లమెంటు సభ్యులలో ననేకులు ప్యూరిటన్లే; దేశములోని ధనికులలోని మధ్యవర్గములోను వీరనేకులుండిరి. దీనికితోడు చార్లెస్ కాతలిక్ మతముతో దగ్గిరసంబంధ మున్న ఆచారములను పూజావిధానములను ప్రవేశ పెట్ట దలచెను. అందుపై పోపుయొక్క అధికారము ఇంగ్లండులో పునస్థాపితమగునను భయము కొందరికి కలిగెను. ఇదిగాక న్యాయస్థానములలో విచారణలేకయే అనేకులను వీరు కారా గారములలో బంధించుచుండిరి. వీరి నిరంకుశత్వము ఇన్ని రూపముల ధరించినందున పార్లమెంటు వీరిపై తిరుగుబాటు చేసెను.

ఈ తిరుగుబాటు మొదటిచార్లెస్ కాలమున (1625–49) తీవ్రరూపము ధరించెను. తుదకు నిరంకుశత్వ మును రూపుమాపుటకు మార్గాంతరములేక పార్లమెంటు వారు చార్లెస్‌పై యుద్ధమునకు దిగిరి. అందు ప్రజలలో కొందరు రాజుపక్షమును, మరికొందరు పార్లమెంటు పక్ష మును అనుసరించిరి. క్రీ. వె. 1642 మొదలు క్రీ. వె. 1649 వరకు జరిగిన ఈ అంతర్యుద్ధములో రాజు ఓడిపోయెను. అతని శత్రువర్గములో చేరినపార్లమెంటు సభ్యులతనిని బంధించి, ఏదియో ఒక విధమైన విచారణచేసి, మరణశిక్షను విధించి క్రీ. వె. 1649 లో నతనిని శిరశ్ఛేదము చేసిరి. అటు తర్వాత పదకొండు సంవత్సరములు రాజులేక ప్రజా స్వామ్య పద్ధతిని రాజ్యాంగ మేర్పడెను. క్రాంవెల్ అను నాయకుడు దీనిని చక్కగ నిర్వహించెను గాని క్రీ. వె. 1659 లో

అతడు చనిపోయిన తర్వాత అంతటి సమర్థుడగు నాయకుడు మరియొకడు లేడయ్యెను. ప్రజలలో అత్యధికులు రాజత్వ మందే అభిమానము కలవారుగనుండిరి. అందుచేత మొదటి చార్లెస్ కుమారుడగు రెండవ చార్లెస్ దేశమునకు రాజయ్యెను. కాని ఇతడు తండ్రివలె నిరంకుశుడుగాక పార్లమెంటు విధించిన షరతుల కన్నిటికి లోబడి దేశమును పాలించుట కంగీకరించెను. చాలవరకితడ దేవిధముగ పాలించెను. ఇతని తర్వాత నితని తమ్ముడు రెండవ జేమ్సు రాజయ్యెను. ఇతడు తండ్రివలె నిరంకుశుడై శాసన విరుద్ధముగ రాజ్యముచేయుచు కాతలిక్ మతమును దేశములో ప్రవేశపెట్టుటకు సిద్ధపడెను. అప్పుడు పార్లమెంటువారు, ప్రజలు ఇతనిపై తిరుగుబాటు చేయుటకు తీర్మానించుకొనిరి. దీని నంతయు చూచి, అతడు క్రీ. శ. 1688 లో దేశమునుండి పారిపోయెను. దానిపై పార్లమెంటువారు అతని కుమార్తెయగు మేరీని రాణిగను ఆమె భర్తయైన విలియం (ఇతడప్పటికే హాలెండుకు రాజు) ను రాజుగను ఏర్పరచుకొనిరి. పార్లమెంటు చెప్పినట్లు దేశమును పాలించుటకు విలియం ఒడబడెను. ఇంతటితో ఇంగ్లండునందు నిరంకుశ రాజత్వమంతరించి పార్లమెంటు స్వామ్యము స్థిరపడెను. క్రీ. శ. 1688 లో జరిగిన ఈ విప్లవము రక్తపాతములేని విప్లవము.

క్రీ. శ. 1689 లో పార్లమెంటువారొక చట్టము గావించి రాజు ఏవిధముగ పాలింపవలెనో, ప్రజల కెట్టి హక్కులుండవలెనో నిర్ణయించిరి. రాజు ఆంగ్లికన్ శాఖకు చెందిన

వాడుగ నుండవలెననియు, చట్టములు గావించుటకుగాని రద్దు చేయుటకుగాని, అమలులో నుంచకుండుటకుగాని పన్నుల వేయుటకుగాని రాజున కధికారము లేదనియు, పార్లమెంటు అనుమతిలేక సైన్యములను రాజు సమకూర్చరాదనియు, పార్లమెంటు సభ్యులకు సంపూర్ణ వాక్స్వాతంత్ర్యముండవలెననియు ఆచట్టము విధించెను. రాజును చట్టబద్ధునిగ చేయుటకు కావలసిన ఇతర నిబంధనలుకూడ అందు కలవు. అటు తర్వాత పార్లమెంటు మరికొన్ని చట్టముల గావించి ప్రొటెస్టాంటు లందరికి మతస్వాతంత్ర్యమును కల్పించెను. కోర్టులలోని న్యాయమూర్తులు నిర్భయముగా నిష్పక్షపాతముగను తీర్పులు చెప్పుటకు కావలసిన ఏర్పాటులనుకూడ పార్లమెంటువారు చేసిరి. ఈ విధముగ నిరంకుశ రాజత్వము ఇంగ్లండులో అదృశ్య మయ్యెను.

## అమెరికాలో విప్లవము

ఆధునికయుగ రాజకీయ విప్లవములలో రెండవదియగు అమెరికన్ విప్లవము ఒక అంశములో ఇంగ్లీషు విప్లవమును పోలియున్నను ఇంకొక అంశములో దానికి భిన్నముగ నున్నది. ఇంగ్లీషు విప్లవమువలె నిదికూడ నిరంకుశత్వమును తొలగద్రోయుట కుద్దేశింపబడినది. కాని దీనితో పాటు ఇది ఆకాలపు వలసలపరిపాలన విధానమును దానితో సంబంధించిన సామ్రాజ్య తత్వమును నిర్మూలము చేయ గలిగెను. ఇంగ్లీషు విప్లవములో లేనట్టియు అమెరికన్ విప్లవములో నున్నట్టియు విశిష్టత ఇదియే.

క్రీ. వె. 1765 నాటికి ఉత్తర అమెరికాలో పదమూడు ఇంగ్లీషు వలసలుండెను. ఇందు నివాసము చేయుచుండిన వారు ఇంగ్లండు దేశమును వదలి అచ్చట చేరినట్టివారు. వారుకూడ ఇంగ్లీషువారే. వారిలో కొందరుమాత్రము యూరపుఖండములోని ఇతర దేశములనుండి వచ్చినవారు. క్రీ. వె. 1776 లో వీరికిని, ఇంగ్లండులోనుండు ఇంగ్లీషువారి ప్రతినిధులతో కూడిన పార్లమెంటునకును వలసల పరిపాలన విధానమును గురించి తీవ్రమైన అభిప్రాయభేదము కలిగి ఇంగ్లండునకును పదమూడు వలసలకును మధ్య యుద్ధము ప్రారంభమై తుదకు వలసలు ఇంగ్లండునుండి విడిపోయి స్వతంత్రరాజ్యములుగ మారిపోయెను. ఇంగ్లండునకు లోబడి యుండిన రాష్ట్రము లీవిధముగ స్వతంత్ర రాజ్యములుగ మారిపోవుటచేత నీమార్పునకు అమెరికన్ విప్లవమని పేరు ప్రచారములోనికి వచ్చెను.

వలసరాష్ట్రములు మాతృదేశముయొక్క పరిపాలనకు లోబడి యుండుటయే క్రమ పద్ధతియని పదునేను పదునెనిమిదవ శతాబ్దములలోనివా రభిప్రాయ పడియుండిరి. దానిననుసరించి అమెరికాలోని పదమూడు వలసలు ఇంగ్లండునకు లోబడి యుండెను. వలసలను పాలించుటలో ప్రధానోద్దేశము మాతృదేశముయొక్క యోగ క్షేమాలవృద్ధియను అభిప్రాయముకూడ నాకాలమున సక్రమముగ నెంచబడెను. ఆ కారణముచేత ఇంగ్లండురాజులు, ఇంగ్లండులోని పార్లమెంటు వలసల వర్తక వ్యాపారములగురించి అనేక శాసన

ములు చేసియుండిరి. వలసలలో నుత్పత్తియగు పదార్థములను మాతృదేశమునకే పంపవలెననియు, వలసలలోని ప్రజలకు కావలసిన వస్తువులను మాతృదేశమునుండియే కొనవలెననియు, ఈ వర్తకమంతయు మాతృదేశపు ఓడలలోనే జరుగవలెననియు, మాతృదేశపు పరిశ్రమలకు నష్టము కలిగించునట్టియు వానితో పోటీచేయగలిగినట్టియు పరిశ్రమలను వలసలలోనివారు స్థాపించరాదనియు, మాతృదేశ సౌఖ్యమునకును రక్షణకును కావలసిన వస్తుసామగ్రిని వలసలవారు తయారుచేయవలెననియు చట్టము లనేకము లుండెను. ఇట్టిపరిపాలన విధాన మొక ఇంగ్లీషు వలసలలోనేగాక అన్ని దేశముల వలసలలో కనుపించుచుండెను. వలసలలోని ప్రజ లది నష్టకరమనిగాని అన్యాయమనిగాని భావించినవారు కారు. మాతృదేశముతో సంబంధ ముండుటవలన వారి కనేక లాభములు కలుగుచుండెను. శత్రు ప్రమాదములనుండి మాతృదేశము వారిని రక్షించుచుండెను. మాతృదేశమునకు కావలసిన సామగ్రిని తయారు చేయుటలో వారి కేమైన నష్టమురానున్న యెడల నష్టపరిహారమునకై కొంత ద్రవ్యము వారికి లభించుచుండెను. ఇవిగాక ఇతర సదుపాయములుకూడ వారికి లేకపోలేదు.

అమెరికాలోని ఇంగ్లీషువలసల పరిపాలన విధానములో ఫ్రెంచి స్పెయిన్ పోర్చుగల్ మొదలగువారి వలసలలోలేని విశేష మొకటి యుండెను. ఇంగ్లీషు వలసలలో నొక్కొక దానియందు అచ్చటి ప్రజలెన్నుకొనిన ప్రతినిధులతో కూడిన

శాసనసభ యుండెను. వలసలకు కావలసిన చట్టములను చేయుటకును పన్నుల విధించుటకును దీని కధికారముండెను. వలసలయొక్క బాహ్యావ్యవహారములను ఇంగ్లండులోని పార్లమెంటు చక్కబెట్టుచుండెనేగాని ఆంతరంగిక వ్యవహారములు చాలవరకాయా శాసనసభల అధీనమందుండెను. కనుక ఇంగ్లీషువలసలు స్వపరిపాలనలాభము ననుభవించుచుండిరి.

వర్తకవ్యాపారముల గురించి ఇంగ్లండులోని ప్రభుత్వమువారనేక శాసనముల గావించినను క్రీ. వె. 1763 కు పూర్వము వలసలలోని ప్రజలు వానిని నిరసించినవారుకారు. దాని కొక ప్రబల కారణముండెను. వారికి ఉత్తరమున ఫ్రెంచివారి కనడా వలసయుండెను. ఫ్రెంచివారు తమపై దండెత్తి వచ్చెదరన్న భయము వారినిపట్టి పీడించుచుండెను. దాని నుండి రక్షించుటకు మాతృదేశపు సహాయము అత్యావసరమయ్యెను. కనుక వారు మాతృదేశముతో సహకరించి యుండిరి. క్రీ. వె. 1763 తర్వాత నిది మారెను. సప్త సంవత్సర యుద్ధములో ఫ్రెంచివా రోడిపోయిరి. కనడా ఇంగ్లీషుపాలనలోనికి వచ్చెను. అందుచేత ఫ్రెంచివారి మూలమున ఎట్టి ప్రమాదము ఉండదను ధైర్యము వలసలలోని వారికి కలిగి, అది మొదలు వారు మాతృదేశముపట్ల కొంత నిరసన భావము వహింపసాగిరి. ఇదిగాక ఇంగ్లండులోని ప్రభుత్వము క్రీ. వె. 1763 తర్వాత రెండు మూడు విషయములలో అంతకుపూర్వ ముండిన సంప్రదాయమునకు విరుద్ధముగ నాచరించి వలసలలోని వారి ద్వేషమునకు పాత్ర

మయ్యెను. సప్తసంవత్సర యుద్ధపు ఖర్చులలో కొంతభాగ మును వలసలలోని వారివద్దనుండి రాబట్టుటకు వారుద్దేశించిరి. ఇతర శత్రువుల వలన ప్రమాదము రాకుండుటకై వలసలలో ఇంగ్లీషుసైన్యముల నుంచుట అవసరమని తలచి అందుకగు ఖర్చులను కూడ అచ్చటి ప్రజలనుండి రాబట్టుటకు తీర్మా నించిరి. ఇట్టి ఖర్చుల నిదివరకు మాతృదేశమువారే భరించు చుండిరి. కనుక నిదియంతయు వలసలలోని వారికి విపరీతముగ గన్పించెను. ఈ ఖర్చులకు కావలసిన ద్రవ్యమును వసూలు చేయుటకై ఇంగ్లండులోని పార్లమెంటు వలసలలోని ప్రజ లపై కొన్ని పన్నులను విధించెను. ఇది సంప్రదాయము నకు పూర్తిగ విరుద్ధమైన విపరీతము. వలసలలోని ప్రజలపై వారెన్నుకొనిన ప్రతినిధులుగల శాసనసభయొక్కటే పన్నుల విధించుట మామూలు. వారి ప్రతినిధులు లేని ఇంగ్లండులోని పార్లమెంటు ఇట్టి మామూలునకు విరుద్ధముగ నిప్పుడు వారిపై పన్నులను విధించెను. వలసల క్రోధమున కంత కిదియే ప్రధాన కారణమయ్యెను. వారు దీనిని నిరసించుచు అనేక సభలను సమావేశపరచి వారి అభిప్రాయ ములను మాతృదేశపు పార్లమెంటుకు తెలిపిరి. అందుపై వారు పెక్కు పన్నులను రద్దుచేసిరిగాని పన్నులను విధించుటకు తమకు హక్కు కలదని నిరూపించుటకై ఒకటి రెండు పన్ను లను మాత్రము రద్దుచేయుట మానిరి. దీనిని గురించి వాద ప్రతివాదములు కొంతకాలము జరిగెను. కాని రెండు పక్ష ములవారు వారివారి పట్టుదలను మానరైరి. వలసలలోని వారు యుద్ధమే శరణ్యమని తీర్మానించిరి. సైన్యములను

సమకూర్చి, యుద్ధము ప్రారంభించిరి. పదమూడు రాష్ట్రము లలోని ప్రతినిధులతో కూడిన కాంగ్రెసు నొకదానిని సమావేశపరచి స్వాతంత్ర్యము మానవుని జన్మహక్కు అనియు, ప్రభుత్వములు చెలాయించు అధికారములకు ప్రజల అనుమతియే ఆధారమనియు వివరించుచు స్వాతంత్ర్యపత్రము నొకదానిని ప్రకటించిరి. తర్వాతకాలమున ప్రపంచములో లేచిన రాజకీయ విప్లవముల కాపత్రము వేదవాక్య మయ్యెను.

ఈ విధముగ ప్రారంభమైన అమెరికా స్వాతంత్ర్య యుద్ధము క్రీ. వె. 1776 మొదలు క్రీ. వె. 1783 వరకు సాగెను. అమెరికా సైన్యములకు జార్జివాషింగ్టన్ నాయకుడై పరిస్థితులు క్లిష్టములుగనున్నను ధైర్యమును విడనాడక ఇంగ్లీషు సైన్యముల నతిసాహసముతో నెదుర్కొనెను. తుదివరకు జయమెవరికి లభించునో యన్న సందేహము మాత్రము తప్పినది కాదు. కాని అదివరకు ఇంగ్లీషువారి చేత దెబ్బలుతిన్న యూరపు ఖండములోని ఫ్రాన్సు, స్పెయిన్, హాలెండు దేశములు ఇంగ్లీషువారిపై కసితీర్చు కొనుటకు సమయమువచ్చినదని స్వాతంత్ర్యమునకై పోరు చున్న అమెరికన్‌లకు సహాయముచేసిరి. దాని మూలమున అమెరికన్‌ల బలము వృద్ధిగాంచి ఇంగ్లీషువారు ఓడిపోయిరి. అందు పై వారు క్రీ. వె. 1783 లో సంధిజేసికొని అమెరికా వలసరాష్ట్రములు స్వతంత్ర రాజ్యములగుట కంగీకరించెను. అమెరికన్ విప్లవము సఫలత గాంచెను.

పదునేడవ శతాబ్దమున రాజుల నిరంకుశత్వమును తొలగద్రోయుటకు ఇంగ్లీషువారు విప్లవమును లేవదీసిరి. అమెరికన్‌లు రాజుయొక్క నిరంకుశత్వమునుగాక పరదేశములోని పార్లమెంటు నిరంకుశత్వమును తొలగద్రోచి స్వరాజ్యమును సాధించుటకు విప్లవము లేవదీసిరి. నిరంకుశత్వము ఎవరిదైనను సరే— రాజులదైనను పార్లమెంటుదైనను— ఖండింపదగినదని వారు రుజువుచేసిరి. విప్లవకాలములో యుద్ధరంగములందు అమెరికన్‌ల ప్రక్కన నిలబడి వారికి సహచరులై ఫ్రెంచిసైనికు లనేకులు యుద్ధమందు పాల్గొనిరి. యుద్ధము ముగిసిన తర్వాత వీరు స్వదేశమునకు వెళ్ళి ఫ్రెంచిరాజుల నిరంకుశత్వమును తొలగద్రోయుటకై జరుగుచున్న ప్రయత్నములలో పాల్గొని ఫ్రెంచివిప్లవమును లేవదీసిరి. స్పెయిన్ పోర్చుగల్ దేశముల పరిపాలనను తొలగించి స్వరాజ్యసంపాదనమునకై విప్లవముల ప్రారంభించిన దక్షిణ అమెరికా వలసరాష్ట్రములకు అమెరికన్ విప్లవము మార్గదర్శి అయ్యెను.

నిరంకుశత్వమును పరప్రభుత్వమును తొలగద్రోయుటయందు పదమూడు రాష్ట్రములవా రెట్టిపట్టుదలను నేర్పును ఐక్యభావమును చూపిరో సంపాదించిన స్వరాజ్యమును స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనుటయందును బలపఱచుకొనుటయందును అట్టినేర్పునే చూపిరి. ప్రారంభదశలో వీరి విషయమై కొన్ని పొరపాట్లు గావించినను క్రీ. వె. 1787 నాటికి వానిని దిద్దుకొని పదమూడు రాష్ట్రములు శాశ్వతముగ

కలసియుండుటకు తగిన ఫెడరల్ రాజ్యాంగమును నిర్మించుకొని యునైటెడ్ స్టేట్సు అనుపేర జగత్ప్రఖ్యాతి గాంచిన రాజ్యమును నిర్మాణము గావించిరి. ఫెడరల్ విధానముతోపాటు ప్రజాప్రభుత్వమే ఆదర్శపరిపాలన విధానమనికూడ వీరు రుజువుచేసిన వారైరి.

మాతృదేశపు లాభమును ప్రధానముగ నుద్దేశించి వలసరాష్ట్రములను పాలించుట తగదను గుణపాఠమును అమెరికా స్వాతంత్ర్యయుద్ధమునుండి బ్రిటిష్‌వారు నేర్చుకొని తదనుగుణముగ వలసల పరిపాలన విధానమును మార్చుకొనిరి. కనడా, ఆస్ట్రేలియా, న్యూజిలెండు మొదలగు వలసలు మాతృదేశముయొక్క పరిపాలనమునుండి విడిపోకుండుటకిదియే కారణము.

# 6

# ఫ్రాన్స్‌లో విప్లవము

ఆధునిక యుగములోని రాజకీయ విప్లవములలో మూడవది ఫ్రెంచి విప్లవము. ఇది సంభవించుటకనేక కారణము లుండెను. క్రీ. శ. 1789 ప్రాంతమున ఫ్రాన్సు దేశమందుండిన రాజకీయ ఆర్థిక సాంఘిక పరిస్థితులు న్యాయ విరుద్ధమనియు ధర్మవిరుద్ధమనియు ప్రజలలో అనేకులు భావించుటచేత నీ విప్లవము జరిగెను. ఇవి క్రొత్తగ నేర్పడిన పరిస్థితులు కావు. ఆధునికయుగము ప్రారంభించినదాదిగ నుండినవే కాని ఇవి ధర్మవిరుద్ధములని పదునారవ పదునేడవ శతాబ్దములవారు భావించి యుండలేదు. పదునెనిమిదవ శతాబ్దమున ప్రజల భావములు మారి విప్లవమునకు కారణమయ్యెను.

రాజకీయ పరిస్థితులలో రాజుల నిరంకుశత్వము ప్రధానముగ గమనించదగి యున్నది. వాని అధికారమును అడ్డ

గల సంస్థలేవియు లేకుండెను. మధ్యయుగమున ఇంగ్లండులో పార్లమెంటు స్థాపింపబడినట్లు ఫ్రాన్సులోకూడ రాజులను హద్దులోనుంచుటకు స్టేట్సుజనరల్ (States General) అను ప్రజాసభ యొకటి స్థాపింపబడెను గాని ఇంగ్లీషు పార్లమెంటు సంపాదించినట్టి హక్కులు అధికారములు ఫ్రాన్సులోని సభ సంపాదింపలేకపోయెను. క్రీ. శ. 1614 తర్వాత నీ సభ యొకపర్యాయముకూడ సమావేశము కాలేదు. చర్చిగాని న్యాయస్థానములుగాని రాజుల నిరంకుశత్వమును ఆపగల స్థితిలో లేకుండెను. అందుచేత రాజులు ఇష్టము వచ్చినట్లు శాసనముల చేయుచుండిరి. ఇష్టమువచ్చినట్లు పన్నులను విధించి వాని మూలమున వచ్చిన ఆదాయమును ఇష్టము వచ్చినట్లు అనవసరమైన యుద్ధములకును, సొంత భోగములకును, బంధువులయొక్కయు సోమరిపోతులగు ప్రముఖుల యొక్కయు విలాసములకును ఖర్చుపెట్టుచు, ఖర్చుకు తగిన ఆదాయము దొరకనప్పుడు కోట్లకొలది ఋణముల చేయుచుండిరి. రానురాను ఆ ఋణములపై వడ్డీని చెల్లించుటకు కూడ వారికి సాధ్యముకాదయ్యెను. క్రీ. శ. 1788 నాటికి వారు దివాలాతీయు స్థితిలోనికి వచ్చిరి. ఇదిగాక వీరి నిరంకుశత్వము కాలక్రమమున ప్రజలకు దుర్భరమయ్యెను. నేరము చేసినను చేయకపోయినను తమ కిష్టములేనివారిని పట్టి బంధించి సంవత్సరములకొద్ది కారాగృహములలో నుంచుట పోలీసువారికి మామూలయ్యెను. ప్రొటెస్టాంటులు వారి మతమును స్వేచ్ఛగ ననుసరింప వచ్చునని క్రీ. శ. 1598లో చేయబడిన శాసనమును తర్వాతిరాజులు రద్దుచేసి కాత

లిక్కులు కానివారి ననేకవిధముల బాధింపసాగిరి. ప్రభుత్వ మును ఖండించుటయేగాక సామాన్యముగ విమర్శించుటకూడ నేరముగ భావింపబడుటచేత అన్యాయము లెన్ని జరిగినను ప్రజలు నోరుమూసికొని యుండవలసినవారైరి. మతమును గురించిగాని, శాస్త్రముల గురించిగాని, తత్వమును గురించి గాని క్రొత్త అభిప్రాయములను వ్యక్తపరచుట కెట్టి విద్యా వంతులకుగాని గ్రంథకర్తలకుగాని సాధ్యముకాదయ్యెను. అధికారులకు నచ్చని అభిప్రాయములు గల గ్రంథములను కాల్చివేయుటయు ప్రచారములో లేకుండ జేయుటయు నిరం కుశత్వమున కొక లక్షణమయ్యెను. పదునారు, పదునేడవ శతాబ్దములలో నిరంకుశులుగ నుండిన ఫ్రెంచిరాజులు విదేశ ములతో యుద్ధములుచేసి, జయము సంపాదించి, తమ రాజ్యములను వృద్ధిచేసికొని, తమ దేశముయొక్క పేరు ప్రతిష్ఠలను నిలిపిరి. పదునెనిమిదవ శతాబ్దపు రాజులు చేతకానివారై ఉన్న రాజ్యములలోని భాగములను కూడ పోగొట్టుకొనిన వారైరి. కనుక నిరంకుశత్వము ప్రజలను బాధించునట్టిదిగ నేర్పడెను. విప్లవమునకు రాజకీయ కారణమిదియే.

ఆర్థికముగకూడ సామాన్యప్రజలు, రైతులు, కూలి పనిచేసి జీవించువారు మిక్కిలి హీనస్థితియందుండిరి. వ్యవ సాయ యోగ్యములగు భూములలో అధికభాగము ఫ్యూడల్ భూస్వాములయొక్కయు మతాధిపతులయొక్కయు వశమం దుండెను. వానిని సాగుచేయుచుండిన రైతులు పండించిన పంటలో నధికభాగమును భూస్వాముల కియ్యవలసి యుండెను.

సొంతభూములను సాగుచేయుచుండిన రైతులుకూడ పన్నుల భారమును భరింపలేకుండిరి. ఇదిగాక రోడ్లు వంతెనలు ప్రభుత్వమువారి ఇతర భవనములు మొదలగువాని నిర్మాణములో సామాన్యప్రజలు వెట్టిచాకిరి చేయవలసియుండెను. మతాధిపతులు మతముపేర సుంకములను విరాళములను వసూలు చేయుచుండిరి. కష్టపడుట ప్రజల వంతుగను, ఫలితము ననుభవించుట ప్రముఖుల వంతుగను ఏర్పడియుండెను. ఆర్థికముగ నిట్టి అన్యాయమును భరించుట కిష్టపడక సామాన్యజనులుకూడ విప్లవమునకు సిద్ధపడిరి.

యూరపుఖండపు ఇతర దేశములం దుండినట్లే ఫ్రాన్సు దేశమందుకూడ నాకాలమున సంఘము సోపానవిధానమున నిర్మింపబడియుండెను. ప్రజలలో కొందరు అగ్రవర్ణమునకు చెందినవారుగను కొందరు హీనవర్ణములకు చెందినవారుగను పరిగణింపబడుచుండిరి. భూస్వాములు, చర్చిలో ఉన్నతోద్యోగముల ననుభవించుచుండినవారు, అగ్రవర్ణములలో చేరియుండిరి. వర్తకవ్యాపారములు చేయుచుండినవారును విద్యల నేర్చుకొని న్యాయవాదులుగను వైద్యులుగను గ్రంథకర్తలుగను ఉండినవారును మధ్యవర్గములో చేరియుండిరి. రైతులు కార్మికులు హీనవర్ణములలో చేరియుండిరి. అగ్రవర్ణములో చేరినవారి సంఖ్య మిక్కిలి తక్కువగనుండినను దేశములో మూడువంతుల భూమి వారి వశమందుండెను. గొప్ప ఉద్యోగములన్నిటిని వారే అనుభవించుచుండిరి. రాజసభలయందు వారికే మన్నన. రాజులవద్దనుండి వారికి

ఉపకార వేతనములు అపరిమితముగ లభించుచుండెను. కాని పన్నులనుమాత్రము వారిచ్చుకొనవలసిన బాధ్యత లేదు. మధ్యవర్గమువారును సామాన్యప్రజలును పన్నులభారము నంతను వహించుచుండిరి. పన్నులిచ్చుటకు తగిన సామర్థ్యముగల ధనికులపై పన్నుల విధింపక, ఇచ్చుకొనలేని వారిపై వానిని విధించుట అప్పటి సంఘములోని సోపాన విధానమునకొక ప్రధాన లక్షణము. దీనిని నిర్మూలముచేయు ఉద్దేశముతో విప్లవకారులు విప్లవమును లేవదీసిరి. అసమత్వమునకు బదులు సమత్వము సంఘమున కాధారము కావలయునని వీరు ఘోషించిరి.

న్యాయవిరుద్ధములైనట్టియు, దుర్భరములైనట్టియు, పరిస్థితులు దేశమందున్నంతమాత్రమున విప్లవములు సంభవింపవు. పరిస్థితులు న్యాయవిరుద్ధములను భావముగల నాయకు లున్నప్పు డీ విప్లవము లేచుట కవకాశమున్నది. ఫ్రాన్సు దేశములో క్రీ. వె. 1750 నాటికి మధ్యవర్గము వారట్టి నాయకత్వమును వహింపగల స్థితిలోనికి వచ్చిరి. వర్తక వ్యాపారములందును ఇతర లౌకిక వ్యవహారములందును వీరు ఎక్కువ అనుభవమును సంపాదించినవారు. వీరి బుద్ధి సూక్ష్మత కిది ఆధారమయ్యెను. ఇదిగాక వీరిలో ననేకులు విద్యావంతులుగ నుండిరి. కాని రాజ్యాంగ వ్యవహారములలో భూస్వాముల కున్నంత పలుకుబడిగాని మర్యాదగాని వీరికి లేకుండెను. ఉన్నతోద్యోగములలో భూస్వాములకుండినట్టి ప్రవేశము వీరికి లేదయ్యెను. అర్హులైనవారికి పరువు మర్యాదలు లేకుండుటయు, అర్హులుకాని వారి కి

దక్కుచుండుటయు, వీరు ఖండించి, విప్లవమూలమున ప్రాచీన పరిస్థితులను మార్చుటకు సమకట్టిరి. సామాన్య ప్రజలుకూడ అనేక బాధలకు గురియైయుండిన కారణమున నిరంకుశత్వము తొలగినయెడల తమ స్థితికూడ బాగుపడునను ఆశతో వారు కూడ విప్లవమునకు సిద్ధులైరి.

విప్లవము మూలమున నప్పటి పరిస్థితులను మార్చుటకు ప్రజలలో అనేకవర్గములవారు సిద్ధపడుటకు మరియొక ప్రబలకారణము కలదు. క్రీ. వె. 1500 తర్వాత యూరపు ఖండమునందు క్రమక్రమముగ నూతనవిజ్ఞానము వృద్ధిగాంచి ప్రజల మనోభావము లనేక విధములుగ మార్చెను. ప్రపంచముయొక్క నిజతత్వమును తెలిసికొనుటయం దుత్సాహముగల వారనేకులు బయిలుదేరి పరిశోధనలను గావించిరి. కొందరు నక్షత్ర శాస్త్రమందును, కొందరు గణితశాస్త్రమందును, కొందరు పదార్థవిజ్ఞాన శాస్త్రమందును, కొందరు రసాయన శాస్త్రమందును, కొందరు వైద్యశాస్త్రమందును కృషిచేసిరి. ఈ పరిశోధనలకు ఫలితముగ భూగోళము యొక్క యథార్థ స్వరూపము, సూర్యమండలములో దానికుండు స్థానము, ఇతర గ్రహముల తోడను నక్షత్రముల తోడను దానికి గల సంబంధము, దాని సంచారక్రమము మొదలగు వానిని గురించి క్రొత్త విషయములను వారు కనిపెట్టిరి. దూరదర్శిని, బరామిటర్, థర్మామిటర్, పెండులం, సూక్ష్మదర్శిని, మొదలగు యంత్రములను శాస్త్రజ్ఞులు నిర్మించగల వారైరి. న్యూటన్ మహామహుడు

(Newton 1642-1727) పదార్థముల చలనము (Motion) గురించియు, ఆకర్షణ అపకర్షణముల గురించియు నిర్వచించిన సూత్రముల మూలమున ప్రపంచము నడచుట కాధారను లేవియో స్పష్టమయ్యెను. వీని అన్నిటియొక్క ఫలితముగ భగవంతుడు, పరమార్థము, ఐహికజీవితము, పారలౌకిక జీవితము మొదలగువానిని గురించి అదివరకుండిన సిద్ధాంతములు మారి క్రొత్తసిద్ధాంతములకు ప్రాబల్యమేర్పడెను. ప్రపంచమొక యంత్రమువంటిదనియు, యంత్రముయొక్క నడకకు కొన్ని సూత్రము లాధారమగునట్లు ప్రపంచముయొక్క నడకకు కూడ కొన్ని సూత్రము లాధారములుగ నున్నవనియు, మానవపరిశోధనము మూలమున నా సూత్రములను తెలిసికొనవచ్చుననియు, భగవంతు డొకడున్నను లేకున్నను ఈ నడక నడచుచునే యుండుననియు, మనుష్యుని జ్ఞానము వృద్ధి కానుకాను ఇట్టి సూత్రములన్నియు స్పష్టమగుననియు, దాని మూలమున మానవుడు సుఖముగ జీవింపగల వాడగుననియు ఇట్టి సిద్ధాంతము లనేకములను పదునెనిమిదవ శతాబ్దపు తత్త్వవేత్తలు ప్రతిపాదించిరి. మానవున కతీతమైన దేదియు లేదను నమ్మక మొకటి కుదిరెను. సుఖించుటకు బదులు మానవులు దుఃఖించుటకు నిరంకుశత్వము, సాంఘిక దురాచారములు, ఆర్థిక సంప్రదాయములు కారణములనియు, వీనిని మార్చిన యెడల భూలోకము స్వర్గతుల్య మగుననియు వారు భావించిరి. ఇట్టి నూతన భావములు ఫ్రాన్సులోను తదితర దేశములలోను పదునెనిమిదవ శతాబ్దమునాటికి వ్యాపించెను.

క్రీ. వె. 1774 లో రాజ్యమునకు వచ్చిన పదునారవ లూయీ కాలమున ప్రభుత్వముయొక్క ఆర్థికపు చిక్కులు మరింత అధికమయ్యెను. రాజునకు అప్పిచ్చువారుకూడ లేక పోయిరి. మరి మార్గాంతరము లేక అతడు పాతకాలపునాటి స్టేట్సుజనరల్ మహాసభను సమావేశపరచెను. ఇది క్రీ. వె 1789, మే 5 తేదీన సమావేశమయ్యెను. దానితో ఫ్రెంచి విప్లవము ప్రారంభమయ్యెను. ఈసభలో పండ్రెండువందల మంది సభ్యులుండిరి. వారిలో మూడువందలు భూస్వాముల శాఖకును, మూడువందలు మతాధికారుల శాఖకును, తక్కిన ఆరువందలు ప్రజా శాఖకును చెందినవారు. ఎన్నికలకు పూర్వము ప్రజలలో కలిగిన ఆందోళనము మూలమున ప్రజాప్రతినిధులసంఖ్య తక్కిన శాఖలకంటె రెండింత లుండు టకు రాజు అంగీకరించవలసి వచ్చెను. ఇట్లు సమావేశమైన ప్రజా ప్రతినిధులు మహాసభలోని శాఖలు వేరువేరుగ సభలు చేయరాదనియు, అన్ని శాఖలలోని సభ్యులు కలసి ఒకే సభగ సమావేశమై అట్టి సమావేశములలో నధిక సంఖ్యాకుల వోట్లనుబట్టి కార్యములను జరిపింపవలయుననియు పట్టుబట్టిరి. రాజుగాని తక్కినశాఖలుగాని ఇట్టిపద్ధతిని ఆమోదింపరైరి. అప్పుడు ప్రజాప్రతినిధులు సభజేసి ఇతరులు తమతో కలసి నను కలియకున్నను తామే దేశమునకు ప్రతినిధులమనియు, తమ సభయే జాతీయసభయనియు తీర్మానము చేసిరి. రాజు నకు కోపమువచ్చి వారు సమావేశ మగుచుండిన భవనము యొక్క తలుపులను మూయించి వారి సభలు జరుగుటకు వీలులేనట్లు గావించెను. కాని సభాభవనమున కెదురుగనున్న

టెన్నిసుబంతి ఆటకై వినియోగింపబడుచున్న బహిరంగ ప్రదేశములో వారు సమావేశమై దేశమునకొక నూతన రాజ్యాంగ విధానము నేర్పరిచినగాని తాము తమ ఇండ్లకు పోరాదను తీర్మానము గావించిరి. కొనకు మరి లాభములేదని మూడు శాఖలవారు ఒకే సభలో కలసి పనిచేయుటకు రాజు అంగీకరించవలసిన వాడయ్యెను. కాని కొద్దిరోజుల కతడు తిరిగి అభిప్రాయమును మార్చుకొనినట్లు వదంతులు బయలు దేరెను. అప్పటికే ప్రధాన పట్టణమగు ప్యారిస్ నగరములోని ప్రజలలో నెక్కడలేని ఉద్రేకము పుట్టియుండెను. ఈ వదంతులు వారిని మరింత క్రోధావేశులుగ జేసెను. వారు వేనవేలుగ కలసి, రాజకీయ నేరస్థులు బంధింపబడు "బాస్టీలు" కారాగారముపై బడి, దాని తలుపులు బ్రద్దలు గొట్టి, అందులోని ఖైదీలను విడిపించి, దానిని నేలమట్టము చేసిరి. ఇది జూలై 14 తేదీన జరిగెను. నిరంకుశత్వమును రూపుమాపుటలోనిదియే ప్రథమాంకము. అందుచేతనే ఇప్పటికికూడ దీనిని పండుగదినముగ ఫ్రెంచివారు భావించుచున్నారు. తక్కిన పట్టణముల వారుకూడ ఇట్లే ప్రవర్తించి కారాగారముల నన్నిటిని పడగొట్టివేసిరి. తర్వాత నెలరోజులలో జాతీయ మహాసభ సంస్కరణము లనేకముల గావించి ఫ్యూడల్ జమీందారీ పద్ధతిని రద్దుజేసి, రైతులనే భూస్వాములుగ ప్రకటించి, పన్నులభారము నందరు వహించవలసినట్లు శాసించెను. దీనికంతకు రాజు విరోధుడన్న వదంతులు బయదేరెను. అందుపై ప్యారిస్ నగరములోని వారు పదిమైళ్ళ దూరమందుండిన రాజభవనముపై దాడిచేసి

రాజును, రాణిని, రాజకుమారుని బంధించి ప్యారిస్ నగరము నకు తెచ్చిరి. తర్వాత రెండు సంవత్సరములలో జాతీయ సభ నిరంకుశ ప్రభుత్వమును తొలగించి, నియమబద్ధమగు రాజ్యాధికారముతో కూడిన రాజ్యాంగమును నిర్మించి, జన్మహక్కుల పత్రము నొకదానిని ప్రకటించి, మతాధి కారుల భూములను ప్రభుత్వపరము చేసి, ఆర్థిక సంస్కరణము లనేకముల గావించెను.

కాని ఈ మార్పుల కిష్టపడనివారు దేశమం దనేకు లుండిరి. రాజు దీని కంగీకరించెనుగాని అతడు స్థిరచిత్తము లేనివాడు. భూస్వాము లనేకులు, రాజబంధువులు దేశము నుండి పారిపోయి, ఇరుగుపొరుగు దేశములలోచేరి, అచట నుండి కుట్రలు పన్నుచుండిరి. పోపు, ఇతర మతాధికారులు కుట్రదారులను బలపరచుచుండిరి. వీని ఫలితముగ ప్యారిస్ లోను ఇతర పట్టణములలోను అతివాదులసంఖ్య పెరిగెను. జరిగిన సంస్కరణములు చాలవనియు, రాజత్వమే ఉండరా దనియు అనేకులు ఆందోళనము చేయసాగిరి. క్రీ. వె. 1791 లో జరిగిన ఎన్నికలలో అట్టి ప్రతినిధులే జాతీయ సభా సభ్యు లైరి. దీనికితోడు నిరంకుశులగు విదేశ రాజులు ఫ్రాన్సు పై దండెత్తి, లూయీ యొక్క అధికారమును పునరుద్ధరింప జూచుచుండిరి. అందుపై విప్లవకారులు క్రోధావేశులైరి. అధికారమంతయు అతివాదుల హస్తగతమయ్యెను. వారు న్యాయాన్యాయములను విచారించక, విరోధివర్గములోచేరిన వారన్న అనుమానము నాధారము జేసికొని అనేకులను చంపిరి. రాజును, రాణిని శిరచ్ఛేదము జేసి ప్రజాస్వామ్యమును ప్రక

టించిరి. కొన్ని మాసములు ప్యారిస్ నగరము రక్తమయ మయ్యెను. వారు సుమారు పదునేడు వేల జనమును దేశ ద్రోహ నేరముక్రింద విచారణచేసి చంపిరి. విచారణయే లేక చంపబడ్డవారి సంఖ్య ఇంతకంటె ఎన్నిరెట్లో అధికముగ నుండెను. కాని క్రొత్తగ స్థాపింపబడిన అతివాదుల నిరంకుశత్వము దేశముపై దండెత్తివచ్చిన విదేశ సైన్యముల నోడించి జాతియస్వాతంత్ర్యమును రక్షించి, విప్లవము మూలమున కలిగిన మార్పులకును సంస్కరణములకును స్థిరత్వమును సంపాదించెను.

క్రమ క్రమముగ విప్లవోద్రేకము తగ్గి మధ్యమార్గ మనుసరింపదలచినవారు ప్రతినిధులుగ నెన్నుకొనబడిరి. కాని ప్యారిస్‌లోని అల్లరిమూకలు వీరిపై తిరుగుబాటుచేసిరి. విదేశసైన్యముల దండయాత్రల నణచుటకంటె నిట్టివారి నణచుటయే జాతీయసభకు కష్టమయ్యెను. అట్టి సందర్భములలో ప్యారిస్ పట్టణములోని సైన్యములకు నాయకుడుగ నుండిన నెపోలియన్ వీరి నణచి ప్రభుత్వమును నిలబెట్టెను. ఇది క్రీ. శ. 1795 లో జరిగెను. అప్పటినుండి క్రమక్రమముగ అధికారమంతయు సేనానాయకుడగు నెపోలియన్ వశమయ్యెను.

ఆధునిక ప్రపంచమును పునర్నిర్మాణము గావించిన వారిలో నెపోలియన్ ఒకడని చెప్పవచ్చును. విప్లవమూలమున ఫ్రాన్సులో ఏర్పడిన విపరీతపరిస్థితులే ఇతని పురోభివృద్ధికి ప్రధాన హేతువు. అనేక శతాబ్దములనుండి వచ్చు

చున్న నిరంకుశత్వమును, జమీందారీపద్ధతిని, మతాధికారుల ఔన్నత్యమును తొలగద్రోసి, వ్యక్తిస్వాతంత్ర్య సమత్వముల స్థాపించుటకు ప్రయత్నించుచుండిన ఫ్రెంచి విప్లవము నెడల యూరపుఖండములోని ఆస్ట్రియా, ప్రష్యా, స్పెయిన్ మొదలగు దేశముల నేలుచుండిన నిరంకుశప్రభువులు విరోధమును వహించి దాని నణచుటకు యుద్ధములలోనికి దిగిరి. ఇంగ్లీషువారుకూడ వారితో కలసిరి. ఈ కారణముచేత క్రీ. వె. 1792 లో విప్లవ యుద్ధములు ప్రారంభమయ్యెను. ఏక కాలమున నిందరిశత్రువుల నెదుర్కొనుట సులభసాధ్యము కాకున్నను, ప్రారంభదశలో ఫ్రెంచిసైన్యము లపజయము గాంచినను, విప్లవప్రభుత్వము నిరాశజెందక మరింత దీక్షతో యుద్ధసన్నాహములు గావించి, నిర్బంధ సైనికవిధానమును దేశములో ప్రవేశపెట్టి, దేశాభిమాన పూరితులగు సైనికుల సమకూర్చి మూడు సంవత్సరములలో నసమానమైన విజయములను సంపాదించి, బెల్జియం, హాలెండు దేశములను కూడ వశపరచుకొనెను. ఈ యుద్ధములు జరుగుచున్న కాలములో యువకుడగు నెపోలియన్ దక్షిణ ఫ్రాన్సుపై రేవుపట్టణములమీదుగ దండెత్తదలచిన ఇంగ్లీషు వారిని క్రీ. వె. 1793 లో తరిమివేసి, తనకుగల నేర్పును ప్రకటించెను. క్రీ. వె. 1795 లో ప్యారిస్‌లోని అల్లరిమూకల నణచుటచేత నితని ప్రఖ్యాతి మరింత వృద్ధిగాంచెను. అప్పుడు ఇటలీలో నుండిన ఆస్ట్రియా సైన్యముల మూలమున ఫ్రాన్సునకు గొప్ప ప్రమాదము రానుండెను. దానిని తప్పించుకొనుటకై విప్లవ ప్రభుత్వమువారు నెపోలియన్

ఆధిపత్యముక్రింద ఇటలీకి గొప్ప సైన్య మొకదానిని పంపిరి. దీనితో ఆతనిజీవిత మందొక నూతనదశ ప్రారంభమయ్యెను.

నెపోలియన్ ఇటలీదేశమును ప్రవేశించి అతివేగముగ ఆస్ట్రియన్ సైన్యముల నోడించి, ఆస్ట్రియా చక్రవర్తి సంధి జేసికొనునట్లు గావించి, ఇటలీలో చాలా భాగమును ఫ్రెంచి పాలనలోనికి తెచ్చెను. ఫ్రెంచి విప్లవముపై కత్తిదీసిన విదేశరాజులందరు యుద్ధమును మానిరి. ఒక ఇంగ్లీషువారు మాత్ర మట్లు చేయరైరి. అందుపై నెపోలియన్ వారి నోడించు ఉద్దేశముతో వారి అధికారమున కంతకు వారి వశములో నుండిన ఇండియా మూలమని భావించి, ఇండియాను జయించిన యెడల వారి అధికార మడుగంటుననను భావముతో దానికి మొదటి మెట్టుగ ఈజిప్టుపై దండెత్తి, ఆ దేశములో చాలభాగమును దానికి సమీపమందున్న సిరియాను జయించెను. కాని ఇంగ్లీషువారి నౌకా బలము అతని ప్రయత్నములను భంగపరచి, అతడు తిరిగి ఫ్రాన్సుకు వచ్చునట్లు చేసెను. అప్పటికి ఆస్ట్రియావారును వారి మిత్రులును ఫ్రాన్సుపై యుద్ధమును ప్రకటించియుండిరి. అందుచేత నతడు తిరిగి వారిని యుద్ధములో నెదుర్కొని శరవేగమున నొక సంవత్సరములో వారి నోడించి ఫ్రెంచివారి ఆధిక్యమును స్థాపించెను. ఇంగ్లీషువారుకూడ క్రీ. వె. 1802 లో వానితో సంధి జేసికొనిరి.

అప్పటికి ఫ్రెంచి ప్రజలలో నెపోలియన్ వంటివాడు నియంత అయిన గాని దేశమును రక్షించుటకు వీలుండదను

అభిప్రాయము వ్యాపించెను. నెపోలియన్ కూడ అధికార ప్రియుడు. సైన్యము లన్నియు అతనివశమందుండెను. శత్రువు లందరినోడించి అతడు దేశమును రక్షించెను. ఇట్టి అనుకూలపరి స్థితుల నన్నిటిని గమనించి ఫ్రాన్సునకు చక్రవర్తి కాగోరి, దానికి కావలసిన సన్నాహముల క్రిమక్రమముగ గావించి, తుదకు క్రీ. శ. 1804 లో ప్రజల ఆమోదముతో చక్రవర్తి అయ్యెను. నిరంకుశ రాజత్వమును రూపుమాపుటకు కంక ణము గట్టుకొనిన ఫ్రెంచివారు నెపోలియన్‌కు దాసాను దాసులగుటకంటె విచిత్ర మొక్కటిలేదు. చక్రవర్తియైన పిమ్మట నితడు పూర్వపురాజుల మర్యాదలన్నిటిని పునరుద్ధ రించెను. ఇతని బంధువు లనేకు లితడు జయించిన దేశములకు రాజులైరి; ఇతనిని దూషించువారిని పట్టి బంధించుట కితడు రహస్య పోలీసుదళ మేర్పరచెను. గ్రంథములపైనను వార్తా పత్రికలపైనను ఆంక్షలు విధించి వాక్స్వాతంత్ర్యము నరి కట్టెను. ఇతని పరిపాలనమునందు గౌరవాభిమానములు ప్రజలలో వ్యాపించుట కనుగుణముగ విద్యాలయములలోని విద్యను మార్చెను. చర్చి అధికారులు ఇతనియెడల ప్రజలు సుముఖులగునట్లు ప్రచారము చేయ దొడగిరి. దేశమందు నిరంకుశత్వము పునఃప్రతిష్ఠితమయ్యెను.

నెపోలియన్ ప్రాజ్ఞులగు నిరంకుశ ప్రభువులలో నగ్ర గణ్యుడు. సమత్వ సిద్ధాంతము ననుసరించి ఫ్రెంచి విప్లవ కారులు గావించిన మార్పుల నన్నిటిని ఇతడు స్థిరపరచెను. దేశమం దంతట నొకవిధమైన సివిల్ క్రిమినల్ చట్టములను నిర్మాణము చేసెను. ఇతని సంస్కరణములలో శాశ్వతమైన

లాభమును చేకూర్చిన దిదియే. సాంఘిక సమత్వము, మత సహనము, మొదలగు నూతన ఆశయములిందు చేర్చబడెను. విప్లవకారులు క్రైస్తవమతమందు బద్ధవిరోధులై చర్చిపై అనేక నిర్బంధములను విధించియుండిరి. నెపోలియన్ వీనిలో కొన్నిటిని తొలగించి. పోపుతో సమాధానము చేసికొని. ప్రజలలో నధిక సంఖ్యాకులుగ నుండిన క్యాతలిక్కుల ఆమోదమును సంపాదించెను. ఇదేవిధముగ నతడు దేశమందుండి విదేశములకు పారిపోయిన ప్రముఖ కుటుంబములవారి కభయ మిచ్చి, వారు తిరిగి స్వదేశమునకు వచ్చునట్లు చేసెను. అన్ని వర్గములవారి మన్నన కతడీ విధముగ పాత్రుడయ్యెను. ఆర్థికాభివృద్ధికై ఇతడు జాతీయ బ్యాంకును స్థాపించెను. వ్యాపార సౌకర్యమునకు, మామూలు ప్రయాణసౌకర్యమునకు దేశమందనేక రోడ్లను కాలువలను నిర్మించెను. ప్యారిస్ నగరములో నితడనేక భవనములను కట్టించి దాని నత్యంత ఆకర్షణీయముగ గావించెను. ఉన్నత విద్యాలయములను విశ్వవిద్యాలయములను స్థాపించి విద్యావ్యాప్తికై ఇతడెంతో పాటుపడెను. ప్రజల కితనియందు గాఢానురాగము కలుగుట కిది యంతయు హేతువయ్యెను.

కాని ఈ అనురాగము వృద్ధిగాంచుటకు యుద్ధములలో నితడు సంపాదించిన జయములు, వానిమూలమున ఫ్రెంచివారి పాలనలోనికి యూరపుఖండములోని దేశములనేకములు వచ్చుట ప్రధానకారణములయ్యెను. నెపోలియన్ సేనాధిపతియగునాటికి ఫ్రాన్సునకు పూర్వము ఫ్రెంచిరాజులు వశపరచుకొనదలచిన రాష్ట్రములనేకములను విప్లవ ప్రభు

త్వమువారు జయించిరి. కాని నెపోలియన్‌కు ఇది తృప్తి కలిగించినదికాదు. అలెగ్జాండరు మొదలగు ప్రాచీనకాలపు జగజ్జేతలవలె తానుకూడ జగజ్జేతకావలయునని అత డాశించెను. దానికి తగిన సామర్థ్య మతనికుండెను. నిర్బంధ సైనిక విధానము ఆచరణలోనికి వచ్చిన కారణమున దేశాభిమాన పూరితులగు సైనికులతో కూడిన జాతీయ సైన్యమున కతడధిపతి అయ్యెను. దాని సాధనమున నతడు క్రీ. వె. 1802 నుండి యూరపుఖండములో నగ్రరాజ్యముగ భావింపబడుచుండిన ఆస్ట్రియాను ఓడించెను. ఫ్రెడరిక్ రాజుకాలమందుండి అనన్యసామాన్య ప్రఖ్యాతిగాంచిన ప్రషియా సైన్యముల నతడు హతమార్చెను. అటు తర్వాత రషియా సైన్యముల నెదుర్కొని వానినికూడ నోడించెను. స్పెయిన్, పోర్చుగల్, ఇటలీ దేశము లతని పాలనలోనికి వచ్చెను. క్రీ. వె. 1810 నాటికి రషియా దేశము, టర్కీ సామ్రాజ్యము, ఇంగ్లండు తప్ప యూరపు ఖండములోని తక్కిన దేశము లన్నియు ప్రత్యక్షముగనో పరోక్షముగనో అతని సార్వభౌమత్వము నంగీకరించెను. రోమ్ సామ్రాజ్యము పతనమైన పిమ్మట యూరపు ఖండములో నెవ్వడుగాని ఇంతటి వైభవము ననుభవించియుండలేదు.

ఇంగ్లండు రషియాలను కూడ జయించి ఏకచ్ఛత్రాధిపతియగుటకు నెపోలియన్ కాంక్షించెను. దీనిని తీర్చుకొనుట కతడుగావించిన ప్రయత్నమే అతని పతనమునకు హేతువయ్యెను. ఇంగ్లండొక ద్వీపము. ఇంగ్లీషువారిది సాగరసామ్రాజ్యము. దానికి వారి నౌకాబలమే ఆధా

రము. నెపోలియన్ బలమున కతని సైన్యములు ఆధారము. ఫ్రాన్సునకు ఇంగ్లండునకు మధ్య ముప్పది మైళ్ళ వెడల్పుగల సముద్రమున్నది. దానిని దాటి ఫ్రెంచిసైన్యములను ఇంగ్లండు చేర్చగలిగిన యెడల నాదేశమును కూడ నతడు జయించియుండును. కాని అతడందులకై ఎన్ని ప్రయత్నములు జేసినను లాభము లేకపోయెను. ఇంగ్లండునకును అతనికిని జరిగినయుద్ధము మొసలికిని ఏనుగునకును జరిగిన పోరాటము వంటి దయ్యెను.

రషియాను పూర్తిగా నోడింప నెంచి క్రీ. వె. 1812 లో నతడా దేశముపై దండెత్తివెళ్ళెను. కాని అచ్చటి చలిబాధ కోర్వలేక నతని సైన్యమంతయు నశించెను. చావుదప్పి కన్నులొట్టబోయె నన్నట్లు అతడు మాత్రము కొద్దిపాటి సైన్యముతో అతికష్టముమీద ఫ్రాన్సుకు మరలి రాగలిగెను.

క్రీ. వె. 1813 నాటికి యూరపులో నెపోలియన్ పాలన మందుండిన దేశములలోని ప్రజ లతనిపై తిరుగుబాటు చేయుటకు సిద్ధపడిరి. అట్టి తిరుగుబాటు స్పెయిన్‌లో ప్రారంభమై క్రమక్రమముగ నితర ప్రదేశములకు వ్యాపించెను. ఈ వ్యాపించుటలో రెండు విశేషములు గమనింపదగియున్నవి.

ఫ్రెంచిసైన్యము లీదేశములను మొట్టమొదట ప్రవేశించినపుడు వానిలోని ప్రజ లా సైన్యములకు స్వాగతము కూడ నిచ్చిరి. నిరంకుశత్వమును తొలగద్రోచిన వారను

ప్రఖ్యాతి అప్పటికి ఫ్రెంచివారికి లభించెను. స్వాతంత్ర్యము, సమత్వము, సోదరభావము అను నినాదములతో వారీ దేశములలోనికివచ్చి, వానిలోని ప్రజ లనుభవించుచుండిన కష్టములనుండి వారిని విముక్తుల జేయుటయే తమ యుద్దేశమని ప్రకటించిరి. కొంతవరకా ప్రకటన ననుసరించి వారు ప్రవర్తించుటగూడ జరిగెను. వారు జయించిన దేశములలో కొన్నిటియందు ఫ్యూడల్ పద్ధతిని రద్దుజేసి రైతులకు భూములు లభించునట్లును, వారిచ్చు పన్నులభారము తగ్గునట్లును సంస్కరణముల కొన్నిటిని చేసిరి. ఆ కారణము చేత సామాన్యప్రజలు ఫ్రెంచివారు స్వాతంత్ర్యప్రియులనియు సమత్వప్రియులనియు, వారి సహాయమున తాము కూడ నిరంకుశప్రభువుల పరిపాలనము నుండి విముక్తులగుటకు అవకాశములుండుననియు భావించిరి. కాని క్రమక్రమముగ నెపోలియన్ యొక్క సామ్రాజ్యమెట్టిదో వారికి స్పష్టమయ్యెను. తమ రాజుల నిరంకుశత్వముకంటె అతని నిరంకుశత్వము మరింత దుర్భర మయ్యెను. అతడు జయించిన దేశములలో ఫ్రెంచివారి పలుకుబడి స్థిరముగ నాటుకొను అవకాశము లేర్పడెను. అందుచేత ప్రజల అభిప్రాయములు క్రమక్రమముగ మార్పుగాంచెను. వారిలో దేశాభిమానము జాతీయభావము రగుల్కొనెను. పరాయిదియగు ఫ్రెంచి సామ్రాజ్యాధికారమును వినాశము గావింపవలెనను ఉద్రేకము స్పెయిన్, పోర్చుగల్, పోలెండు, ప్రష్యా, ఆస్ట్రియా దేశములలోని ప్రజలలో రగుల్కొనెను. 'స్వాతంత్ర్యము' 'సమత్వము' అను ఫ్రెంచి

నినాదములు నినాదములుగ నుండెనేగాని ఆచరణ పూర్వకములు కావయ్యెను. ఇట్టి నినాదములతో తమ్మును వంచించి, నెపోలియన్ నియంత ఫ్రెంచి పరిపాలనమును తమపై రుద్దెనను అభిప్రాయము యూరపుఖండపు ప్రజలలో నాటుకొనెను.

అందుచేత క్రీ. వె. 1810 తర్వాత నెపోలియన్ నిరంకుశులైనట్టియు ప్రజాభిమానమునకు దూరులైనట్టియు రాజులతో మాత్రమేగాక, జాతీయాభిమాన పూరితులగు ప్రజలతోడను, దేశాభిమానముగల సైన్యములతోడను యుద్ధము చేయవలసిన వాడయ్యెను. ఈకారణము మూలమున తుదకతడు క్రీ. వె. 1815 లో యుద్ధమందోడి, సింహాసనాభ్రష్టుడై, ఇంగ్లీషువారి శరణుజొచ్చి, ద్వీపాంతరమున వారి కారాగృహములో క్రీ. వె. 1821 లో కాలధర్మమొందెను. అతని పరాజయ ఫలితముగ ఫ్రెంచివారి సామ్రాజ్యము విచ్ఛిన్నమయ్యెను. అతని నోడించుటకై కలసిన ఇంగ్లండు, ఆస్ట్రియా, ప్రషియా, రషియా మొదలగు దేశముల ప్రభుత్వముల ప్రతినిధులు సమావేశమై వారి కిష్టమువచ్చినట్లు యూరపు ఖండపు రాజ్యముల హద్దులను, ఇతర రాజకీయ పరిస్థితులను పరిష్కరించిరి.

నెపోలియన్ పరాజయముతో ఫ్రెంచి సామ్రాజ్యము విచ్ఛిన్నమైనను ఫ్రెంచి విప్లవముయొక్క ప్రభావము ఫ్రాన్సు దేశమందేగాక యూరపుఖండపు దేశములన్నిటిలోను వ్యాప్తిగాంచెను. ఫ్రెంచి సైన్యములు ప్రవేశించిన దేశము

లన్నిటిలో దానితోపాటు విప్లవతత్వముకూడ ప్రవేశించెను. రాజులు నిశంకుశులుగ నుండరాదనియు, ప్రజాప్రతినిధులతో కూడిన సభలకే సర్వస్వామ్య ముండవలెననియు, జాతి మత కుల వివక్షతలేక ప్రతిమానవునకు స్వాతంత్ర్యముండవలెననియు, మానవులందరు తర తమ భేదములులేక సమానులై సోదరభావముతో నుండవలెననియు ఫ్రెంచి విప్లవకారులు ప్రకటించి, కొంతవరకా సూత్రముల నాచరణలో నుంచిరి. దేశములన్నిటిలో క్రీ. శ. 1789 తర్వాత పరిపాలనా విధానమున కా సూత్రములే ఆధారములయ్యెను. వాని నాచరణలో నుంచుటకు వివిధదేశములవారు గావించిన ప్రయత్నములే ఇటీవలి ప్రపంచచరిత్రయందు గమనింపదగిన విశేషము.

# 7

# పాశ్చాత్యుల సామ్రాజ్య వ్యాప్తి

## 1. బ్రిటిష్ సామ్రాజ్యము

విప్లవయుగమునను, దానికి పిమ్మట సుమారు ఒక శతాబ్దమువరకును—అనగా క్రీ. శ. 1776 మొదలు క్రీ. శ. 1878 వరకు—పాశ్చాత్యుల ప్రాబల్యము ప్రపంచమందనేక భాగములలో వ్యాపించుచునే యుండెను. ఈవ్యాప్తిలో ఇంగ్లండు, రషియా, ఫ్రాన్సు దేశములు ప్రధానపాత్రలను వహించెను. అమెరికా స్వాతంత్ర్యయుద్ధమున ఇంగ్లీషువారు వలసరాష్ట్రము లనేకములను కోల్పోయినను, ఇతర ప్రదేశములలో వారి సామ్రాజ్య మవిచ్ఛిన్నముగ వృద్ధిగాంచు చుండెను. సప్తసంవత్సర యుద్ధఫలితముగ వారు సంపాదించిన కనడారాష్ట్రములోని ఫ్రెంచివారి అభిమానమును సంపాదించుటకై, వారు ఫ్రెంచివారి క్యాతలిక్కు మతమును,

వారి ఇతర సంప్రదాయములను రక్షించుటకు కావలసిన హామీల నిచ్చుటయేగాక, ఫ్రెంచివారెన్నుకొనిన ప్రజాప్రతినిధిసభ నొకదానిని స్థాపించి దానిమూలమున పరిపాలనమును జరుపసాగిరి. ఆకారణముచేత కనడాలోని ఫ్రెంచివారు ఇంగ్లీషువారి యెడల భక్తిగలవారై అల్లరులుచేయక ప్రవర్తించువారైరి. ఇది కాక మాతృదేశముతో యుద్ధము చేయుట కిష్టపడని పదమూడు వలసరాష్ట్రములలోని ప్రజలు కొందరు అమెరికా స్వాతంత్ర్యయుద్ధము ముగిసిన తర్వాత నారాష్ట్రములలో నుండుట కిష్టపడక, కనడాకువెళ్లి అచ్చటనే స్థిరనివాసముల నేర్పరచుకొనిరి. ఈకారణముచేత ఫ్రెంచివారితోపాటు కనడాలో ఇంగ్లీషువారు కూడ క్రమక్రమముగ వృద్ధిగాంచిరి. కాలక్రమమున ఇంగ్లండునుండి ఇంగ్లీషువార నేకులు కనడాకువచ్చిరి. వీనిఫలితముగ నాదేశమందు ఇంగ్లీషు ప్రభుత్వము స్థిరముగ నాటుకొనెను.

ఇదేకాలమున ఆస్ట్రేలియా న్యూజీలెండులు ఇంగ్లీషువారి వశమయ్యెను. ఆస్ట్రేలియాను మొట్టమొదట డచ్చినావికులు కనుగొనినను, దానిని స్వాధీనపరచుకొనుటకు వారు ప్రయత్నించినవారుకారు. క్రీ. శ. 1768–1778 మధ్య కుక్ (Cook) అను సుప్రసిద్ధ ఇంగ్లీషు నావికు డచ్చటికి పదమూడు పర్యాయములు యాత్రలు గావించి, దాని తూర్పు తీరపు వివరముల నన్నిటిని ప్రభుత్వమువారికి తెలిపెను; అది విస్తీర్ణమందు గొప్పదియైనను అందు నివసించు ఆదిమనివాసుల సంఖ్య మిక్కిలి తక్కువగ నుండెను. దానిని వశ

పరచుకొనుటకు ప్రయత్నించు యూరోపియన్లను ఎదిరింప గలవారందు లేకుండిరి. అది శూన్య ప్రదేశమని చెప్పుట కూడ అతిశయోక్తి కాదు. ఒక కారణముచేత ఇంగ్లీషు వారు దానిని వశపరచుకొనుట అవసరమయ్యెను. ఇంగ్లండులో నేరములుచేసి ద్వీపాంతరవాస శిక్షకు పాత్రులైనవారిని క్రీ. శ. 1776 పూర్వము అమెరికాలోని వలస రాష్ట్రములకు పంపుచుండువారు. ఆ రాష్ట్రములు స్వతంత్రములైన తర్వాత శిక్షితుల నచటికి పంపుటకు వీలులేక అందులకై మరియొక ప్రదేశ మవసరమయ్యెను. ఆస్ట్రేలియా అందు కుపయోగించునని ఇంగ్లీషు ప్రభుత్వమువారు తలచి, దానిని తమ వశములోనికి తెచ్చుకొని, క్రీ. శ. 1788 నుండి శిక్షితుల నచటికి పంపసాగిరి. శిక్షాకాలము ముగిసిన తరువాత వీరు స్వేచ్ఛగలవారై అచటనే స్థిరముగ నివసించువారైరి. క్రమ క్రమముగ ఇంగ్లండునుండి మరి కొందరు జను లచ్చటికి వలసవెళ్ళసాగిరి. అందుచేత నా దేశములో ఇంగ్లీషువారి జనసంఖ్య వృద్ధిగాంచెను. అచ్చట పచ్చికబయళ్ళు అపరిమితముగ నుండుకారణమునను, గోధుమలు మొదలగు పంటలు పండుట కనుకూలపరిస్థితులు విస్తారముగ నుండుటచేతను గొఱ్ఱెల మందలు వృద్ధియగుటయు "ఉన్ని, గోధుమలు" మొదలగునవి విస్తారముగ నుత్పత్తియగుటయు జరిగెను. తర్వాత కొంతకాలమున కందు బంగారు గనులు కూడ లభించెను. అప్పటినుండి వేలకొలది ఇంగ్లీషువా రచటికి వచ్చి దేశము ననేక విధములుగ వృద్ధి చేసిరి. ప్రస్తుతము ఇంగ్లీషు వలసలలో ఆస్ట్రేలియా ప్రధాన

స్థానమును వహించియున్నది. క్రీ. శ. 1839 న్యూజీలెండును కూడ ఇంగ్లీషువారు వశపరచుకొనిరి.

క్రీ. శ. 1776 తర్వాత ఇంగ్లీషువారు ఇండియాను కూడ తమ పరిపాలనములోనికి తెచ్చుకొనగలిగిరి. ఇదే కాలమున ఆఫ్రికాలోని ప్రదేశములు కొన్ని వారి వశమయ్యెను. నెపోలియన్ హాలెండు దేశమును జయించిన కారణమున అదివరకు డచ్చివారి వశమందుండిన ప్రదేశములతని పాలనలోనికి వచ్చునట్లుండెను. అట్టిది జరుగకుండుటకై క్రీ. శ. 1798 తర్వాత ఇంగ్లీషువారు డచ్చిసామ్రాజ్య భాగములలో నొకటియగు కేప్‌కాలనీని జయించి, నెపోలియన్‌తో యుద్ధముముగిసిన తర్వాత దానిని తిరిగి డచ్చివారికిచ్చుటకు బదులు తమ వశమందే ఉంచుకొనిరి. ఇంగ్లండు నుండి ఇండియాకు వెళ్ళు సముద్రమార్గమున నిది యుండుట చేత నిది ఇంగ్లీషువారికెంతో ఉపయోగకరముగ నుండెను. క్రమక్రమముగ ఇంగ్లీషువారు కొందరు కేప్‌కాలనీకి పొరుగున నుండు నేటాలులో వలసరాష్ట్రము నేర్పరచుకొనిరి.

వలసలను పాలించువిధానములో నీకాలమున గొప్ప మార్పుగలిగెను. మాతృదేశముయొక్క లాభము నుద్దేశించి వలసపాలనమును సాగించవలయునను సిద్ధాంతమును ఇంగ్లీషువారు వదలుకొనిరి. ఇదిగాక వలసలలోనివారు (అమెరికాలోని పదమూడు వలసలలోనివారు ప్రవర్తించినట్లు) ఎప్పటికో ఒకప్పటికి మాతృదేశముతోటి సంబంధమును వదలుకొని స్వతంత్రులగుటకు ప్రయత్నించెదరనియు, అందు

చేత వలసల విషయమై అనవసరముగ నెక్కువ శ్రద్ధను వహించరాదనియు ఈకాలపు ఇంగ్లీషువారనేకు లభిప్రాయ పడియుండిరి. అందుచే నన్ని వలసరాష్ట్రములలో ప్రజ లెన్నుకొను శాసనసభల మూలమునను, అట్టి సభలకు బాధ్యులైన మంత్రివర్గముల మూలమునను పరిపాలనము జరిపించుటయే ఉత్తమ మార్గమని ఇంగ్లీషు ప్రభుత్వము వారనుకొని, దాని కనుగుణముగ కనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు, నేటాలురాష్ట్రములలో స్వపరిపాలన సంస్థలను స్థాపించిరి. వలసలలోనివారు మాతృదేశమునెడల గౌరవాభి మానములతో ప్రవర్తించుట కిది కారణమయ్యెను. ఇండియా లోని ప్రజలు యూరోపియనులు కాకపోవుటచేత స్వపరిపాలన సంస్థల నచ్చట స్థాపించుటకు ఇంగ్లీషువా రిష్టపడరైరి.

## 2. రష్యా సామ్రాజ్యము

వలసల మూలమునను, యుద్ధముల మూలమునను విదేశముల జయించి ఆధునికయుగమున గొప్పసామ్రాజ్య మును స్థాపించిన దేశములలో రషియాదేశ మొకటి. ప్రస్తుత మింత విస్తీర్ణముగల సామ్రాజ్యము ప్రపంచమందు మరి యొకటిలేదు. ప్రాశ్చాత్యుల ప్రాబల్యము ఖండాంతరము లందు వ్యాపించుటలో రషియావారు మిక్కిలి ప్రధానమైన పాత్రను వహించిరి.

మధ్యయుగాంతమున రషియాదేశమందనేక చిన్న చిన్న రాజ్యములుండెను. వానిలో మాస్కో రాజ్యము

ముఖ్యమైనది. ఇదిగాక దేశములో చాలభాగము తార్తారుల (Tartars) పరిపాలనములో నుండెను. కాని క్రమక్రమముగ మాస్కో రాజులు తక్కిన రాజ్యములను జయించుటయేగాక తార్తారుల నోడించి దేశమునంతను తమ పరిపాలనములోనికి తేగలిగిరి. పదునారవ శతాబ్ద ప్రారంభమగునాటికి వీరు తక్కిన యూరపుదేశపు రాజులవలె నిరంకుశరాజత్వమును స్థాపించిరి. క్రీ. శ. 1558–1570 మధ్య ఎర్మెక్ (Yermek) అను రషియా యోధుడు కాసక్ సైన్యము (Cossaks) నొకదానిని సమకూర్చుకొని ఊరల్ పర్వతప్రాంత దేశములపై దండెత్తి, టోబాల్ (Tobol) వరకు జయించెను. తర్వాత ముప్పది సంవత్సరములలో రషియా సైన్యములు సైబేరియా (Siberia) ను ప్రవేశించి అందులో చాలభాగమును వశపరచుకొనెను. దాని ఫలితముగ వారు టోబాలిస్క్ (Tobolosk) పట్టణమును స్థాపించి బొకారా (Bokhara) రాజ్యములో వ్యాపారము మొదలిడిరి. క్రమక్రమముగా వారు ఓబి (Obi) నదిని చేరి మాస్కోనుండి పసిఫిక్ మహాసముద్రమునకు వెళ్లుమార్గమునకు నడుమ టాన్స్క్ (Tansk) పట్టణమును నిర్మించి, క్రీ. శ. 1618 లో ఎనిసీ (Yenesi) వరకు వ్యాపించి అచ్చట ఎనిసీస్క్ (Yeneseisk) పట్టణమును కట్టిరి. ఈ విధముగ క్రీ. శ. 1630 నాటికి సైబీరియాలో చాల భాగము వారి సామ్రాజ్యములో కలిసెను. తర్వాత ఇరువది సంవత్సరములలో వారు కామ్‌చట్కా (Kamchatka) ను చేరి, సైబేరియా యొక్క తూర్పుతీరమును వశపరచుకొనిరి. అప్పుడే మరియొక సైన్యము అమూర్ నది మీదుగ

చైనాలోనికి ప్రవేశింప ప్రయత్నించెను గాని, చైనా చక్రవర్తులు వారి నడ్డగలిగిరి. క్రీ. వె. 1700 తర్వాత రషియా దేశపు భూగోళ పరిశోధకులు (Explorers) సైబేరియా దేశమును దాని తూర్పు తీరమును వివరముగ పరిశోధించిరి. వారందరిలో బేరింగ్ (Bering) సుప్రసిద్ధుడు. ఏషియా అమెరికాల మధ్యనుండు బేరింగ్ జలసంధిని కనుగొనిన వాడితడే. అటు పిమ్మట పరిశోధకులు కొందరా జలసంధిని దాటి, ఉత్తర అమెరికాను ప్రవేశించి, అలాస్కా రాష్ట్రమును (Alask) రషియా పాలనలోనికి తెచ్చిరి. దక్షిణ అమెరికాలో స్పెయిన్ పోర్చుగల్ దేశములవారును, ఉత్తర అమెరికాలో ఇంగ్లీషువారు ఫ్రెంచివారు చేసినట్లే ఉత్తర ఆశియాలో రషియావారు యూరపు ఖండ ప్రాబల్యమును 1700 నాటికి స్థాపించిరి. ద్వీపాంతరవాస శిక్ష ననుభవించవలసినవారిని రషియారాజులు సైబేరియాకు పంపుచుండిరి. ఇప్పటికికూడ రషియా ప్రభుత్వ మీ ఆచారము ననుసరించుచున్నది. భూములు కాంక్షించిన రైతు లనేకు లిచటకి వలస వచ్చిరి. వీరితోపాటు వర్తకులు వ్యాపారమునకై వచ్చిరి. క్రీ. వె. 1858–1860 లో రషియావారు చైనాపై ఒత్తిడి కలిగించి దక్షిణ అమూరురాష్ట్రమును వ్లాడివాస్టక్ రేవు పట్టణమును వశపరచుకొనిరి. క్రీ. వె. 1875 లో వారదేవిధముగ జపానును నిర్బంధించి సకీలియన్ ద్వీపపు దక్షిణభాగమును సంపాదించిరి. జపాన్ రషియాల మధ్య పోటీ దీనితో ప్రారంభమయ్యెను. పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభమున రషియావారు కాకసస్ పర్వత ప్రాంతముల

లోని కొండజాతులవారి నోడించి క్రీ. వె. 1878 నాటికి కార్స్ (Kars) ను జయించిరి. అప్పటికే రషియా చక్రవర్తులు టర్కీ-రాజ్యమును మ్రింగివేయ చూచుచుండిరి. కార్స్ వశపడిన తర్వాత తూర్పునుండికూడ టర్కీపై ఒత్తిడి కలిగించుట కవకాశ మేర్పడెను. పర్షియాతో ఘర్షణకు కూడ నిది మొద లవకాశ మేర్పడెను. సైబేరియా, మధ్య ఆశియాలు వారి స్వాధీనమగుటతో వారికి బొకారా, కీవ, సమర్కండ్, కోకండ్ మొదలగు మహమ్మదీయ రాజ్యములతో సంబంధ మవసర మయ్యెను. వీనితో వార నేక యుద్ధముల గావించి క్రీ. వె. 1878 నాటికి వానిని జయించి ఆఫ్గనిస్థానపు సరిహద్దులను చేరిరి. కనుక ఆధునిక యుగము ప్రారంభించిన తర్వాత ఆశియా ఖండములో ననేక దేశములకు రషియావారు సార్వభౌములైరి.

## ఫ్రాన్సువారి సామ్రాజ్యము

క్రీ. వె. 1776–1878 మధ్య యూరోపియనుల ప్రాబల్యము ఫ్రెంచివారి ప్రయత్నముల మూలమున కూడ కొంత వరకు వృద్ధిగాంచెను. వీరు చాలవరకు వీరి ప్రయత్నములను ఆఫ్రికా ఖండపు ఉత్తర పశ్చిమభాగములందు కేంద్రీకరించిరి. ఆఫ్రికా ఖండపు ఉత్తరభాగములోని ట్యూనిస్ (Tunis), ఆల్జీరియా (Algeria), మొరాకో (Morocco) రాష్ట్రములు మహమ్మదీయుల పాలనలోనివి. పేరున కివి టర్కీ-సుల్తానుకు లోబడినవైనను చాలవరకు స్వాతంత్ర్యము ననుభవించుచుండెను. ఇందులో నితర ప్రదేశములవారు సముద్రపు

దొంగలై మధ్యధరాసముద్రమున ప్రయాణము చేయు నౌకలపై పడి దోచుకొనుచుండిరి. వారికిదియే ప్రధాన వృత్తి. దీనిమూలమున ఫ్రెంచివారికి మిక్కిలి నష్టము సంభవించెను. క్రీ. శ. 1827–30 లో ఫ్రెంచివారు వారితో యుద్ధముల గావించి ఆల్జీరియాలోని కొన్ని రేవు పట్టణములను వశపరచుకొనిరి. కాని అంతమాత్రముచేత వారి యుపద్రవము తగ్గినది కాదు. అందుచేత వారు క్రీ. శ. 1848 నాటికి ఆల్జీరియా నంతను జయింపవలసి వచ్చెను. ఈ కాలములో ఆఫ్రికా ఖండముననే గాక ఆశియాలోని కొచ్చిన్ చైనానుకూడ ఫ్రెంచివారు జయించిరి.

## 4. యునైటెడ్ స్టేట్సు పలుకుబడి—వ్యాప్తి

క్రీ. శ. 1776–1878 లో యూరోపియన్ల ప్రాబల్యము ఆశియా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా ఖండములలో వ్యాపించుచుండిన కాలమందు అమెరికా ఖండమునందుకూడ నీవిషయములో కొన్ని గమనింపదగిన మార్పులు జరిగెను. దక్షిణ అమెరికాలోని స్పెయిన్ పోర్చుగల్ వారి వలసలు మాతృదేశములపై తిరుగుబాటుచేసి స్వాతంత్ర్యమును స్థాపించుకొనిరి. నెపోలియన్ స్పెయిన్ పోర్చుగల్ దేశములను జయించి పాలించిన కాలములో నిది జరిగెను. వానిని తిరిగి జయించుటకు ఆ దేశములవారికి శక్తిసామర్థ్యములు లేకపోయెను. ఫ్రెంచివారు స్పెయిన్ వారికి సందర్భములో కొంత సహాయపడదలచిరిగాని దానిమూలమున దక్షిణ అమెరికాలో ఫ్రెంచివారి ప్రాబల్య మధికమగునను భయముచేత

యునైటెడ్ స్టేట్సు అధ్యక్షుడగు మనోరె క్రీ. వె. 1823 లో నొక సిద్ధాంతమును ప్రతిపాదించి ఫ్రెంచిప్రయత్నముల కడ్డు తగిలెను. యూరపుదేశపు పరిపాలకు లెవ్వరు ఇకమీదట క్రొత్తగ అమెరికాలో వలసల నేర్పరచుకొనరాదనియు, వా రట్లు గావించినయెడల యునైటెడ్ స్టేట్సు వారిని ప్రతిఘటించుటకు సిద్ధముగ నుండుననియు మన్రో ప్రకటించెను. ఆ కారణముచేత నప్పటినుండి ఇప్పటివరకు యూరపువా రెవ్వరు దక్షిణ అమెరికాను జయింప ప్రయత్నించ లేదు. ఈ ప్రాంతమున యునైటెడ్ స్టేట్సువారి పలుకుబడి క్రమ క్రమముగ వృద్ధి గాంచెను. ఇచ్చటి రాజ్యములవారికి కావలసిన అప్పులు ఇతర విధములైన వర్తక వ్యాపార సహాయములు యునైటెడ్ స్టేట్సువారిమూలమున లభించుచున్నవి. ఆర్థిక రాజకీయ విషయములలో చాలవర కివి యునైటెడ్ స్టేట్సుకు అనుబంధములుగ నున్నవి. వీనిలోని నాగరికత విజ్ఞానములు చాలవరకు స్పెయిన్ పోర్చుగల్ దేశములనుండి వచ్చినవి అయినను, పందొమ్మిదవ శతాబ్దములో కొందరు జర్మనులు ఇటాలియన్‌లు ఇచ్చటికివచ్చి స్థిరనివాసము లేర్పరచుకొని వారి నాగరికతతో సంబంధమునుకూడ కొంతవరకు కల్పించిరి.

ఈ శతాబ్దములో ఉత్తర అమెరికా ఖండమునకూడ ప్రధానములగు కొన్ని మార్పులు సంభవించెను. క్రీ. వె. 1783 లో స్వాతంత్ర్యమును సంపాదించినపుడు యునైటెడ్ స్టేట్సులో అట్లాంటిక్ మహాసముద్రపు తీరప్రదేశము మాత్రము చేరియుండెను. అందులోని జనసంఖ్య కూడ

ఇరువదిలక్షలకు మించియుండలేదు. దానికి పశ్చిమమున లూయిసియాన ఫ్రెంచివారిపాలనలోను, దక్షిణప్రాంతములోని ఫ్లారిడా స్పెయిన్ వారి పాలనలోను ఉండెను. క్రీ. వె. 1803 లో యునైటెడ్ స్టేట్సు ప్రభుత్వము నెపోలియన్ వద్ద నుండి లూయిసియానాను కొనుగోలుచేసెను. ఇదే విధముగ క్రీ. వె. 1819 లో ఫ్లారిడాను కూడ స్పెయిన్ వారి వద్దనుండి కొనుటకు వీలయ్యెను. క్రీ. వె. 1845–48 లో మెక్సికో రాజ్యముతో యుద్ధముగావించి దాని వశమందుండిన భాగములనేకములను జయించి పసిఫిక్ తీరమువరకు యునైటెడ్ స్టేట్సువారు వారి అధికారమును వ్యాపింపజేసిరి. క్రీ. వె. 1867 లో వారు అలాస్కా రాష్ట్రమును రషియావారి వద్దనుండి కొనిరి. కనుక క్రీ. వె. 1878 నాటికి అట్లాంటిక్ పసిఫిక్ మహాసముద్రములకు మధ్యనుండు భూభాగమంతయు యునైటెడ్ స్టేట్సులో కలసెను. అట్లాంటిక్ తీరవాసులనేకులు పశ్చిమ ప్రదేశములకు వెళ్ళి, అచ్చట భూములను వ్యవసాయ యోగ్యములుగ జేసికొని స్థిరనివాసముల నేర్పరచుకొనిరి. సాహసించి ధనమును సులభముగ సంపాదింప దలచిన వారీ విధముగ పశ్చిమ భాగములకు వెళ్ళుటచేత దేశముయొక్క ఆర్థికసంపద విపరీతముగ వృద్ధిగాంచెను. దీనికి తోడు యూరపులోని ఇంగ్లండు, ఐర్లాండు, జర్మనీ మొదలగు దేశములలోని వారనేకులు సుఖముగ జీవించుటకు యునైటెడ్ స్టేట్సులోని పరిమితములగు సదుపాయము లుండుటచేత నచ్చటికి వేనకువేలుగవచ్చి కాపురము లేర్పరచుకొనిరి. క్రమక్రమముగ స్కాండినేవియన్ దేశములవారు, ఇటాలి

యన్ లు, గ్రీకులు, పోలులు, జెర్మనులు, యూదులు — వీరందరుకూడ యూరపుఖండము నందుండి యునైటెడ్ స్టేట్సుకువచ్చి చేరిరి. భూములులేక కష్టపడుచుండిన రైతులు, పారిశ్రామిక విప్లవము మూలమున బాధితులైన కార్మికులు, నిరంకుశ ప్రభువుల దౌర్జన్యమును సహింపలేని స్వాతంత్ర్య ప్రియులు, వర్తకవ్యాపారముల మూలమున ధనార్జన చేయ దలచినవారు యూరపును వదలి యునైటెడ్ స్టేట్సుకు తరలి సాగిరి. యూరపుఖండములో జనసంఖ్య విపరీతముగ పెరుగు చుండుటయు, దాని మూలమున విషమపరిస్థితు లేర్పడుటయు వీరి రాకకు కొంతవరకు కారణమయ్యెను. పొగయోడలు రైళ్ళు వాడుకలోనికి వచ్చుటచేత వీరు సులభముగా ప్రయా ణము చేయుటకు వీలుకలిగెను. ఈ విధముగ యూరపు లోని వివిధ జాతులవారు, వివిధభాషల మాట్లాడువారు, వివిధ మతములకు చెందినవారు పందొమ్మిదవ శతాబ్దమున యునైటెడ్ స్టేట్సుకు వచ్చి అంతకు పూర్వ మచ్చటనుండిన ఇంగ్లీషువారితో కలసిపోయిరి. సుమారు మూడుకోట్ల జను లీవిధముగ యూరపునుండి యునైటెడ్ స్టేట్సుకు వచ్చిరి. క్రీ. వె. 1783 లో ఇరువది లక్షలుగ నుండిన జనసంఖ్య క్రీ. వె. 1900 నాటికి పదికోట్లకు దాటుట కిదియే కారణము. అట్లాంటిక్ తీరమునుండి పసిఫిక్ తీరమువరకు యూరోపియన్ విజ్ఞాన నాగరికతలు సులభముగ వ్యాపించుట కిది మిక్కిలి తోడ్పడెను.

ఈ విధముగ యూరోపియన్ల రాజకీయ ప్రాబల్యము, వారి విజ్ఞానము, నాగరికత రషియావారి మూలమున ఉత్తర

ఆశియా, మధ్యఆశియాల యందును, ఇంగ్లీషువారి మూల మున ఇండియా, ఆస్ట్రేలియా, న్యూజిలెండు లందును, ఫ్రెంచివారి మూలమున ఉత్తర ఆఫ్రికా, ఇండోచైనాల యందును, డచ్చివారి మూలమున ఆగ్నేయ ఆశియా యందును వ్యాపించెను. దక్షిణ అమెరికాలో నిట్టిపనిని చేసినవారు స్పెయిన్ పోర్చుగల్ దేశములవారు. ఉత్తర అమెరికాలో దీనిని ప్రారంభించినవారు ఇంగ్లీషువారు, ఫ్రెంచి వారు. కాని యునైటెడ్ స్టేట్సు స్వతంత్రరాజ్యమైన తర్వాత లక్షలాదిగ యూరపునుండి వచ్చిన వివిధ జాతులవారు నీ యుద్యమములో పాల్గొనిరి.

# 8

# పారిశ్రామిక విప్లవము

క్రీ. వె. 1500 ప్రాంతమున ఆధునిక యుగము ప్రారంభమైనప్పటి యూరోపియన్‌లకును, పదునెనిమిదవ శతాబ్దపు తుదిభాగమునాటి యూరోపియన్‌లకును ఎంతో భేదముండెను. ఈ భేదము వారి మనోభావములందును, బుద్ధికుశలతయందును హస్తకౌశలమందును, జీవితములో వారుపయోగించుచుండిన సామగ్రియందును కనుపించెను. తాము సంకల్పించుకొనిన దానిని నెరవేర్చుకొనుటలో వారికిగల శక్తిసామర్థ్యములు దీనిమూలమున వృద్ధి గాంచెను. వారి ఆదర్శములలోను సంకల్పములలోనుకూడ నప్పటికెంతో భేదము కలిగెను. ఖండాంతరము లన్నిటియందును వారి ప్రాబల్యము వ్యాపించుట కిట్టి పరిణామమే ప్రధాన హేతువు.

తక్కిన ప్రాణికోటిలోలేని మహాశక్తి యొకటి మానవునిలో లీనమై యున్నది. అదియే సృష్టిశక్తి. అది వ్యక్త

మైనపు డతడు క్రొత్త పదార్థములను, పరికరములను, విధాన ములను నిర్మింపగలవాడగుచున్నాడు. లీనమైన సృష్టిశక్తి వ్యక్తము కానుకాను మానవజీవితములో అభివృద్ధి కలుగు చున్నది. దీనినిబట్టియే నాగరికతలో భేదములు కనబడు చున్నవి. కత్తి, గొడ్డలి, విల్లు, బాణము, నాగలి, రాట్నము, మగ్గము మొదలగునవి దీని ఫలితములే. వీని నన్నిటిని బహు ప్రాచీనకాలములో మానవుడు సృష్టించెను. ఆధునికకాలము ప్రారంభమగునాటికి ఈ విషయములో యూరోపియనులకును ఆశియాఖండ వాసులకును ఎట్టిభేదము ఉండినదికాదు. అన్ని దేశములలో ఒక్కటేమోస్తరు పని ముట్లను ప్రజలు వాడుచుండిరి. కాని ఆధునికయుగము ప్రారంభమైనతర్వాత ఈ విషయములో యూరపుఖండ దేశ ములలోనివారు విపరీతమైన ప్రజ్ఞనుచూపి అనేక యంత్రము లను కనిపెట్టి వాని సహాయమున వారికి కావలసిన వస్తు సముదాయమును ఉత్పత్తి చేసికొనగలవారైరి. దీని మూల మున వారి ప్రాబల్యము వృద్ధిగాంచెను.

క్రొత్త అవసరములను తీర్చుకొనవలసిన ఆవశ్యకము కల్గినప్పుడు క్రొత్త సాధనములను పరికరములను నిర్మించు కొనుటకు మానవుడు ప్రయత్నించునని అనుభవమువలన తెలియుచున్నది. తూర్పుదేశపు సరకులయందు యూరోపి యనులకు అభిరుచి పదమూడవ శతాబ్దమందు వృద్ధిగాంచుట చేత, ఆ దేశములకు సులభముగ వెళ్ళుట కనువగు సముద్ర మార్గమును వెదకుటకు వారు ప్రయత్నములు చేసిరి. దిక్సూచియంత్రము, మహాసముద్రములలోకూడ ప్రయాణ

ము చేయుటకు పెలగు గొప్ప నౌకలు, సముద్ర యాత్రలను దీర్ఘకాలము చేయవలసినప్పుడు కలుగు వ్యాధులకు ఔషధములు మొదలగువానిని వారిట్టి అవసరము తీర్చుకోవలసి వచ్చినప్పుడు కనిపెట్టిరి. ఇండియాకు సముద్రమార్గమును కనిపెట్టుట, అమెరికా ఖండమును కనుగొనుట—ఇదంతయు దీనిఫలమే. పీని మూలమున వర్తకవ్యాపారములు వృద్ధిగాంచెను. ఆశియా అమెరికా ఖండపు సరకు లత్యధికముగ యూరపు దేశములకు వచ్చుటచేత వానికి బదులుగ యూరపు ఖండమందుండి ఆ ఖండములకు ఎక్కువ సరకులను పంపవలసిన అవసర మేర్పడెను. ఈ అవసరమును తీర్చుకొనుటకు యూరోపియన్లు చేసిన కృషిమూలమున క్రొత్త పదార్థములు, పరికరములు, యంత్రములు, ఆర్థిక విధానములు, ప్రభుత్వపు ఏర్పాటులు నిర్మింపబడెను.

ఈ నిర్మాణములో నితర దేశములకంటె ఇంగ్లండు దేశము ముందంజ వేసెను. యూరపులోని మధ్యధరా సముద్రప్రాంతమందున్న దేశములకంటె వాయవ్య భాగమందున్న దేశములకు ఆధునిక యుగమున వర్తక వ్యాపారములందు కలిగిన ఎక్కువ ప్రాధాన్యము దీనికి కారణము. ఇందుచేత ఇంగ్లీషు బట్టలకు, బొగ్గుకు గిరాకి అధికమయ్యెను. లోతుగ బొగ్గుగనులను త్రవ్వుటకును, గనులలోని నీటిని పైకి తీసివేయుటకును క్రొత్త పనిముట్లవసరమయ్యెను. యుద్ధములసంఖ్య వృద్ధిగాంచుటచేత యుద్ధపరికరములకు కావలసిన ఇనుమునకును, ఉక్కునకును గిరాకి పెరిగెను. ఉప్పు పరి

శ్రమ కూడ దీనిమూలమున వృద్ధిగాంచెను. ముడిలోహ మును కరగించుటకు విశాలములగు కొలుములు (Furnaces), మంటజేయుటకు నీటి శక్తిసహాయమున పనిచేయు గాలి తిత్తులు ఉపయోగములోనికి వచ్చెను. వృద్ధిగాంచుచుండిన గిరాకికి తగినట్లు వస్త్రములు, బొగ్గు, ఇనుము మొదలగు వానిని ఎక్కువగ నుత్పత్తిచేయుటకు మామూలు చేతిపని వాండ్రు సమర్థులు కాకుండిరి. దానికి కావలసిన ముడి పదార్థములు మొదలగువానిని కొనుటకు వారివద్ద మూల ధనము లేదయ్యెను. అందుచేత ధనికులగు వర్తకులు వారికి ముడిపదార్థములను, ఇతర పరికరములను ఇచ్చి, వారిచేత పనిచేయించి, వారు తయారుచేసిన వస్తువులను విదేశములకు పంపి విక్రయించు బాధ్యతను వహించవలసిన వారైరి. పనివాండ్రు సాహుకార్లిచ్చిన కూలితో తృప్తి పొందవలసిన వారైరి. లాభనష్టముల ననుభవించువారు సాహుకారులైరి. గనుక క్రీ. వె. 1700 నాటికి కొంతవరకు సాహుకారీ విధానము ఆచరణలోనికి వచ్చెను.

క్రీ. వె. 1700 తర్వాత ఇంగ్లండులో యంత్రముల నిర్మాణ మొకటి వెంట నొకటి అతివేగముగ జరిగెను. క్రీ. వె. 1733 లో "కీ" అనువాడు "ఎగిరేకండె" (Flying shuttle) అను యంత్రమును సృష్టించెను. దాని ఫలితముగ బట్టలు నేయువారు నిర్ణీతకాలములో రెండింతల బట్టలను నేయగలిగిరి. కాని వారు నేయుటకు కావలసిన నూలు దొరకదయ్యెను. నూలునుకూడ వేగముగ వడకుటకు వీలగు యంత్రమును కనుగొనుటకు కొందరు ప్రయత్నింప

సాగిరి. క్రీ. వె. 1764 లో "హారగ్రీవ్స్" అనువా డందు కుపయోగించు స్పిన్నింగు జెన్నీ అను యంత్రమును కని పెట్టెను. తర్వాత అయిదు సంవత్సరములకు "ఆర్క్‌రైటు" నీటి శక్తిచే నడపగల యంత్రము నొకదానిని నిర్మించెను. క్రీ. వె. 1779 లో గట్టిదారమును, సన్నని నాణ్యమైన దారము ను వడుకగల స్పిన్నింగ్ మ్యూల్ (Spinning Mule) అను యంత్రమును క్రాంప్టన్ అనువాడును, కార్టురైట్ అను వాడు ఆవిరిశక్తి సహాయమున నడిపించు నేతయంత్రమును కనిపెట్టిరి. ఈ విధముగ లెక్కలేని పరిశోధనలు జరిగెను. వాని మూలమున దూదిని సాఫుచేయుటకును, ప్రత్తినుండి గింజలు వేరుపరచుటకును, బట్టలను చలువచేయుటకును, వానిపై చిత్రిచిత్రముగ అద్దకము వేయుటకును క్రొత్త యంత్రములు వాడుకలోనికి వచ్చెను. దీని ఫలితముగ బట్ట అత్యధికముగను చౌకగను తయారగుట కవకాశ మేర్పడెను. ఇంగ్లీషు బట్ట లధికముగ విదేశముల కెగుమతి యగుటకు వీలయ్యెను.

ఇట్లే ఇనుప పరిశ్రమ యందు క్రొత్తయంత్రము లనేకములు వాడుకలోనికి వచ్చెను. ముడిలోహమును చాల కాలమువరకు కట్టె బొగ్గుతో కరగించుచుండిరి. ఇనుమునకు గిరాకి అధికమగుటచేత ఇంగ్లండులోని అడవులందలి చెట్లు బొగ్గుకై కొట్టివేయబడి క్రీ. వె. 1730 నాటికి కట్టె బొగ్గు దొరకుట కష్టమయ్యెను. అందుచేత రాతిసిబొగ్గును వాడ వలసిన అగత్య మేర్పడెను. కాని దీనిమూలమున కరగిన ఇనుములో ననేక లోపములుండెను. ఆ లోపములను

పోగొట్టుటకును, ఎక్కువ రాక్షసిబొగ్గును ఇనుమును గనుల నుండి పైకి తీయుటకును సులభసాధనములు కావలసి వచ్చెను. అందుకై పరిశోధకు లనేకులు తీవ్రముగ కృషిచేసి అనేక యంత్రములను ఉపాయములను కనుగొనిరి. క్రమ క్రమముగ ప్రతి పరిశ్రమయందును క్రొత్త యంత్రములు వాడుక లోనికి వచ్చెను. అందుచేతనే క్రీ. వె. 1750 తర్వాతి కాలమునకు 'యంత్రయుగ'మను పేరు వచ్చెను. యూరోపియనులు వారికి గల సృష్టిశక్తి నుపయోగించుట మూలమున కలిగిన ఫలితములలో నిది యొకటి.

యంత్రయుగమున మరియొక గొప్ప నూతన నిర్మాణము కూడ జరిగెను. యంత్రములు తమంతటవి నడువజాలవు. వానిని నడుపుట కేదయో ఒక శక్తి కావలసియున్నది. ఇది మనుష్యశక్తి కావచ్చును. బండికూడ ఒక యంత్రమే; దానిని కొన్ని ప్రదేశములలో మనుష్యులే లాగుచున్నారు. లేదా అది జంతుశక్తి—ఎద్దులు, గుఱ్ఱములు మొదలగువాని శక్తి—కావచ్చును. నూనెగానుగల నాడుటకు కపిలె బావులలోనుండి నీటిని పైకి తీయుటకు ఎద్దుల నుపయోగించుట కలదు. లేదా అది వాయుశక్తి కావచ్చును; నీటి శక్తి కావచ్చును. క్రీ. వె. 1700 వరకిట్టి శక్తులనే ప్రపంచమందంతటను, ఇంగ్లండులోను వాడుచుండిరి. కాని ఆవిరి శక్తి సహాయమున యంత్రములను నడుపుటకు వీలగునని కొందరు తలచి క్రీ. వె. 1705 లో అట్టి నీటిఆవిరియంత్రమును ఇంగ్లండులో నిర్మించిరి. క్రీ. వె. 1763 లో జేమ్సువాట్ ఆ యంత్రమును పరిపక్వము గావించెను. క్రమక్రమముగ

ఇంజనీయర్లు మరికొందరు దీనిని మరింత చక్కబరచిరి. అట్టి వారిలో స్టీఫెన్‌సన్ ప్రఖ్యాతి గాంచెను. వీరి కృషిఫలిత ముగ ఆవిరిశక్తి సాధనమున యంత్రములను నడుపు పద్ధతి వృద్ధి గాంచెను. యంత్రయుగపు ప్రథమదశలో ననేక యంత్రములను కఱ్ఱతో చేయుచుండిరి. ఆవిరిశక్తి వాడుక లోనికి వచ్చినతర్వాత ఇనుప యంత్రముల నిర్మింపవలసిన అవసర మేర్పడెను. అందుచేత యంత్రయుగమునకు ఇనుప యుగమన్న పేరును, రాక్షసిబొగ్గు యుగమను పేరును సార్థక ములయ్యెను. ఇనుము బొగ్గు అపరిమితముగ ఇంగ్లండులో దొరకుటచేత యంత్రయుగ పరిశ్రమల కన్నిటికది కేంద్ర మయ్యెను. రానురాను బెల్జియం, జర్మనీ, యునైటెడ్ స్టేట్సు మొదలగునవి పారిశ్రామిక కేంద్రము లగుటకుకూడ నిదియే కారణము. యంత్రముల నడుపుటకు ఆవిరిశక్తి ఉపయోగములోనికి వచ్చుటచేత పరిశ్రమలయందేగాక వ్యవ సాయము చేయుటకును, పొగయోడలను రైళ్లను లాగుట కును ఈశక్తి వినియోగింపబడెను. ఇట్లు కొంతకాలము జరిగినతర్వాత పరిశోధకులు విద్యుచ్ఛక్తిని కనుగొని దాని నుత్పత్తి చేయుటకు యంత్రములను, ఉపాయములను కని పెట్టిరి. మరి కొంతకాలమునకు పెట్రోలు సహాయమున మరింత సులభముగను వేగముగను యంత్రములను నడుపు ఉపాయముకూడ పరిశోధకులకు లభించెను. కనుక క్రీ. వె. 1750 తర్వాత యూరోపియన్లు—వారిలో ముఖ్యముగ ఇంగ్లీషువారు—వారి సృష్టికౌశల్యమును యంత్రనిర్మాణ మందేగాక ప్రకృతిజములగు ఆవిరిశక్తి విద్యుచ్ఛక్తి పెట్రోలు

శక్తి మొదలగువాని నుత్పత్తిజేసి, వానిని వివిధములగు యంత్రములను నడిపించుటకు కావలసిన సాధనములను కను గొనుటయందు వినియోగించిరని స్పష్టమగుచున్నది.

యంత్రయుగముయొక్క ప్రథమ దశలో, అనగా క్రీ. వె. 1760 మొదలు 1830 వరకు, ప్రత్తిబట్టల నేయుట యందును ఇనుమును తయారుచేయుటయందును యంత్రముల నెక్కువగ వాడుచుండిరి. రెండవదశలో, అనగా 1830 మొదలు 1870 వరకు, యంత్రములు ఉన్ని, పట్టు మొదలైన పరిశ్రమలలో నుపయోగింపబడసాగెను. క్రమక్రమముగ పాదరక్షలు, గోధుమపిండి, సారాయి, కుర్చీలు, బల్లలు మొదలగు ఇంటిసామానులు, తుపాకులు, మందుగుండ్లు, తోటాలు, ఫిరంగులు, మొదలగు వానిని కూడ యంత్ర సహాయమున తయారుచేయుట మామూలయ్యెను. రసాయన శాస్త్రమం దనేక పరిశోధనల ఫలితముగ ఇనుమును కరిగించి గట్టి ఉక్కును తయారుచేయు పద్ధతులందును, పాలు, వెన్న, మీగడ, మాంసము, చేపలు, కూరగాయలు, పండ్లు మొదలైనవి చెడిపోక మాసములకొలది శుభ్రముగ నుంచుటకు కావలసిన పద్ధతులందును అనేక సదుపాయములు వాడుకలోనికి వచ్చెను. విద్యుచ్ఛక్తికి సంబంధించిన పరిశోధ నల ఫలితముగ టెలిగ్రాఫుతంతులద్వారా ఒకచోట నుండి మరియొకచోటికి వార్తలను పంపుటకు వీలయ్యెను. రబ్బరుతో చక్రములను ఇతరసామానులను చేయుటకూడ నీ దశలో వాడుకలోనికి వచ్చెను.

క్రీ. వె. 1870 వరకు ఇంగ్లండు మాత్రమే యంత్ర పరిశ్రమలకు కేంద్రముగ నుండెను. క్రొత్తయంత్రములను ఉపాయములను మొట్టమొదట కనిపెట్టినవారు ఇంగ్లీషు వారగుట దీనికొక కారణము. రెండు మూడు వందల సంవత్సరములుగ వర్తక వ్యాపారములలో దిగి విస్తార లాభము గడించినవారగుటచేత క్రొత్తపద్ధతుల ననుసరించి నడుప వలసిన పరిశ్రమలకు కావలసిన పెట్టుబడిధనము వారివద్ద విస్తారముగనుండెను. ఇదిగాక ప్రపంచములోని దేశములలో ననేకములు—ఇండియా, కనడా, ఆస్ట్రేలియా, మొదలైనవి వారి సామ్రాజ్యములో వారి పరిపాలన క్రింద నుండుటచేత వారు తయారుచేసిన వస్తువులను సులభముగ విక్రయించు టకు వారికున్నంత అవకాశము మరియెవ్వరికి లేకుండెను. దీనికితోడు క్రీ. వె. 1870 వరకు యూరపుఖండపు దేశము లలో రాజకీయవిప్లవము జరుగుచునే యుండెను. ఆ కార ణముచేత ఆర్థిక వ్యవహారములను సంస్కరించుకొనుటకు ఇంగ్లీషువారి కుండినంత సదుపాయము వారికి లేదయ్యెను. కనుక విదేశముల పోటీలేక ఇంగ్లీషువారు యంత్రసాధనమున వారి పరిశ్రమలను వృద్ధిజేసికొని, ప్రపంచములోని దేశము లన్నిటితో కాతాపెట్టుకొని, అపరిమితమైన లాభమును సంపాదించి, సమస్త ఐశ్వర్యములతో తులతూగ గలవారైరి. క్రీ. వె. 1870 తర్వాత నిది చాలవరకు మారెను. జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీ, యునైటెడ్ స్టేట్సు మొదలగు దేశములు కూడ పరిశ్రమ కేంద్రములై, ఇంగ్లండుతో పోటీకి దిగెను. క్రిమక్రమముగ యంత్రియుగ ప్రభావము ప్రపంచమందం

తట పొడగట్టెను. సామ్రాజ్యసంపాదనమునకై యూరపు ఖండములోని అగ్రరాజ్యములవారు పందెములు వేసికొని క్రీ. శ. 1878 తర్వాత పరుగులెత్తుట కిదియే ప్రధాన కారణము.

యంత్రముల నుపయోగించి పదార్థములను విరివిగను వేగముగను తయారుచేయుటకు శక్తిసామర్థ్యములను సంపాదించిన ఇంగ్లీషువారును తదితరులును వ్యవసాయవిధానమందు కూడ లాభకరములగు మార్పులను గావించిరి. భూసారము తగ్గకుండుటకును వృద్ధిగాంచుటకును ప్రత్యేకముగ కొన్ని రకముల పంటలను పండించుట; రసాయనికపు ఎరువులను వాడుట; సంవత్సరము పొడుగున పశువులకు మేతదొరకుటకు కొన్ని రకముల పంటలను పండించుట; సారముతగ్గకుండుటకై భూములను రెండు మూడు సంవత్సరముల కొక పర్యాయము సాగుచేయక బీడుపెట్టుటకు బదులు (ఇది ప్రాచీనపద్ధతి) రక రకములగు పంటలను సాగుచేయుట మొదలగు పద్ధతులు వాడుకలోనికి వచ్చెను. క్రమక్రమముగ పరిశ్రమలలో యంత్రములకు ప్రవేశము కలిగినట్లు వ్యవసాయములోనికి కూడ యంత్రములకు ప్రవేశము కలిగెను. దున్నుటకును, చదరపెట్టుటకును, నారునాటుటకును, కలుపుతీయుటకును, పండిన వరి కోసి కుప్పవేయుటకును, కుప్పలనుకొట్టి ధాన్యమును గడ్డినుండి వేరుచేయుటకును, జలాధారములలోని నీటిని భూములలోనికి పాటించుటకును — వ్యవసాయమునకు సంబంధించిన వివిధములగు పనులనన్నిటిని చేయుటకును, ఆవిరి

శక్తి, విద్యుచ్ఛక్తి, పెట్రోలుశక్తి మొదలగువాని సహాయమున నడచుయంత్రములను వాడుట మామూలయ్యెను.

ఇదేవిధముగ పుస్తకముల నచ్చువేయుటకు యంత్రములు కనిపెట్టబడెను. యంత్రములతో కాగితములను తయారుచేయుట; వార్తాపత్రికలకు కావలసిన పొడవైనట్టియు మిక్కిలి వెడల్పు గలిగినట్టియు కాగితములుచేయుట; అచ్చుపనినంతను యంత్రములతో గావించుట; ఏకకాలమున వరుసగ పత్రికను అచ్చువేసి, మడత పెట్టుటకు యంత్రముల వాడుట—ఇది సర్వసాధారణ మయ్యెను. అక్షరాస్యులందరు వార్తాపత్రికలను ఇతర గ్రంథములను చౌకగ సంపాదించి చదువుట సులభమయ్యెను. చేతితో వ్రాయుటకు బదులు టైపురైటర్ సహాయమున వ్రాయుట మామూలయ్యెను. ఫోటోలు తీయుటకును, పాటలు పాడుటకును (గ్రామఫోన్), నాటకముల నాడుటకును (సినిమా), దూర ప్రదేశములలో మాట్లాడువారి మాటలను, పాడువారి పాటలను వినుటకును (రేడియో), దూరమందుండువారిని చూచుటకును (టెలివిజన్) యంత్రములను కనిపెట్టిరి. రోజురోజునకు ప్రపంచము, ప్రపంచములోని పరిశ్రమలందును, వ్యవసాయమందును, ప్రయాణ సాధనములందును, విలాసములందును, వినోదములందును క్రొత్త యంత్రము లెన్నియో వాడుకలోనికి వచ్చుచుండుటను గమనించినయెడల ప్రస్తుత కాలమునకు యంత్రయుగమను పేరు మరింత సార్థకమగుచున్నదని స్పష్టము కాగలదు.

ఆవిరి, విద్యుత్తు, పెట్రోలు మొదలగు బాహ్యశక్తుల సహాయమున నడచు యంత్రములను కనిపెట్టి, ఐహిక జీవితమునకు సంబంధించిన చర్యలన్నిటిలో వానిని వాడుటయే ప్రధాన లక్షణమైన ప్రస్తుత యంత్రయుగములో మానవుని మనోభావములు చిత్తవృత్తులు తత్వదృష్టి, అత డేర్పరచుకొనిన ఆర్థిక విధానములు రాజ్యాంగములు సాంఘిక సంస్థలు పూర్తిగ మారిపోయెను. మానవున కతీతమైన శక్తులు ప్రపంచములో లేవనియు, ఉన్నను వానిని క్రమక్రమముగ నతడు జయించి స్వాధీనపరచుకొనగలవాడగుననియు అందరు అభిప్రాయపడ సాగిరి. తన శక్తియందును ప్రజ్ఞయందును ఇంతటి విశ్వాసము మానవునిలో ఉదయించుటచేత విరామము విశ్రాంతి లేక తదేకదీక్షలో వస్తుశాస్త్ర పరిశోధనమందు జీవితమంతయు గడుపు శాస్త్రజ్ఞులు పాశ్చాత్య ప్రపంచములో ప్రధానస్థానము వహించినవారైరి. ప్రాచీన కాలమున యోగులు తపశ్శాలురు సన్యాసులు మతప్రచారకులు మొదలగువారికుండిన గౌరవమర్యాద లీకాలమున ప్రకృతిశాస్త్రవేత్తలకు లభించుచున్నవి. జ్ఞానము, జ్ఞాని అన్నమాటల కీ కాలమున క్రొత్త అర్థము వచ్చియున్నది. తపోవనములు, దేవాలయములు, మఠములు, మొదలగువానికి బదులు పరిశోధనశాలలు, గ్రంథాలయములు, కర్మాగారములు ప్రశంసా పాత్రములయ్యెను. దీనిమూలమున మతము, నీతి, మొదలగు విషయములతో లెక్కలేని మార్పులు కలిగెను.

ఆహార పదార్థములు, వస్త్రములు, ఇండ్లు, ఇంటి 'మానులు, మనుష్యుని అవసరములు తీరుటకు కావలసిన తర వస్తువులు—వీనిని ఉత్పత్తి చేయుటయందు మానవుల ధ్య నేర్పడు సంబంధములకు ఆర్థిక విధానమని పేరు. స్తువుల నుత్పత్తి చేయుటకు యంత్రముల నుపయోగించు ద్ధతి వాడుకలోనికి వచ్చుటచేత పాశ్చాత్య దేశములలోని ర్థిక విధానము మారెను. క్రమక్రమముగ దాని ఫలితము తర దేశములలోనికి కూడ వ్యాపించెను.

యంత్రయుగమునకు పూర్వము దేశములోని జనుల లో అధిక సంఖ్యాకులు వ్యవసాయముచేయువారుగ నుండిరి. ముడిపదార్థములగు ప్రత్తి, ఉన్ని, మొదలగువానిని అనుభవ యోగ్యములు గలుగ చేయుటయే, వృత్తిగాగల చేతిపనివాండ్ర సంఖ్య తక్కువగానుండెను. ఇట్టిపనులకే పరిశ్రమలని పేరు. యంత్రముల మూలమున నీ విషయములో గొప్పమార్పులు సంభవించెను. పరిశ్రమలయందును, దానికిసంబంధించిన వర్తకవ్యాపారములందును, రైళ్ళు మొదలగు ప్రయాణసౌకర్యములను సమకూర్చుటయందును, పనిచేయువారిసంఖ్య వృద్ధిగాంచెను. ఇంగ్లండు, యునైటెడ్ స్టేట్సు, జర్మనీ మొదలగు దేశములన్నిటిలో వ్యవసాయదార్ల సంఖ్య తగ్గి పారిశ్రామికులసంఖ్య వృద్ధిగాంచెను. పల్లెటూళ్లలో నివసించువారి కంటె పట్టణములలో నివసించువారు అధిక సంఖ్యాకులైరి. ఒకప్పుడు దేశములో నూటికి ఎనుబది తొంబదిమంది కష్టపడి భూములను సాగుజేసినగాని ప్రజలందరికి కావలసిన ఆహారాది పదార్థములు లభించకుండెను. యంత్రప్రభావము చేత

తక్కువజనము వ్యవసాయములో నున్నను ఎక్కువపంటలను పండించుటకు వీలగుటచేత, పారిశ్రామికులు వృద్ధియగుటయు వ్యవసాయదారుల సంఖ్య తగ్గుటయు సంభవించెను. ఆర్థికాభివృద్ధికిది యొక ప్రధాన లక్షణము. పరిశ్రమలలో పనిచేయు కార్మికులకు రైతుజనమున కంటె నీకాలమున నెక్కువ ప్రాధాన్య మీ కారణముచేతనే కలిగెను.

పరిశ్రమలలో పనిచేయువారు వారివారి ఇండ్లలో పని చేయుటకుబదులు ప్రత్యేక కర్మాగారములలో— అనగా ఫ్యాక్టరీలలో పనిచేయుట యంత్రయుగమున కొక ప్రధాన లక్షణము. యంత్రములు పనివాండ్రు కాపురముచేయు ఇండ్లలో ఇముడుసవికావు. వానిచేత పనిచేయించుకొనుట కొకరిద్దరు పనివాండ్రు చాలరు. వందలకొలది కార్మికు లుండవలెను. అవి పనిచేయుట కెంతో ముడిపదార్థము లవసరము. అవి తయారుచేయు అనుభవ యోగ్యములగు పదార్థములుకూడ అధికముగ నుండును. వీటి నన్నిటిని దాచియుంచుటకు మామూలు ఇండ్లు చాలవు. విశాలములైన కార్ఖానా లుండవలెను. ఆ కారణముచేత వేలకొలది కార్మికులు వారి ఇండ్లలోగాక యంత్రములకు నిలయములైన ఫ్యాక్టరీలలో పనిచేయుట అవసర మయ్యెను. ఇండ్లలో పనిచేయువారు వారి కిష్టము వచ్చినప్పుడు ఇష్టము వచ్చినట్లు పనిచేయుచుండిరి. ఫ్యాక్టరీ పద్ధతిలో నిట్టి స్వేచ్ఛకు అవకాశము లేదు. నిర్ణీతకాలమున ఫ్యాక్టరీకి వచ్చుట, నిర్ణీత కాలములో ఎవరివంతు పనిని వారు చేయుట అత్యవసరము. ఎవరుగాని వారికి కేటాయింపబడిన పనిని వారు చేయని

యెడల తక్కినవారి పనికూడ ఆగిపోవును. కనుక కార్మికులు క్రమముగ పనిచేయుచున్నారో లేదో గమనించుటకు విచారణాధికారు లనేకులు ఫ్యాక్టరీలలో అవసరమగుచున్నారు. కార్మికుల స్వేచ్ఛకు దీనిమూలమునగూడ కొంత అడ్డు కలుగుచున్నది. కాని ఇట్టి నియమములకు లోబడిన గాని ఫ్యాక్టరీ విధానములో పని చక్కగ సకాలమునకు జరుగదు.

ఫ్యాక్టరీపద్ధతిని పరిశ్రమలను స్థాపించి నడిపించుట కెంతో ధనము పెట్టుబడి పెట్టవలసియున్నది. వారి వారి ఇండ్లలో మగ్గములు పెట్టుకొని చేనేత గావించువారు వందరూపాయల మూలధనముతో వారి పనిని సాగించుకొనవచ్చును. కాని బట్టలమిల్లును స్థాపించుటకు లక్షలకొలది రూపాయలు కావలసియున్నది. ధనికులగు సాహుకారులే ఫ్యాక్టరీల నెలకొల్పుటకు సమర్థులగుచున్నారు. ఫ్యాక్టరీలు, అందులోని యంత్రములు, ఇతర పరికరములు, ముడివస్తువులు, తయారైన పదార్థములు — వీని కన్నిటికి వారు సొంతదార్లుగను యజమానులుగను ఉన్నారు. పనిచేయువారు వారి ఆజ్ఞలను శిరసావహింపవలసిన వారగుచున్నారు. ఏదైన ఒక వృత్తియందు నేర్పును సంపాదించినవాడు దాని ననుసరించుటకు కావలసిన పరికరములను స్వయముగ సంపాదించి సొంతదారుడై పనిచేయుటకు యంత్రయుగములో సాధ్యముకాదు. పరికరములు ఫ్యాక్టరీ సొంతదార్ల ఆధీనమందుండుటచేత వారి ఇష్టానిష్టములబట్టి కార్మికులకు ఉద్యోగములు దొరకవలసియున్నది. పనినుండి ఏ కారణముచేతనైన యజమానులు

వారిని తొలగించినయెడల వారు కూలి దొరకక కుటుంబమును పోషించుకొనలేక పస్తుండవలసిన వారగుటతప్పదు. అట్టి వారు యజమానులతో సమానబలము గలవారై కూలి విషయమునను, పనిచేయవలసిన కాలమును గురించియు, సెలవు దినముల గురించియు, తమ సౌఖ్యమున కత్యవసరములగు ఇతర విషయముల గురించియు నిలబడి బేరముచేసి తమ పనికి తగిన జీతమును నిర్ణయించుకొన సమర్థులుకారు. యజమాను లెట్టి షరతులను విధించినను వానికి లోబడి పనిచేయవలసిన స్థితిలో నుందురు. మధ్యయుగమందును, విప్లవయుగమునకు పూర్వము ఆధునిక కాలమందును వ్యవసాయములో ఇట్టి విధానముండెను. ఫ్యూడల్ పద్ధతిలో భూస్వాము లొకవర్గముగను భూమిని దున్ని పంటల పండించు రైతు లింకొక వర్గముగను ఉండిరి. పరిశ్రమలలో కూడ కొంతవరకీ వర్గ విభేదము యంత్రయుగమునకు పూర్వము కూడ మొలకలెత్తియుండెను. పనివాండ్రు వారి వారి ఇండ్లలో వారి వారి పరికరములతో పనిచేయుచుండినను వారికి కావలసిన ముడిపదార్థములను వర్తకులు వారికిచ్చి, వారిచేత నిర్ణీతమైన కూలికి పనిచేయించి, వారు తయారుచేసిన వస్తువులను తీసికొని అమ్మి లాభము సంపాదించుపద్ధతి యూరపుఖండమందుండెను. కాని యంత్రములు వాడుకలోనికి వచ్చిన తర్వాత ఈ పద్ధతి సర్వసామాన్యమయ్యెను. కార్మికు లుపయోగించు పరికరములకును, ముడిపదార్థములకును, వారు తయారుచేయు వస్తువులకును వారు యజమానులు కాకుండుటయు, సాహుకార్లు ధనికులగు తదితరులు వానికి యజమాను

ొగుటయు సంభవించెను. కనుక యంత్రసాధనమున ఫ్యాక్టరీ ద్ధతిని పరిశ్రమలు యూరపుఖండమున స్థాపితములగుట కాలమున నా దేశములలోని సంఘములలోని ప్రజలు రెండు ర్గములుగ విభాగమైరి. ఇట్లేర్పడిన సాహుకారి కార్మిక ర్గముల మధ్య నేర్పడిన సంఘర్షణము ఇటీవలికాలపు చరిత్రకు ప్రధాన లక్షణమయ్యెను. ధనమును సంపాదించు ంలో మానవు డుపయోగించు సాధనములందు కలిగిన మార్పుల మూలమున నితరులలో నతనికుండు సంబంధములు మారుచుండుననుట కిది యొక గొప్ప దృష్టాంతము.

ప్రథమదశలో ఫ్యాక్టరీ పద్ధతిమూలమున కార్మికుల కనేక కష్టములు కలిగెను. సాహుకార్ల యొక్కయు యభిమానులయొక్కయు దృష్టి లాభమొక్క దానియందే కేంద్రీకృతమగుటచేత, కార్మికుల కష్టములను వారు గమనింపక వారిచేత ఇష్టమువచ్చినట్లు పనిచేయించుచుండిరి. రోజునకు పండ్రెండు పదునాలుగు గంటలు విరామములేక పని చేయుట; తక్కువ కూలిపనిచేయువారన్న భావముతో స్త్రీల చేతను పిల్లలచేతను పనిచేయించుట; ఖర్చుల తగ్గించుకొనుటకై వెలుతురు గాలి లేక క్రిక్కిరిసిన శాలలలో కార్మికుల చేత పనిచేయించుట; వారికి తక్కువ కూలినిచ్చుట; యంత్రములతో పనిచేయునపుడు వారికేదైన ప్రమాదము కలిగినను దానికెట్టి పరిహారము నియ్యకుండుట — ఇట్టి పరిస్థితులు సర్వసాధారణముగ నుండెను. వీనిని చక్కబెట్టుటకు ప్రభుత్వమువారుకూడ ఎట్టి ప్రయత్నము చేసినవారుకారు. సాహుకార్ల స్వేచ్ఛకు భంగము కలిగించినయెడల పరిశ్రమ

లను స్థాపించుటకు వారు వెనుదీయుదురనియు, ఆ కారణము చేత దేశైశ్వర్యమునకు భంగము కలుగుననియు ఆ కాలపు ప్రభుత్వమువారు భావించియుండిరి. కార్మికుల పక్షమున వాదించగలవారు రాజ్యాంగ సభలలో లేరైరి. అందు చేత యంత్రియుగము ప్రారంభమైనతరువాత నొకటి రెండు తరములవరకు, ఇంగ్లండునందును ఇతర దేశములందును, కార్మి కుల స్థితి మిక్కిలి శోచనీయముగను దుర్భరముగను పరిణ మించెను. ఫ్యాక్టరీలచుట్టు పట్టణములు పెరిగెను. ఆరోగ్య సూత్రముల ననుసరించి వానిని నిర్మాణము చేయవలసిన అవసరమును అప్పటివారు గ్రహించిన వారుకారు. పశువు లుండుటకుకూడ తగని గుడిసెలలో ఎట్టి సదుపాయములు లేక కార్మికులు జీవితము గడపుచుండిరి. దుర్గంధముతో కూడిన మురికినీటి కాలువలు, పెంటకుప్పలతో నిండిన వీధులు, పట్టణ ములకు లక్షణములయ్యెను. ఆ కాలమున జనసంఖ్య విప రీతముగ పెరుగుచుండుటచేత కార్మికుల కష్టములు మరింత దుర్భరములయ్యెను.

లాభ మొక్కదానినే కాంక్షించు యజమానుల మూలముననగాని, తాము జోక్యము కలిగించుకొనినయెడల వ్యక్తుల స్వేచ్ఛకు భంగము కలుగునేమోయని శంకించు ప్రభుత్వమువారి మూలముననగాని తరించుట సాధ్యము కాదను విషయమును క్రిమక్రమముగ కార్మికులు గ్రహించి, స్వసహా యము చేతనే తమ స్థితిగతులను చక్కబెట్టుకొనుటకు ప్రయత్నించిరి. కార్మిక సంఘముల సంస్థాపనము, వాని అభివృద్ధి దానియొక్క ఫలమే. కార్మికుడు ఒంటరిగ యజ

మానునితో సరిసమానముగ బేరమాడి తన స్థితి గతులను బాగుచేసికొనుట సాధ్యముగానిపని అనియు, కార్మికు లందరు కలసి, ఒక సంఘముగ నేర్పడి యజమానులతో బేరమునకు దిగినయెడల నతడు వారి షరతులకు విధిలేక అంగీకరింపవలసిన వా డగుననియు కార్మికులు గ్రహించి, క్రీ. శ. 1825 నుండి అట్టి సంఘములను స్థాపించుకొనసాగిరి. కొంతకాలము వరకు ప్రభుత్వమువా రిట్టి సంఘములు చట్ట విరుద్ధములనియు వ్యక్తుల స్వేచ్ఛకు భంగకరములనియు, చెప్పుచుండిరి గాని కార్మికుల పట్టుదలమూలమున ఆ వాదమునువారు మానుకొని సంఘములు చట్ట సమ్మతములని గుర్తించిరి. క్రీ. శ. 1875 నాటి కీ సంఘములు బలవత్తరములయ్యెను. సమ్మెల ద్వారా తమ పరిస్థితులను చక్కబెట్టుకొనుటకు వీరు సంసిద్ధులైరి. యజమానులు వారి కోరికలను నిరాకరింపలేక, వారితో బేరమాడి ఉభయపక్షములకు లాభకరములుగ నుండు షరతుల కంగీకరింపసాగిరి. కాలక్రమమున ఫ్యాక్టరీలలోను గనులలోను రైళ్ళలోను వ్యవసాయములోను ఇతరవృత్తులందును పనిచేయువా రందరు కార్మిక సంఘములలో సభ్యులైరి. కార్మికులు సుఖపడుటకు కావలసిన ఏర్పాటు లన్నిటిని సంఘములు చేయదొడగెను. తుదకు రాజకీయములలో ప్రవేశించి శాసన సభలకు ప్రతి నిధులను పంపుట అవసరమని సంఘములు గ్రహించి, ప్రభుత్వము మూలమున కార్మికులకు జరుగవలసిన సదుపాయములు జరుగునట్లు చేయగలిగిన వయ్యెను. ఇటీవలి కాలపు ప్రపంచ చరిత్రలో నీ కార్మికోద్యమము గమనింప దగిన ప్రధాన

విషయములలో నొకటియని చెప్పదగియున్నది. సంఘమందు సామాన్యజనులగు కార్మికులుకూడ సుఖార్హులన్న అభిప్రాయము బలపడుటయందును, దాని ననుసరించి ఆర్థిక విధానము రాజ్యాంగము మారుటయందును ఈ యుద్యమము ప్రాధాన్యము వహించెను..

ఫ్యాక్టరీపద్ధతి ప్రారంభమైన కాలములో ప్రభుత్వము వారు కార్మికుల స్థితిగతులను బాగుచేయు బాధ్యతను వహించుట కిష్టపడకున్నను, క్రమక్రమముగ వారు వారభిప్రాయములను మార్చుకొనిరి. స్త్రీలు పిల్లలు పడుచుండిన బాధ సహింపరాని దయ్యెను. గనుక ఫ్యాక్టరీ చట్టములను కొన్నిటిని వారు నిర్మించి ఎన్ని గంటలకాలము పిల్లలు, స్త్రీలు, ఇతర కార్మికులు పనిచేయతగినవారో నిర్ణయించిరి. కొన్ని ఫ్యాక్టరీలలోను, గనులయందును స్త్రీలుగాని పిల్లలు గాని పనిచేయుట నిషేధించిరి. క్రమ క్రమముగ తక్కిన కార్మికుల పరిస్థితులను బాగుచేయుట కవసరమైన చట్టము లను వారుచేసి, పనికాలమును తగ్గించుటయేగాక ప్రమాదముల మూలమున కలుగు నష్టములకు పరిహారము నియ్యవలసినదనియు, కార్మికుల ఇతర సౌకర్యములకొరకై యజమానులు కొంత ద్రవ్యమియ్యవలసినదనియు శాసించిరి. ఇట్టి శాసనము లీకాలమున పారిశ్రామిక దేశములన్నిటిలో నున్నవి. నిరుద్యోగ కాలమందును, రోగపీడుతులైనప్పుడును, వృద్ధాప్యమందును కార్మికులకు కావలసిన సహాయమీ చట్టముల మూలమున లభ్యమగుచున్నది.

తాము తరించుటకు స్వయం సహాయమే ప్రధాన సాధనమని కార్మిక సంఘములను స్థాపించుకొనిన కార్మికులు తమకు కావలసిన పదార్థములను మామూలు దుకాణము లలో కొనుటకుబదులు తామే ప్రత్యేక సహకార సంస్థలను నిర్మించుకొని మధ్యవర్తులు, దలారులు మొదలగువారి అవస రములేక క్రయవిక్రయముల జరుపుకొనసాగిరి. సహ కారోద్యమ మీ విధముగ ఇంగ్లండులోను తదితర దేశము లందును వ్యాపించెను. సామాన్యజను లిటీవలికాలమున మంచి స్థితిలోనికి వచ్చుట కిదియొక ప్రధాన సాధనమయ్యెను. కార్మిక సంఘములను సహకార సంస్థలను నడిపి నిర్మాణ కార్యములందు నేర్పు సంపాదించిన కార్మిక నాయకులు క్రమ క్రమముగ రాజ్యాంగ సభలలో ప్రవేశించి మంత్రులై పరిపాలనమును దీక్షతో నడుపగలవారైరి.

ఈ వివరణమునుబట్టి యంత్రయుగమున పాశ్చాత్య ప్రపంచ మే విధముగ మారెనో స్పష్టమగుచున్నది. ప్రజ లలో అధికసంఖ్యాకులు నగరవాసులైరి. పల్లెటూళ్ళ జీవిత మునకంటె పట్టణవాసముల జీవిత మెక్కువ ప్రాధాన్యము వహించెను. యంత్రయుగమునకు పూర్వము—వేలకొలది సంవత్సరములుగ— సామాన్యజనము దారిద్ర్యబాధ ననుభ వించుచుండెను. భూస్వాములును, అధికారవర్గములో నుండినవారును, బాహుళ్యముగ వర్తకము చేయుచుండిన వారు మాత్రమే సుఖముగ కాలము గడుపుచుండిరి. సుఖ జీవితమునకు కావలసిన పదార్థములు తక్కువగ నుత్పత్తి

యగుచుండుటయే దీనికి కారణము. యంత్రయుగములో నిది మారెను. భూమినుండి పండు పంట లధికమయ్యెను. ప్రపంచములో నెచ్చట పండినను వానిని దేశములన్నిటికి తెచ్చుటకు కావలసిన ప్రయాణ సౌకర్యము లేర్పడెను. బట్టలు, ఇంటిసామానులు ఇతర పదార్థములు యంత్రముల సాధనమున నుత్పత్తి యగుటచేత నవి చౌకగ లభించుట కవకాశ మేర్పడెను. అందుచేత సామాన్య జనముకూడ సుఖముగ జీవింపగలవారైరి. వారి ఆహార పదార్థములు, దుస్తులు, ఇండ్లు, ఇంటిసామానులు, విలాసములు, వినోద ములు, వారి ఆరోగ్యము, వారి జీవిత పరిమాణము, విద్య నేర్చుకొనుటకు వారికిగల అవకాశములు—ఇవి అన్నియు వృద్ధిగాంచెను. ఐహిక జీవితము కష్టములతో కూడుకొన్న దనియు, సుఖమనునది పరలోకమందే లభించుననియు సామా న్యముగ నదివరకు సామాన్యాభిప్రాయముగ నుండెను. యంత్రయుగమున నిది మారెను. భూలోకమును స్వర్గ తుల్యముగ చేయవచ్చునని పదునెనిమిదవ శతాబ్దపు యూరో పియన్ తత్వవేత్తలు ప్రతిపాదించిన సిద్ధాంతము యథార్థ మగున ట్లగుపడెను. ప్రజల బాహ్యజీవితమందేగాక, వారి ఆంతరంగిక జీవితమందుకూడ యంత్రయుగమున విపరీతము లగు మార్పులు కలిగెను. యంత్రనిర్మాణము, యంత్ర ముల వాడుక—వీనిమూలమున వారి బుద్ధిసూక్ష్మత, హస్త లాఘవము, నిర్మాణశక్తి వృద్ధిగాంచెను. క్రొత్త సమస్యల నెదుర్కొని వానిని తగినట్లు పరిష్కరింపవలసిన పరిస్థితు లేర్పడుటచేత వారిలో లీనమైయుండిన శక్తు లనేకములు

బహిర్గతములు కావలసి వచ్చెను. పురుషులతో పాటు స్త్రీలుకూడ స్వతంత్రముగ ననేక వృత్తులలో ప్రవేశించి ఆదాయమును సంపాదించి పోషించుకొన గలవారైరి. మానవ సంఘముయొక్క స్వరూపమంతయు నీకారణమున మారిపోయెను.

# 9

# జాతీయ, ప్రజాస్వామ్య, జీవకారుణ్య ఉద్యమములు

యంత్ర సహాయమున పదార్థముల నుత్పత్తి చేయు పద్ధతి వృద్ధిగాంచుచున్న కాలములో మరిమూడు యుద్యమములు కూడ పాశ్చాత్య ప్రపంచమున (అనగా యూరపు, అమెరికా ఖండములందు) ప్రాబల్యముగాంచెను. వానిలో మొదటిది జాతీయోద్యమము; రెండవది ప్రజాస్వామ్యము; మూడవది కారుణ్యోద్యమము (Humanitarianism). వీని మూలమున మానవ జీవితమం దసంఖ్యాకములగు మార్పులు సంభవించెను. ఇరువదియవ శతాబ్దములోని మానవులకును పదునెనిమిదవ శతాబ్దమునకు పూర్వమందుండిన వారికిని ఈ యుద్యమముల ఫలితముగ ననేక భేదములు కలిగెను.

జాతి, జాతీయత అను మాటల కనేకులు అనేక అర్థములను కల్పించియున్నారు. జాతీయోద్యమమును వివ

రించు సందర్భములో జాతి యను మాట కెట్టి యర్థము కలదో నిర్ణయించుకొనవలసియున్నది. ఒక విధమైన భావముగల ప్రజా సమూహమునకు జాతి యను పేరు చెల్లుచున్నది. తమలో తమ కెన్ని భేదములున్నను రాజకీయ విషయము లలో తామందరు ఒక్కరనియు, ఇతరులు వేరనియు, భావించువా రొకజాతిగ నేర్పడుచున్నారు. పదునెనిమిదవ శతాబ్దపు ఆఖరు భాగమందుండి అట్టిభావము యూరపు ఖండవాసులలోను అమెరికా ఖండవాసులలోను అత్యధిక మయ్యెను. ఆ కారణమున నదివరకుండిన సామ్రాజ్యము లనేకములు విచ్ఛిన్నములగుటయు క్రొత్త రాజ్యములు స్థాపింపబడుటయు సంభవించెను. భిన్న ప్రభుత్వముల పరి పాలనలో నుండినవారు ఒక ప్రభుత్వమునకు లోబడుట కూడ జరిగెను. కనుక జాతీయోద్యమము రాజకీయముగ కొంద రిని వేరుపరచెను; మరికొందరిని ఒక్కటిగ జేసెను. దీని మూలముననే రెండు విధములగు ఫలితములు కలిగెను.

ఫ్రెంచి విప్లవము ప్రారంభమగునాటి కీ జాతీయభావము అనేకులలో లేకుండెను. యూరపుఖండమం దంతకు పూర్వ మెన్ని శతాబ్దములనుండియో జర్మనీదేశములో జర్మనులు, ఇటలీలో ఇటాలియనులు, ఆగ్నేయ యూరపులో గ్రీకులు, బల్గేరియన్‌లు, రుమేనియన్‌లు, సర్వియన్‌లు; ఉత్తర యూరపులో ఫిన్నులు, లాట్వియన్‌లు, ఎస్తోనియన్‌లు మొదలగు ప్రజలెందరో యుండిరి. కాని జర్మనులలో జాతీయభావము లేకుండెను. అనగా తామందరు తాము నిర్ణయించుకొనిన ప్రత్యేక ప్రభుత్వమునకు లోబడియుండుటయే న్యాయమనియు,

అట్టి ప్రభుత్వము నొకదానిని స్థాపించుటకై తాము గట్టి ప్రయత్నము చేయవలెననియు వారు పందొమ్మిదవ శతాబ్దమునకు పూర్వము భావించి యుండలేదు. ఇటాలియన్‌లు, గ్రీకులు మొదలగువానిలో కూడ అట్టి భావమంతకుపూర్వము లోపించి యుండెను. జర్మనులందరు ఒక దేశమున నివసించు చుండినవారే; ఒకే విధమైన ఆచారములు సంప్రదాయములు కలిగియుండినవారే; ఒకే విజ్ఞానమును గౌరవించినవారే. ఇన్ని సంబంధము లుండినను తామందరు కలసి ఒక ప్రత్యేక రాజ్యమును స్థాపించుకొనవలయుననియు, పరాయివారెవ్వరు తమపై పరిపాలకులుగ నుండరాదనియు వారు భావించినవారు కారు. ఇటాలియన్‌లు గ్రీకులు తదితరులు కూడ ఇట్టి స్థితియందే యుండిరి. ఇట్టి భావము వీరిలో లేని కారణమున పందొమ్మిదవ శతాబ్దమునకు పూర్వము రాజకీయముగ వీరు "జాతి" అను పేరున కర్తలు గాకుండిరి. పందొమ్మిదవ శతాబ్దమందుండి ఇట్టి భావము వీరిలోపుట్టి వృద్ధిగాంచెను. దాని ఫలితముగ వారు "జాతు" లైరి. జాతిభావము వారియందు ప్రబలమగుటచేత వారు ప్రత్యేక రాజ్యములను స్థాపించుకొనుటయే ధర్మమని, అందుకై సమస్త ప్రయత్నముల గావించిరి. ఈ ప్రయత్నములకే జాతీయోద్యమమని పేరు.

ఇట్టి జాతీయభావము లేనికాలమున రాజ్యాకాంక్షగల రాజులు వారికి ఇష్టమువచ్చినవారిని జయించి, గొప్ప సామ్రాజ్యములను స్థాపించుట పరిపాటిగ నుండెను. వారట్లు చేయుట ధర్మవిరుద్ధమను భావము వ్యాపించి యుండలేదు.

ఇతర రాజులతో యుద్ధముల గావించియు, భేరమాడియు, సంబంధ బాంధవ్యముల కల్పించుకొనియు, తమ రాజ్యములను వృద్ధిజేసికొనుట సహజమని రాజులు ప్రజలు భావించుచుండిరి. ఫ్రెంచి విప్లవమునాటికి యూరపుఖండమందీ కారణముచేత సామ్రాజ్యము లనేకము లేర్పడియుండెను. టర్కీ సామ్రాజ్యము నేలుచుండిన సుల్తానులు గ్రీకులను, బల్గేరియనులను, రుమేనియనులను తదితర ప్రజలను పాలించుచుండిరి. ఆస్ట్రియా సామ్రాజ్యములో జర్మనులు, జెక్కులు, హంగేరియనులు, పోలులు ఉండిరి. రష్యా సామ్రాజ్యమున పోలులు, ఫిన్నులు, లాట్వియనులు మొదలగు వివిధ ప్రజలుండిరి. ఒకదేశమునకు సంబంధించిన రాజు మఱియొక దేశమును జయించి పాలించుట సర్వసాధారణముగ నుండెను. పందొమ్మిదవ శతాబ్దములో నిది మారి జాతీయ రాజ్యములు స్థాపింపబడెను.

జాతీయభావము వృద్ధిగాంచుట కనేక కారణములుండెను. చాలవరకు ఫ్రెంచి విప్లవము మూలమున దానికి ప్రాబల్యము కలిగెను. గొప్పవిప్లవము నొకదానిని తాము లేవదీసి, ఇతర యూరోపియనులు సాధింపని స్వాతంత్ర్యమును, సమత్వమును, సోదరభావమును తాము సాధింపగలిగిరను గర్వము ఫ్రెంచివారిలో నుదయించి, తా మొక ప్రత్యేకజాతియను భావము వారిలో వృద్ధిగాంచెను. ఈ ఐక్యభావము మూలమున వారు వారి శత్రువుల నోడించి విప్లవఫలితములను నిలబెట్టుకొనుటయేగాక ఇరుగు పొరుగునందుండిన దేశముల కొన్నిటిని జయించిరి. ఈ భావము

నాధారముజేసికొని నెపోలియన్ ఫ్రెంచిసైన్యముల సహాయముతో యూరపుఖండములో చాలభాగమును తనపరిపాలనములోనికి తెచ్చుకొనగలిగెను. అతని పరిపాలనము మూలమున జర్మనులకు, ఇటాలియన్లకు, స్పెయిన్ పోర్చుగల్ మొదలగు దేశములవారికి కొంతలాభము కలిగినను దానితోపాటు కొంత నష్టముకూడ సంభవించెను. ఫ్రెంచివారిలో జాతీయభావము వృద్ధిగాంచియుండుటచేత వారు తమ్మును జయింపగలిగిరనియు, తమలో అట్టిభావము లేనికారణమున తాము ఫ్రెంచివారికి లోబడి అనేక నష్టములను పొందవలసి వచ్చినదనియు, తాముకూడ ఫ్రెంచివారివలె జాతీయభావముతో ప్రవర్తించినయెడల వారి అధికారమును నాశనము జేసి స్వతంత్రులు కావచ్చుననియు జర్మనులు మొదలగువారు భావింపసాగిరి. అట్టిభావమును బలపరచుటకై ఆయాదేశముల నేలుచుండిన రాజులు, ప్రజానాయకులు పాటుపడిరి. ఆ భావము నాధారముచేసికొని వారు నెపోలియన్‌ను ఓడింపగలిగిరి. కనుక క్రీ. శ. 1815 నాటికి జాతీయభావము యూరోపియన్ ప్రజలలో వ్యాపించెను. ఒకజాతివారిని మరియొక జాతివారు పాలించుట ధర్మవిరుద్ధమనియు, ఒకేజాతికి సంబంధించిన వారందరు భిన్నప్రభుత్వములకు గాక తామేర్పరచుకొనిన జాతీయప్రభుత్వమొకదానికి లోబడియుండుట ధర్మమనియు వారు విశ్వసించినవారైరి.

నెపోలియన్ ఓడిపోయిన తర్వాత విజేతలగు రాజ్యముల ప్రతినిధులందరు వియన్నా నగరములో సమావేశమై (1815) వారికి తోచినట్లు క్రొత్తఏర్పాటు లనేకములను

గావించిరి. ప్రజలలో జాతీయభావము మొలకెత్తినదనియు, దాని ననుసరించి రాజ్యముల నేర్పరచుట యుక్తమనియు వారు గ్రహించరైరి. అచ్చట సమావేశమైన వారిలో ఆస్ట్రియా, రషియా, ప్రషియా దేశపు పాలకులు, నిరంకుశులైన సామ్రాజ్యాధిపతులు. జాతీయభావము ననుసరించి రాజ్యముల హద్దుల నేర్పరచుట వారికి నష్టము కలిగించు విధానము. అందుచేత వారు దాని కంగీకరింపరైరి. నెపోలియనును ఓడించుటలో ఇంగ్లండు ప్రధానపాత్రను ధరించెను. అందుచేత ఇంగ్లండునకా సమావేశములో ఎక్కువ పలుకుబడియుండెను. కాని జాతీయసూత్రము ననుసరించి రాజ్యముల నేర్పరచవలయునని ఇంగ్లీషువారు పట్టుబట్టినవారు కారు. ఫ్రెంచివారిమూలమున యూరపుఖండమునకు మరెన్నడు ప్రమాదము రాకుండజేయుటయు, ఖండాంతరముల లోని దేశములను సాధ్యమైనంతవరకు తమ పరిపాలనము లోనికి తెచ్చుకొని తమ సామ్రాజ్యమును వృద్ధిజేసికొనుటయు ఇంగ్లీషువారి ప్రధానోద్దేశములయ్యెను. అందుచేత జాతీయరాజ్యముల సంస్థాపనము వియన్నా సమావేశమున జరుగలేదు. అగ్రరాజ్యములగు రషియా, ప్రషియా, ఆస్ట్రియా, ఇంగ్లండులు వారివారి లాభము నుద్దేశించి ఇతర దేశములను పంచుకొనిరి.

ఈ పంపకము ప్రజలలో క్రొత్తగ రేకులెత్తిన జాతీయభావమునకు విరుద్ధముగ నుండెను. దీనిని రద్దుచేసి, జాతీయ రాజ్యములను స్థాపించుటకు వివిధదేశములలోని ప్రజానాయకులు దీక్ష వహించిరి. ఫ్రెంచి విప్లవము మూల

మున విప్లవభావము ఖండమునంతట వ్యాపించెను. ప్రభుత్వ ములపై తిరుగుబాటుచేసి తమ యుద్దేశముల సాధించుకొను టలో అధర్మమేమియు లేదనుభావము ప్రజలలో నాటు కొనెను. కనుక క్రీ. శె. 1815 మొదలు యూరపుఖండపు దేశములలో నొక్కొకదానియందు విప్లవపక్ష మొకటియు విప్లవవిరోధ పక్ష మొకటియు ఏర్పడెను. సామ్రాజ్యముల నేలుచుండిన రషియా చక్రవర్తియు, ఆస్ట్రియా చక్రవర్తియు నిరంకుశత్వమును విడనాడుట కిష్టములేని స్పెయిన్, పోర్చు గల్, ప్రషియా, నేపిల్సు మొదలగు రాజ్యముల నేలు చుండిన రాజులును విప్లవవిరోధి పక్షమునకు నాయకులైరి. భూస్వాములు, చర్చి అధికారులుకూడ ఆ పక్షమందేయుండిరి. సైనిక బలమంతయు వారి వశమందుండెను. కాని మధ్యవర్గ మునకు చెందిన వర్తకులు, పారిశ్రామికులు, విద్యాధికులలో ననేకులు, సామాన్య జనములో చాలమంది విప్లవ పక్షము నకు చెందినవారైరి. ఈ రెండు పక్షములవారికి సంఘర్షణ తప్పదయ్యెను. సైనికబలము తమకు లేదని విప్లవపక్షము వారు నిరుత్సాహపడక రహస్యముగ కుట్రలుజేసియు, రహస్యసంఘముల స్థాపించియు, జాతీయభావము మరింత బల పడుటకు ప్రజలలో ప్రచారము గావించియు, విప్లవశక్తులను వృద్ధిచేసిరి. జాతీయోద్యమము ననుసరించి రాజ్యము లేర్ప డినయెడల నెక్కువనష్టము ఆస్ట్రియాసామ్రాజ్య మనుభవింప వలసియుండుటచేత దానికి ప్రధానమంత్రియైన మెటర్నిక్ (Metternich)) క్రీ. శె. 1815 మొదలు క్రీ. శె. 1848 వరకు విప్లవోద్యమముల నణచుటయందు నాయకత్వము వహిం

చెను. రషియా చక్రవర్తి, ప్రషియారాజు, తక్కిన నిరంకుశరాజులు అతని కీ కార్యమున తోడ్పడిరి.

వియన్నా పరిష్కారమును రద్దుచేయుటకై విప్లవకారులు క్రీ. వె. 1820-23 లో మొదటి ప్రయత్నము గావించిరి. కాని మెటర్నిక్ యొక్క ప్రాబల్యమున నది భగ్నమయ్యెను. తర్వాత క్రీ. వె. 1830-32 లో వారు రెండవ పర్యాయ మట్టి ప్రయత్నము గావించిరి. ఈ విప్లవము ప్యారిస్ నగరములో క్రీ. వె. 1830 న ప్రారంభమయ్యెను. విప్లవకారులు రాజును సింహాసన భ్రష్టునిగ జేసిరి. క్రమక్రమముగ నీ విప్లవము తక్కిన రాజ్యములలోనికి వ్యాపించెను. కాని బెల్జియం దేశ మొక్కదానియందే ఇది విజయవంతమయ్యెను. అదివరకు డచ్చివారితో కలసియుండిన బెల్జియం దీని ఫలితముగ ప్రత్యేక స్వతంత్ర రాజ్యమయ్యెను. పోలులుకూడ స్వరాజ్యమును సంపాదించుటకై రషియా చక్రవర్తిపై తిరుగుబాటు జేసిరిగాని వారి ప్రయత్నము కూడ విఫలమయ్యెను. ఆస్ట్రియా అధికారమును తొలగద్రోసి స్వాతంత్ర్యమును సంపాదించుటకు ఇటలీవారు చేసిన ప్రయత్నము కూడ భగ్నమయ్యెను.

క్రీ. వె. 1848-49 లో విప్లవోద్యమ మతి తీవ్రరూపమును ధరించెను. మరియొకమారు దీనికి ప్యారిస్ పట్టణము కేంద్రమయ్యెను. విప్లవకారులు ఫ్రెంచిరాజును తొలగించి ప్రజాస్వామ్యమును (Republic) నెలకొల్పిరి. దీని మూలమున నితర దేశములలోని విప్లవకారుల యుత్సాహ మధికమయ్యెను. నిరంకుశమునకు కేంద్రమైన వియన్నా నగర

ములో కూడ విప్లవము తప్పదయ్యెను. సుమారు నలుబది సంవత్సరములుగ నేకచ్ఛత్రాధిపత్యము వహించియుండిన మెటర్నిక్ పదభ్రష్టుడై మారువేషము వేసికొని ఇంగ్లండునకు పారిపోయెను. ఆస్ట్రియా పాలనలో తర తరములుగ క్రుగ్గు చున్న జెక్కులు, హంగేరియన్లు, ఇటాలియన్లు తిరుగుబాటు చేసి స్వాతంత్ర్యమును ప్రకటించిరి. జర్మనీలో చిన్న చిన్న సంస్థానములందు కూడ నిట్టి తిరుగుబాటులు జరిగెను. కాని క్రమ క్రమముగ విప్లవ విరోధులగు రాజులు, భూస్వాములు, సామంతులు వారి వారి సైనికబలముల నుపయోగించి తిరుగుబాటుదారుల నోడించి స్వాధికారమును స్థాపించుకొనిరి.

క్రీ. వె. 1848 తర్వాత జాతీయోద్యమ మందొక నూతన లక్షణము పొడగట్టెను. రాజులు కొందరు దానికి దోహదమియ్య నిశ్చయించిరి. అందుచేత నది జర్మనీ, ఇటలీ దేశములలో సాఫల్యముగాంచెను. క్రీ. వె. 1848 లో ప్యారిస్ నగరమున జరిగిన విప్లవము మూలమున ఫ్రాన్సు దేశమున ప్రజాస్వామ్యము స్థాపింపబడెను. క్రొత్త రాజ్యాంగ పద్ధతి ననుసరించి మూడవ నెపోలియన్ (ఇతడు నెపోలియన్ చక్రవర్తి యొక్క సహోదరుని కుమారుడు) అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. కాని రెండు మూడు సంవత్సరములలో నితడు ప్రజాస్వామ్యమును రద్దుజేసి, ప్రజల ఆమోదముతో చక్రవర్తి బిరుదమును వహించి దేశమును పాలింపసాగెను. తనయొక్క పేరు, ప్రతిష్ఠల బలపరచుటకును, దానిమూలమున ఫ్రాన్సుకు కొంతలాభమును సంపాదించుటకును,

జాతియోద్యమ ముపయోగ పడునట్లతనికి తోచుటచేత జాతీయరాజ్యమును స్థాపించుకొనుటకు ఇటాలియన్లు చేయుచుండిన ప్రయత్నమున కితడు తోడ్పడసంకల్పించెను. గమనించతగిన విషయములలో నిది యొకటి.

ఇటలీలో కూడ రాజులలో నొకడగు పియడ్మాంటు రాజు జాతియోద్యమమునకు నాయకుడగుట యీ కాలములో జరిగెను. క్రీ. వె. 1815 లో వియన్నా పరిష్కారము జరిగిన ప్పుడు ఇటలీ తొమ్మిది చిన్న చిన్న రాజ్యములుగ విభాగ మయ్యెను. అందులో రెండు ప్రధానభాగములు విదేశీయు లగు ఆస్ట్రియాచక్రవర్తుల పాలనలోనికివచ్చెను. పియడ్మాంటు రాజ్యమొక్కటే ఇటాలియన్ వంశమువారి చేతిలోనుండెను. తక్కినవి ఆస్ట్రియా రాజవంశముతో సంబంధముగలవారి యొక్కయు, ఆస్ట్రియారాజుతో మిత్రులుగ నుండిన వారి యొక్కయు పాలనలో నుండెను. ఈ రాజ్యములనన్నిటిని కలిపి, ఇటలీనంతయు నొక స్వతంత్ర్య రాజ్యముగ నేర్పరచ వలెనని జాతీయోద్యమ నాయకులు సంకల్పించిరి. క్రీ. వె. 1820, 1830 లో వారు ఆస్ట్రియాపై తిరుగుబాటుచేసిరి కాని లాభము లేదయ్యెను. క్రీ. వె. 1848 లో తిరుగుబాటు జరిగినపుడు పియడ్మాంటురాజు విప్లవపక్షమును వహించి ఆస్ట్రియాతో పోరెను; కాని అతడుకూడ ఓడిపోయెను. అప్పటినుండి జాతీయోద్యమ నాయకులలో నొక మార్పు కలిగెను. ఎన్నటికైనను ఆస్ట్రియావారిని ఓడించుట అవ సరమనియు, వారిని దేశమందుండి తరిమివేసినగాని స్వరాజ్య స్థాపనము జరుగదనియు, వారి నోడించుటలో పియడ్మాంటు

రాజు యొక్క సహాయము నాయకత్వము అవసరమనియు ప్రజలందరు భావించిరి. అదృష్టవశమున పీయడ్మాంటురాజు దానికి సమ్మతించుటయేగాక రాజనీతి యందు నిపుణుడగు కేవూర్ (Cavour) అను ప్రముఖుని ప్రధాన మంత్రిగ జేసికొనెను. అప్పటినుండి వ్యవహారములన్నియు మారసాగెను. పీయడ్మాంటు చిన్నరాజ్య మగుటచేత ఒంటరిగ ఆస్ట్రియాను ఓడించుట సాధ్యముకాదని కేవూరు గ్రహించి, ఇతర రాజ్యముల సహాయమును సంపాదించుటకు సమకట్టి, తుదకు ఫ్రెంచి చక్రవర్తియగు నెపోలియన్ సహాయముతో 1859 లో ఆస్ట్రియా రాజ్యముతో యుద్ధముచేసెను. అందు ఆస్ట్రియా సైన్యము లోడిపోయెను. కాని యుద్ధము పూర్తిగ ముగియుటకు పూర్వమే నెపోలియన్ యుద్ధమునుండి విరమించిన కారణమున, ఇటలీలో కొన్ని రాష్ట్రములు మాత్రమే పీయడ్మాంటు పాలనలోనికి వచ్చెను. ప్రజ లంతమాత్రమున నిరుత్సాహపడిన వారుకారు. క్రీ. శ. 1860 లో గారిబాల్డి అను సేనాని చిన్న సైన్య మొకదానిని సమకూర్చుకొని సిసిలీద్వీపమును దక్షిణ ఇటలీని జయించి పీయడ్మాంటు రాజ్యములో దానిని కలిపెను. ఈ విధముగ ఇటలీరాజ్యమేర్పడి రోం పట్టణము దానికి ప్రధాన నగరమయ్యెను. పీయడ్మాంటురాజు ఇటలీ రాజ్యమునకు రాజయ్యెను. క్రీ. శ. 1861 తర్వాత ఒక రాష్ట్రము మాత్రమే ఆస్ట్రియావారి వశమందును, రోం పట్టణపరిసరములు కొన్ని పోపు పరిపాలనమందును ఉండెను. క్రీ. శ. 1866 లో ప్రషియా, ఆస్ట్రియాలకు యుద్ధము సంభవించినప్పుడు ఇటలీరాజు ప్రషియాకు

మిత్రుడై ఆస్ట్రియా సైన్యముల నోడించి వారి పాలనములో నుండిన రాష్ట్రమును కూడ వశపరచుకొనెను. పోపు పాలన మందుండిన రాష్ట్రమును నెపోలియన్ యొక్క ఫ్రెంచి సైన్యములు రక్షించుచుండి నందున దానిని వశపరచుకొనుట సులభము కాదయ్యెను. కాని క్రీ. వె. 1870 లో నెపోలియన్ ప్రషియా రాజ్యముతో యుద్ధము చేయవలసినవాడై పోపును రక్షించుట మానుకొనెను. అప్పుడు పోపు పాలనలోని రాష్ట్రములుకూడ ఇటలీ రాజుయొక్క పాలనలోనికి వచ్చెను. ఈ విధముగ క్రీ. వె. 1871 నాటికి జాతీయోద్యమము సఫలమై వేయి సంవత్సరములుగ ననేక ఖండములుగ విభాగమై యుండిన ఇటలీదేశ మంతయు నొకే కేంద్రప్రభుత్వ పరిపాలనములోనికి రాగలిగెను.

నెపోలియన్ యొక్కయు పియడ్మంటు రాజుల యొక్కయు సహాయమున ఇటలీ జాతీయరాజ్యముగ నేర్పడి నట్లు, ప్రషియారాజుల నాయకత్వమున జర్మనీ దేశమంతయు ఒకే జాతీయ రాజ్యముగ నేర్పడెను. ఫ్రెంచివిప్లవకాలము నాటికి జర్మనీలో సుమారు మూడువందల స్వతంత్ర సంస్థానములుండెను. పేరునకు దేశమున కంతకు పవిత్రమైన రోమన్ చక్రవర్తి (Holy Roman Emperor) అను బిరుదుతో నొక చక్రవర్తి యుండెను. కొన్ని తరములుగ ఆస్ట్రియారాజ్యము నేలుచుండిన రాజులే ఆ బిరుదును వహించి యుండిరి; కాని అతనికెట్టి అధికారము లేదయ్యెను. మూడువందల సంస్థానములును కలిపి ఒకే జాతీయరాజ్యమును స్థాపించుట ఎవరితరము కాదను అభిప్రాయము అంద

రిలో వ్యాపించి యుండెను. అట్టి తరుణములో నెపోలియన్ చక్రవర్తి జర్మనీని జయించి సంస్థానము లనేకములను రద్దుజేసి పవిత్ర రోమన్ చక్రవర్తిత్వమునుకూడ రూపుమాపెను. క్రీ. శ. 1815 లో వియన్నా సభయందు సమావేశమైన అగ్ర రాజ్య ప్రతినిధుల మార్పులను గుర్తించిన కారణమున దేశములోని సంస్థానములసంఖ్య ముప్పదిఎనిమిదికి తగ్గెను. అప్పటికి ప్రజలలో జాతీయభావము దృఢముగ నాటుకొనెను. అట్టి భావము తమలో లేకపోవుటచేత పరాయివాడగు నెపోలియన్ తమ దేశమును జయింపగలిగెనని ప్రజలందరు తలంచిరి. కవులు, గ్రంథకర్తలు, తత్వవేత్తలు ప్రజలలో దేశాభిమానమును మరింత బలపరచిరి. కాని సంస్థానాధీశులలో నిట్టి భావము శూన్యముగ నుండెను. దేశమున కంతకు నొక ప్రభుత్వ మేర్పడినయెడల తమ స్వాతంత్ర్యము తొలగునని వారు భయపడిరి. ఇదిగాక జర్మనీలో నాయకత్వమునకు ప్రషియా, ఆస్ట్రియా రాజ్యములు పోటీచేయుచుండెను. కనుక ప్రజలలో జాతీయభావ ముండినను, జాతీయరాజ్య సంస్థాపనమునకై వారు 1830 లోను, 1848 లోను రాజులపై తిరుగుబాటు చేసినను వారి ప్రయత్నము సఫలము కాకపోయెను. క్రీ. శ. 1861 లో విలియం అనునతడు ప్రషియాకు రాజయ్యెను. ఆస్ట్రియాను జర్మనీనుండి తొలగించి తన నాయకత్వమున జర్మనీని జాతీయరాజ్యముగ మార్చుటకితడు దృఢనిశ్చయు డయ్యెను. ఈ యుద్యమములో బిస్మార్క్ (**Bismark**) అను ప్రముఖు డితనికి ప్రధానమంత్రి యయ్యెను. ఆస్ట్రియా రాజులుకూడ జర్మనులే; ఆస్ట్రియా రాజ్యములోని

ప్రజలుకూడ జర్మనులే, కాని ఆస్ట్రియారాజు జర్మనులుకాని వారత్యధికముగనుండు బొహిమియా, హంగేరి, ఇటలీ మొదలగు దేశములకుకూడ చక్రవర్తిగ నుండెను. ప్రషియా రాజు అట్లుగాక జర్మన్ లొక్కరికే పరిపాలకుడుగ నుండెను. ఆ కారణముచేత ప్రజలతని నాయకత్వము ననుసరించుటకు సిద్ధులైరి. దీనికితోడు బిస్మార్కు గొప్ప సైన్యములను సమకూర్చి ప్రషియాకు శత్రువులుగ నున్నవారందరిని యుద్ధములలో నోడించుటకు నిశ్చయించుకొనెను. మంచిమాటలతోగాని, బేరముల మూలమునగాని ఆస్ట్రియావంటి శత్రువులను వశపరచుకొనుట వ్యర్థప్రయాస అని అతడు నమ్మినవాడు. సైన్యములన్నియు సమకూరినతర్వాత నతడు క్రీ. వె. 1864 లో డెన్మార్కు రాజ్యముతో యుద్ధముచేసి అందదివరకు కలసియుండిన జర్మన్ రాష్ట్రములను ప్రషియాలో చేర్చెను. తర్వాత క్రీ. వె. 1866 లో నతడు ఆస్ట్రియాను ఓడించి, జర్మనీనుండి ఆస్ట్రియారాజు తొలగిపోవునట్లుగావించి ఆ యుద్ధములో ఆస్ట్రియాకు సహాయముచేసిన జర్మన్ సంస్థానములను ప్రషియారాజ్యములో కలిపి, ఉత్తర జర్మనీలోని తక్కిన సంస్థానముల నన్నిటిని ఒక సమాఖ్యగ నేర్పరచెను. వందలకొలది సంవత్సరములుగ నైకమత్యమేమియో ఎరుగని జర్మనీ ప్రషియా నాయకత్వమున నిట్లు కలసిపోవుట ఫ్రెంచి వారికిని, వారికి చక్రవర్తిగ నుండిన నెపోలియన్‌కును ఇష్టము లేదయ్యెను. క్రీ. వె. 1870 నాటికి దక్షిణ జర్మనీలోని రాజ్యములు ప్రషియాతో కలియుటయా, మానుటయా అన్న సందేహములో నుండెను. అట్టి సమయములో ప్రషియా

ఫ్రాన్సుదేశములకు యుద్ధము సంభవించెను. అప్పుడు దక్షిణ జర్మనీరాజ్యములుకూడ ప్రషియాపక్షమవలంబించెను. యుద్ధములో ఫ్రెంచివారు పూర్తిగ నోడిపోయిరి. యుద్ధకాలమున కలసిన జర్మనీ రాజ్యములన్నియు శాశ్వతముగ కలసియుండుట కంగీకరించెను. దాని ఫలితముగ క్రీ. శ. 1871 లో జర్మనీ అంతయు ఒకే పరిపాలనములోనికి వచ్చెను. జాతీయరాజ్య మీ విధముగ స్థాపింపబడి దానికి ప్రషియారాజు చక్రవర్తి అయ్యెను.

క్రీ. శ. 1815 తర్వాత జాతీయోద్యమ ప్రాబల్యము మూలమున ఏర్పడిన జాతీయరాజ్యములు బెల్జియం, ఇటలీ, జర్మనీలు మాత్రమేకావు. ఇట్టి రాజ్యములు ఆగ్నేయ యూరపునందు కూడ కొన్ని ఏర్పడెను. ఆగ్నేయ యూరపు పదునైదవ శతాబ్దమున టర్కీసుల్తానుల పాలనలోనికి వచ్చెను. వారు తక్కిన యూరోపియన్ దేశముల జయించు నుద్దేశముతో హంగేరీ, ఆస్ట్రియా మొదలగు వానిపై బడిరిగాని వారి ప్రయత్నములు సఫలములు కాకపోవుటయేగాక క్రీ. శ. 1683 నుండి వారి అధికారము క్రమక్రమముగ క్షీణింప దొడగెను. సుల్తానులు భోగపరాయణులైరి. ప్రజలను పీడించి వసూలుచేసిన ద్రవ్యమును విలాసములకై ఖర్చు పెట్టుచు సైన్యములను నౌకాబలమును వృద్ధిచేయుటకు వారు వెనుదీసిరి. వారికి పొరుగున నుండిన రషియా చక్రవర్తులు టర్కీకి ప్రధాన పట్టణమైన కాన్‌స్టాంటినోపిల్‌పై చాలా కాలమునుండి కన్నువేసియుండిరి. టర్కీయొక్క బలహీనతను వారు గమనించి అందులో చేరిన క్రిమియా మొదలగు

రాష్ట్రములను జయించిరి. టర్కీ సుల్తానులు; మహమ్మదీయులు, వారి పాలనములో నుండిన గ్రీకులు, బల్గేరియన్లు మొదలగు యూరోపియన్లు, క్రైస్తవులు, ఫ్రెంచి విప్లవానంతరము వీరుకూడ జాతీయభావము కలవారై సుల్తానులపై తిరుగబడిరి. పరిస్థితు లనుకూలించిన కారణమున వారి తిరుగుబాటు కొంతవరకు సఫలమై క్రమక్రమముగ అనేక స్వంతరాజ్యములు స్థాపింపబడెను. క్రీ. శ. 1830 లో సర్వియారాజ్యము, క్రీ. శ. 1821–31 మధ్యన గ్రీసు రాజ్యము, క్రీ. శ. 1861 లో రుమేనియా రాజ్యము, క్రీ. శ. 1878 లో బల్గేరియా రాజ్యము ఏర్పడెను. ఇవి అన్నియు జాతీయోద్యమ ఫలితముగ నేర్పడిన రాజ్యములే. వీని మూలమున టర్కీ సామ్రాజ్యము చాలవరకు విచ్ఛిన్నమయ్యెను.

జాతీయోద్యమ ప్రభావము అమెరికా ఖండమందు కూడ పందొమ్మిదవ శతాబ్దమున కనుపించెను. క్రీ. శ. 1500 నుండి స్పెయిన్ పోర్చుగల్ సామ్రాజ్యములలో చేరియుండిన మధ్య అమెరికా, దక్షిణ అమెరికాలలోని రాష్ట్రములన్నియు స్వతంత్ర రాజ్యములయ్యెను. యునైటెడ్ స్టేట్సు అధ్యక్షుడు క్రీ. శ. 1823 లో మనో్రి సిద్ధాంతమును ప్రకటించి వీని స్వాతంత్ర్యమును రక్షించినవాడయ్యెను.

పందొమ్మిదవ శతాబ్దపు మధ్యభాగమున యునైటెడ్ స్టేట్సు రెండు ప్రత్యేక రాజ్యములుగ విడిపోవు సూచనలు కనుపించెను. క్రీ. శ. 1783 లో స్వాతంత్ర్యమును సంపా

దించి, క్రీ. వె. 1787 లో క్రొత్త రాజ్యాంగ విధానమును నిర్మించుకొని ఒకే కేంద్రప్రభుత్వమునకు లోబడి యుండుటకంగీకరించిన పదమూడు రాష్ట్రములలో ఉత్తర రాష్ట్రములకును దక్షిణ రాష్ట్రములకును మధ్య ద్వేషమేర్పడెను. దక్షిణ రాష్ట్రములలో నీగ్రోజాతికి చెందిన బానిసలచేత వ్యవసాయము మొదలైన వానిని చేయించుచు తెల్లవారు కాలక్షేపము చేయుచుండిరి. ఉత్తర రాష్ట్రములలో బానిసలు లేరు. అన్ని పనులను తెల్లవారే చేయుచుండువారు. ఇదిగాక కొంతకాలమునకు ఉత్తర రాష్ట్రములలో పరిశ్రమ లనేకములు నెలకొనెను. దక్షిణరాష్ట్రములలోని వారికి వ్యవసాయమే ప్రధానవృత్తిగ నుండెను. దీని మూలమున కూడ ఉత్తర, దక్షిణములకు మనఃస్పర్ధలు కలిగెను. దేశమున బానిస లుండరాదనియు వారికి విమోచనము కలిగించి స్వతంత్రుల చేయవలెననియు, ఉత్తర రాష్ట్రములవారు పట్టుబట్టిరి. తమ వ్యవసాయమునకు, ఆర్థిక జీవితమునకు బానిసలే ఆధారమనియు, వారి విమోచనము మూలమున తాము దరిద్రులగుట తప్పదనియు, దాస్యమునుండి వారిని తొలగించుటకు తామెన్నటికి నంగీకరించువారు కారనియు దక్షిణరాష్ట్రములవారు నొక్కిచెప్పిరి. కొసకు దక్షిణ రాష్ట్రములవారు ఉత్తర రాష్ట్రములనుండి విడిపోయి ప్రత్యేక రాజ్యముగ నేర్పడి తమ స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనుటకు యునైటెడ్ స్టేట్సు ప్రభుత్వముతో యుద్ధమునకు దిగిరి. యునైటెడ్ స్టేట్సు ఒక జాతీయ రాజ్యముగ నుండుటయా లేక రెండు రాజ్యములుగ విడిపోవుటయా అను గడ్డుసమస్య బయలుదేరెను. ఈ విధముగ 1861–65

మధ్యన జరిగిన అంతర్యుద్ధములో యునైటెడ్ స్టేట్సునకు అధ్యక్షుడుగ నుండి జాతీయ ఏకత్వమును నిలబెట్టుటకు బద్ధకంకణుడైన ఆబ్రహాంలింకన్ దక్షిణ సైన్యముల నోడించి, బానిసల విముక్తుల జేసి, ఏకత్వమును స్థిరపరచెను. ఈ అంతర్యుద్ధము యునైటెడ్ స్టేట్సు చరిత్రలో నొక ప్రధాన ఘట్టము. అది మొదలు ప్రజ లందరిలో జాతీయభావము దృఢపడి యునైటెడ్ స్టేట్సు కాలక్రమమున నగ్రరాజ్యములలో బలిష్ఠమైన దయ్యెను.

మొదటి ప్రపంచ యుద్ధము (1914–19) తర్వాత జాతీయోద్యమము మరింత సఫలవంత మయ్యెను. జర్మనీ సామ్రాజ్యము, ఆస్ట్రియా సామ్రాజ్యము, రష్యా సామ్రాజ్యము చితికిపోవుటచేత పోలెండు, జెకోస్లోవేకియా, యూగోస్లేవియా, హంగేరి, ఫిన్లాండు, ఎస్తోనియా, లాట్వియా మొదలైన జాతీయరాజ్యములు యూరపుఖండమునం దేర్పడెను. టర్కీ సామ్రాజ్యము విచ్ఛిన్నమగుటచేత ఇరాక్, సిరియా, లెబనన్ మొదలగు రాజ్యములు పశ్చిమ ఆశియాలో ఏర్పడెను. ఆశియాఖండపు తక్కిన దేశములలో కూడ నిది మొదలీ యుద్యమము మరింత ప్రబలమయ్యెను.

పందొమ్మిదవ శతాబ్దమున జాతీయోద్యమముతో బాటు ప్రజాస్వామ్య ఉద్యమముకూడ వృద్ధిగాంచెను. దేశమునుపాలించు అధికారము నిరంకుశులగు రాజుల చేతులలో గాక ప్రజలచేతులలో నుండవలెనను వాదము విప్లవ యుగమున ప్రారంభ మయ్యెను. స్టూవర్టురాజుల నిరంకుశత్వమును తొలగించి పరిపాలనాధికారమును పార్లమెంటు పరము

చేసిన ఇంగ్లీషువారి యుద్యమమునకు పునాదులు వేసిరి. ఇంగ్లీషు పార్లమెంటుయొక్క అధికారమును తొలగించి స్వరాజ్యమును సంపాదించుకొనిన అమెరికావారు ప్రజా స్వామ్య సిద్ధాంతము ననుసరించి వారి రాజ్యాంగము నిర్మించు కొనిరి. ఫ్రెంచి విప్లవకారులు కూడ రాజులతో అవసరములేని రాజ్యాంగమును నిర్మించి ప్రజా ప్రతినిధులుగల శాసనసభకు సర్వాధికారము నొసంగిరి. నెపోలియన్ చక్రవర్తి నిరంకుశ రాజత్వమును పునరుద్ధరించెను గాని అతని యనంతరమది స్థిరపడుటకు తగిన అవకాశము లేదయ్యెను. క్రీ. శ. 1815 మొదలు క్రీ. శ. 1871 వరకు నిరంకుశ వాదులకును ప్రజా స్వామ్య వాదులకును ఘర్షణలనేకములు జరిగెను. తుదకు క్రీ. శ. 1871 లో ఫ్రెంచివారు ప్రజాస్వామ్యమునే అను సరించిరి. అప్పటినుండి ఇప్పటివరకు ఫ్రాన్సులో అట్టి ప్రభుత్వమే జరుగుచున్నది.

సంపూర్ణ ప్రజాస్వామ్యమునకు కొన్ని ప్రధాన లక్ష ణము లుండవలెనని విప్లవవాదులు భావించిరి. వారి దృష్టిలో అధికారమున కంతకు ప్రజలే మూలము. ప్రజలెన్నుకొనిన ప్రతినిధులతోకూడిన శాసనసభ చట్టముల నిర్మించవలెను. ప్రజలుగాని ప్రజాప్రతినిధి సభగాని ఎన్నుకొనినవారు మంత్రులై రాజకీయ వ్యవహారములను పరిష్కరించవలెను. అధికారమందుండు శాసనసభవారుగాని మంత్రివర్గమువారు గాని వారి అధికారమును దుర్వినియోగము చేయకుండుటకై రాజ్యాంగ ప్రణాళిక లిఖితరూపమును ధరించవలెను. అందు అధికారు లెట్టిపనులను చేయవచ్చునో ఎట్టి పనులను చేయు

రాదో, ఎట్టి నియమములకు వారు బద్ధులుగ నుండవలెనో లిఖింపబడవలెను. ఇట్టి ప్రధాన సూత్రములతో పందొమ్మిదవ శతాబ్దమున ప్రజాస్వామ్యము వృద్ధిగాంచెను.

క్రీ. వె. 1688 లో ఇంగ్లండునం దధికారములోనికి వచ్చిన పార్లమెంటులో భూస్వాము లెన్నుకొన్న ప్రతినిధు లుండిరి. తక్కిన ప్రజలకు ప్రతినిధుల నెన్నుకొను హక్కుగాని, ప్రతినిధులుగ నెన్నుకొనబడు హక్కుగాని లేకుండెను. యంత్రయుగము ప్రారంభమైనతర్వాత పరిశ్రమలను స్థాపించి ధనమును సంపాదించిన మధ్యవర్గమువారి ఆందోళన ఫలితముగ క్రీ. వె. 1832 నుండి ఎన్నికలకు సంబంధించిన మార్పు లనేకములు జరిగెను. ఫ్యాక్టరీలలో పనిచేయు కార్మికులు కూడ తమ స్థితిగతులను చక్కబెట్టుకొనుటకు ఎన్నికహక్కు తమకుకూడ నుండవలెనని వాదింప సాగిరి. కొంతకాలమునకు పల్లెటూళ్ళలోని వ్యవసాయ కూలీలుకూడ అట్టి ఆందోళనను లేవదీసిరి. మరి కొంతకాలమునకు స్త్రీలలో అట్టి చైతన్యము కలిగెను. అందుచేత నప్పుడప్పుడు అనేక సంస్కరణములు కావింపబడి క్రీ. వె. 1928 నాటికి ఇంగ్లండులో వయోజనులగు స్త్రీ పురుషు లందరికీ ఎన్నిక హక్కు లభించెను. ఆ కారణముచేత ప్రజలందరు ఎన్నుకొనిన సభ్యులుగల పార్లమెంటు సర్వస్వామ్యము కలదై దేశ పరిపాలనమును సాగించుచున్నది.

యూరపుఖండపు ఇతరదేశము లన్నిటిలోకూడ నీ యుద్యమము బలపడెను. ఇటలీ, జర్మనీ మొదలగు దేశము

లలో రాజులుండినను వారి అధికారము నియమ బద్ధమయ్యెను. ప్రజాప్రతినిధులుగల శాసనసభలు వానియందు కూడ నేర్పడి పరిపాలనాధికారమును వహించెను. రషియా దేశమందుమాత్రమే నిరంకుశరాజత్వము చెదరకుండెను. దక్షిణ అమెరికాలో స్వతంత్రమును సంపాదించిన రాజ్యము లన్నిటిలో ప్రజాస్వామ్య సంస్థలు స్థాపింపబడెను. బ్రిటిష్ సామ్రాజ్యములో తెల్లవారు నివసించు కనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు, దక్షిణఆఫ్రికా మొదలగు వలసరాష్ట్రములలో ప్రజాస్వామ్యము స్థిరరూపము దాల్చెను. ప్రజాస్వామ్య వ్యాప్తికిని యంత్రములద్వారా పరిశ్రమలనడుపు విధానము నకును దగ్గరసంబంధము కలదు. పరిశ్రమాభివృద్ధి గాంచిన దేశములందే ప్రజాస్వామ్యమున కెక్కువ అవకాశము కలిగెను. ఆదేశములందే రాజకీయాందోళనమం దాసక్తి గల మధ్యవర్గమువారు ముందుకు వచ్చిరి. ఫ్యాక్టరీలు బయలు దేరుటవలననే సామాన్య వర్గములో చేరిన కార్మికులలో చైతన్యము వృద్ధి గాంచెను. ఫ్యాక్టరీలలో పనిచేసి, ఆర్థిక స్వాతంత్ర్యమును సంపాదించిన కారణముననే స్త్రీలుకూడ రాజకీయములందు ఆసక్తిగలవారైరి.

## కారుణ్యోద్యమము

పదునెనిమిదవ శతాబ్దపు ఆఖరు భాగమునను, పందొమ్మిదవ శతాబ్దమందును పాశ్చాత్య ప్రపంచమున కారుణ్యోద్యమము (Humanitarianism) కూడ మిక్కిలి ప్రాబల్యము గాంచెను. కష్టము లనుభవించుచుండువారి కష్టములను

నివారించి వారు సుఖపడుటకు కావలసిన సదుపాయముల కల్పించుటయే కారుణ్యము. అట్టిపనులను చేయుటయందుత్సాహమును, దీక్షను చూపినవా రనేకు లీకాలమున నుండిరి. వారి కృషి ఫలితముగ బానిసలకు విమోచనము కలిగెను. పదునెనిమిదవ శతాబ్దమునకు పూర్వము నేరము చేసినవారి కతికఠినములైన శిక్షలను విధించువారు. వారు చేసిన నేరముయొక్క స్వభావమునకును, వా రనుభవించు శిక్షకును ఎట్టి సంబంధము లేకుండెను. ఇంగ్లండులో సుమారు రెండువందల నేరములకు ఉరిశిక్షను విధించుట మామూలుగ నుండెను. నేరస్థులగు స్త్రీలను కూడ కొరడా దెబ్బలు కొట్టుట సర్వసామాన్యముగ నుండెను. కారుణ్యోద్యమము మూలమున నిట్టి క్రూరశిక్ష లంతరించెను. తుదకు కొన్ని దేశములలో హత్యచేసినవారికి కూడ ఉరిశిక్ష వేయుట మాని ద్వీపాంతరవాసశిక్షను విధించుచున్నారు. అప్పులు చెల్లించలేని వారికి కారాగృహశిక్ష మామూలుగ నుండెను. అనేక దేశములలో నిది కూడ రద్దుచేయబడెను. ఇదిగాక కారాగృహములలో బంధింపబడు ఖైదీల విషయములోకూడ అనేక సంస్కరణములు కావింపబడెను. అనవసరముగ వారిని బాధింపరాదనియు, అవమానపరచరాదనియు, వారికి కూడ కడుపు నిండ ఆహార ముండవలెననియు, వారి ఆరోగ్యము కూడ కాపాడతగినదనియు, బంధితకాలములో వారి ప్రవర్తనము బాగుపడుట కనుకూలించు విద్యలను వారికి నేర్పవలయుననియు, అన్ని దేశముల ప్రభుత్వమువారు తలచుట మామూలయ్యెను. జైళ్ళకు సంబంధించిన ఇట్టి సంస్కరణములన్నియు

కారుణ్యోద్యమ ఫలితము లే. ఫ్యాక్టరీలలో పనిచేయు కార్మికులు, స్త్రీలు, పిల్లలు మొదలగువారు యంత్రయుగ ప్రారంభ కాలమున ననుభవించు చుండిన కష్టములను తొలగించుట కనేక చట్టములు చేయబడెను. పిచ్చిబట్టిన వారికి ప్రత్యేక వైద్యశాలలను నిర్మించి వారు బాగుపడుటకు కావలసిన ఏర్పాటు లనేకములు జరుగుచున్నవి. దారిద్ర్యము విమోచనమునకు రోగనివారణమునకును ధనికులు పరిపాలకులు కోట్ల కొలది ద్రవ్యమును ఖర్చుపెట్టుట మామూలయ్యెను. మానవులందరు సుఖమనుభవించుటకు తగిన వారనియు, అనవసరముగ నొక్కడు కూడ బాధపడరాదనియు, కష్టపడు వారి కష్టములను నివారించుబాధ్యతను సంఘమంతయు వహించుట ధర్మమనియు ఇప్పటివారు భావించుట కీ కారుణ్యోద్యమమే ప్రధానకారణము. పురుషులతో బాటు స్త్రీలు కూడ సర్వసుఖములను పొందుటకును, సర్వస్వాతంత్ర్యముల ననుభవించుటకును అర్హులన్న భావము కూడ దీని ఫలమే.

# 10

## ఆధునిక విజ్ఞానము



ఆధునికయుగ ప్రారంభమందుండి యూరపుఖండవాసులనేక విషయములం దపూర్వమైన ప్రజ్ఞను చూపిరి. దాని ఫలితముగ వారు భూగోళ పరిశోధనము గావించిరి. మంత్ర తంత్రములందు మూఢవిశ్వాసమును మాని ప్రయోగములను, స్వానుభవములను ఆధారము జేసికొని ప్రకృతి రహస్యముల కనుగొని ప్రకృతిలోని అమానుష శక్తులగు ఆవిరిశక్తి, విద్యుచ్ఛక్తి, అణుశక్తి మొదలగు శక్తులను వశపరచుకొనిరి. ఇంకను వశపరచుకొనుటకు మహాప్రయత్నములచేయుచున్నారు. పరిశోధనము మూలమునను, ప్రకృతి శక్తుల వశపరచుకొనుట మూలమునను ఇహలోకమందెక్కువ సుఖము ననుభవించుటకు కలిగిన అవకాశములను వినియోగించుకొనుటయందు దీక్షాపరులై, అట్టి యవకాశములకు నిరోధము కలిగించు పూర్వకాలపు ఆచారములను,

ఆర్థిక విధానములను, రాజ్యాంగపద్ధతులను మార్చుకొను టయందపరిమిత ఉత్సాహమును చూపిరి. అవసరమైన పుడు విప్లవముల లేవదీయుటకును, రక్తపాతము గావించుట కును వారు సంసిద్ధులైరి. భయముగాని, జంకుగాని లేక, అతి సాహసముతో వారు ఖండాంతరములకు వెళ్ళి తమ అధి కారమును పలుకుబడిని స్థాపించుకొన్న వారైరి. అమెరికా ఖండము, ఆస్ట్రేలియా, న్యూజీలెండు, ఉత్తర ఆశియా వారికి సొంతమై, వారి విజ్ఞానము నాగరికత జీవిత విధానము మొదలగు వానికి నిలయములయ్యెను. ఇంతటి ప్రాబల్యమును వారు సంపాదించుటకు యుద్ధవిద్య యందును, నూతన యుద్ధ పరికరములను నిర్మించుటయందును వారికిగల ప్రజ్ఞయొక్కటే ప్రధానగారణముకాదు. వారి పరిశోధనాసక్తి, కార్యదీక్ష, సాహసము, స్వాతంత్ర్య ప్రియత్వము, జ్ఞానసంపాదనమందు వారికుండు ఉత్సాహము — ఇవి అన్నియు వారి ప్రజ్ఞకు మూలాధారములు. నడివయస్సునందుండు యువకులలో కనుపించు లక్షణములు వారి యందున్నవి. వారితో సరిపోల్చి చూచినయెడల అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు, ఉత్తర ఆశియాలలోనివారు శైశవదశ యందుండిన వారని చెప్పవలసి వచ్చును. ఆఫ్రికా ఖండములోనివారు అతి బాల్యదశలో నున్నట్లు అగుపడును. ఆశియాఖండములోని వారు యవ్వనమును కోల్పోయి వార్ధక్యము ననుభవించు చుండు వారనుకొనవచ్చును. ఆ కారణముచేతనే యువకు లగు యూరపుఖండమువారు శైశవదశయందుండు వారిని చాల వరకు నిర్మూలము గావించి వారి అధీనమందుండిన ఖండము

లను ఆక్రమించు కొనగలిగిరి. బాల్యదశలోని ఆఫ్రికా ఖండమునకు కూడ చాలవర కిట్టిగతియే పట్టెను. వార్ధక్య మందున్న ఆశియావారు కూడ వారి దెబ్బకు తాళలేని వారైరి.

ఉత్తరదక్షిణ అమెరికాలను ఆస్ట్రేలియా, న్యూజీలెండు, ఉత్తర ఆశియాలను వారు సునాయాసముగా నెట్లు సంపాదించిరో ఇదివరకే వివరింపబడెను. ఆశియా ఖండములోని ఆగ్నేయభాగమును డచ్చివారు పదునేడవ శతాబ్దమున వశపరచుకొనుటయు, దక్షిణభాగమందున్న ఇండియాను ఇంగ్లీషువారు వశపరచుకొనుటయు ఇండోచైనాను ఫ్రెంచివారు వశపరచుకొనుటయు పదునెనిమిది పందొమ్మిది శతాబ్దములలో జరిగెను. మరికొన్ని ప్రదేశములలోకూడ వారి ప్రాబల్యము క్రమక్రమముగ వ్యాపించెను. పందొమ్మిదవ శతాబ్దపు ఆఖరుభాగమున ఆఫ్రికా ఖండమంతయు వారి పాలనలోనికి వచ్చెను. వారి ప్రాబల్యమునుండి తప్పించు కొనగలిగిన ఆశియాఖండపు దేశము జపాన్ మాత్రమే. చైనాదేశములోను, మధ్యప్రాచ్యములోని పర్షియా, టర్కీ సామ్రాజ్యము మొదలగువానిలోకూడ పందొమ్మిదవ శతాబ్దమున కొంతవరకు వారికి ప్రాబల్యము కలిగెను.

ఆఫ్రికా ఖండమందును, ఆశియాలోని దేశములందును తమ ప్రాబల్యమును స్థాపించుటకు క్రీ. వె. 1870 తర్వాత యూరోపియనులు మరింత పట్టుదలతో ప్రయత్నించుటకు కొన్ని కారణము లేర్పడెను. అప్పటికి యంత్రయుగప్రభా

వమున ఇంగ్లండునందేగాక ఫ్రాన్సు, బెల్జియం, జర్మనీ, ఇటలీ మొదలగు దేశములందుకూడ భారీపరిశ్రమ లనేకములు నెల కొనెను. ఇవి చక్కగ జరుగుటకు కావలసిన పత్తి, రబ్బరు, తగరము, చమురు మొదలగు ముడిపదార్థము లనేకములు ఆఫ్రికా ఆశియాఖండములందేగాని యూరపుఖండమున లభించునవి కావు. కనుక వానిని సంపాదించుటకై యూరోపియనులు ఈ ఖండములలోని దేశముల వశపరచుకొనుటకు నిశ్చయించుకొనిరి. ఇదిగాక ఈ దేశములలో దొరకు తేయాకు, కాఫీ, కోకో, పొగాకు మొదలగు పదార్థముల యందు యూరోపియన్లకీ కాలమున రుచి అధికమయ్యెను. దీనికితోడు వారి భారీపరిశ్రమలలో తయారగుచుండిన వస్త్రములు, లోహపదార్థములు మొదలగువానిని అమ్మి లాభము సంపాదించుటకు వారికి క్రొత్తదేశము లవసరము లయ్యెను. ఇన్ని ఆర్థిక కారణముల మూలమున వారు వారి దృష్టిని ఆఫ్రికా ఆశియా ఖండములవైపు ఎక్కువగ మరలింపవలసిన వారైరి.

రాజకీయముగకూడ యూరపుఖండపు పరిస్థితులు క్రీ. శ. 1870 తర్వాత ఇట్టి ప్రాబల్య వ్యాప్తికి ఆవశ్యకము కలిగించెను. అప్పటికి జాతీయోద్యమముయొక్క తీవ్రత కొంతవరకు తగ్గెను. క్రొత్తగ జాతీయ రాజ్యములుగ నేర్పడిన జర్మనీ, ఇటలీవారుకూడ ఇంగ్లీషువారివలె గొప్ప సామ్రాజ్యముల స్థాపించుకొనుటకు నిశ్చయించుకొనిరి. ప్రత్యేకముగ తమకు వలసరాష్ట్రములు లేనికారణమున తమ పౌరులనేకులు—జర్మనులు, ఇటాలియనులు—యునైటెడ్ స్టేట్సు

మొదలగు దేశములకు వెళ్ళి అచ్చట తమస్థితిగతులను బాగు చేసికొనుటకై స్థిర నివాసముల నేర్పరచుకొని అమెరికను లలో కలసిపోవు చున్నారనియు, తమకు ఖండాంతరములందు సామ్రాజ్యము లున్నయెడల నట్టివారా సామ్రాజ్యములో కాపురము చేయుచు మాతృదేశమునకు బలము కూర్చువా రగుదురనియు జర్మనీ, ఇటలీ దేశములలో క్రొత్తగ నేర్పడిన జాతీయప్రభుత్వములవా రభిప్రాయపడిరి. ఖండాంతరము లందు సామ్రాజ్యమున్నయెడల నక్కడి ప్రజలకు సైనికవిద్య నేర్పి, అట్టివారి సాధనమున తమ సైన్యముల బలపరచుకొని, తమకు గర్భశత్రువులుగనుండు జర్మనులను సులభముగ నోడింపవచ్చునని జనసంఖ్య తగ్గిపోవుచుండిన ఫ్రాన్సుదేశపు ప్రభుత్వమువా రూహించిరి. ఇందరు పోటీకి దిగినపుడు తా మూరకుండుట నష్టకరమన్న భావముతో ఇంగ్లీషువారు కూడ తమ కదివరకుండిన సామ్రాజ్యముతో తృప్తిపడక మరింత సామ్రాజ్యమును సంపాదించుటకు నిశ్చయించుకొనిరి.

ఆఫ్రికాఖండము యూరపున కతి సమీపమం దుండి నను, దానిని చుట్టి ప్రయాణముచేసినగాని ఇండియాకును ఆశియాలోని దూర ప్రాచ్యదేశములకును వచ్చుటకు వీలు లేకుండినను, ఈ దేశములతో వ్యాపారముచేసి వానియందు సామ్రాజ్యముల సంపాదించిన పోర్చుగీసువారు డచ్చివారు ఇంగ్లీషువారు ఆ ఖండములోపలనుండిన ప్రదేశములను పందొమ్మిదవ శతాబ్దపు ఆఖరుభాగమువరకు వశపరచుకొన నుద్దేశించినవారు కారు. దాని సముద్రతీరమందుండిన కొన్ని రేవు పట్టణములను మాత్రమే వారు స్వాధీనపరచుకొని వాని

మూలమున బానిసవ్యాపారమును సాగించుచుండిరి. ఖండపు లోపలి ప్రదేశములనుగురించిగాని, అచ్చటి ప్రజల గురించి గాని ఏమియు తెలియనికారణమున దానికి ''చీకటిఖండము''ను పేరు సార్థకమయ్యెను. పదునెనిమిదవ శతాబ్దపు చివర భాగమున ఇంగ్లీషు పరిశోధకులు తదితర పరిశోధకులం కొందరు నైజరు, నైలు, జాంబెసి, కాంగో మొదలగు నదీ ముఖములనుండి బయలుదేరి. వానితీరమందున్న ప్రదేశము లందు ప్రయాణముచేసి, కొంతవరకు ప్రజలయొక్కయు వారు నివసించు ప్రదేశము యొక్కయు పరిస్థితు లను వివరించిరి. అట్టి పరిశోధకులలో మంగోపార్కు, డేవిడ్ లివింగ్‌స్టన్, స్టాన్‌లి, అనువారు సుప్రసిద్ధులు. ఖండముయొక్క ఉత్తరతీరమందును, తూర్పు పశ్చిమ తీరము లలో కొంత దూరమువరకును మహమ్మదీయమత మవలం బించినవారుండిరి. తక్కిన భాగములలోనివారు మిక్కిలి అనాగరికులు. వారి నందరిని క్రైస్తవ మతములోనికి చేర్చు ఉద్దేశముతో మత ప్రచారకులచటికివచ్చి చేరిరి. వారిలో ననేకులు వస్త్రములుకూడ ధరింపక తిరుగుచుండిరి. బట్టలు కట్టుకొనుటకు వారికి నేర్పినయెడల నేటేట కోట్లకొలది గజ ముల బట్టను వారికమ్మి అపరిమితలాభమును సంపాదింప వచ్చునని యూరోపియన్ పారిశ్రామికులు వర్తకులు వచ్చిరి. ఇదిగాక ఆ ప్రదేశములలో రబ్బరు, ఏనుగుదంతములు, నూనె, కోకో, ఆటవిక పదార్థములు విపరీతముగ నుండెను. తమ పరిశ్రమలను సాగించుట కివి మిక్కిలి యుపయోగించునని మరికొందరు పారిశ్రామికు లూహించిరి. ఇన్ని సందర్భములు

కలియుటచేత క్రీ. వె. 1870 తర్వాత యూరపు ఖండమువారు ఆఫ్రికా లోపలికి చొచ్చుకొనిపోయి ఖండమునంతను తమ కిష్టమువచ్చినట్లు పంచుకొనిరి.

ఈ పంపకములో బెల్జియం రాజ్యమునకు పదిలక్షల చదరపు మైళ్ళ విస్తీర్ణము గలిగిన కాంగోరాష్ట్రము లభించెను. దయా దాక్షిణ్యములేక నచటి అనాగరిక జాతులవారిచేత రాత్రింబగళ్లు పనిచేయించి, పనిచేయనివారిని చిత్రవధ గావించి బెల్జియంరాజు బెల్జియం వర్తకులు కోట్లకొలది లాభమును సంపాదించిరి. జర్మనీవారు చదువన్న నేమియో తెలియని అనాగరిక రాజులతో నొడంబడికలను జేసికొని, వారిచేత ఒడంబడిక పత్రములలో వేలుముద్రలను వేయించి, నైర్‌ృతి ఆఫ్రికా, తూర్పు ఆఫ్రికా, కామెరూన్స్, టోగో, మొదలగు రాష్ట్రములను వశపరచుకొనిరి. వీని వైశాల్యముకూడ సుమారు పదిలక్షల చదరపు మైళ్లు. ఇదేవిధముగ ఇటలీదేశపువారు ఎఱ్ఱసముద్ర తీరమందుండు ఎరిత్రియా రాష్ట్రమును, సోమాలిలాండును వశపరచుకొని, అబిసీనియా రాజ్యమును జయింపగోరి, ఆ ప్రయత్నములో యుద్ధమందు క్రీ. వె. 1896 లో ఓడిపోయిరి. కాని 1911—12 లో వారు టర్కీ సైన్యముల నోడించి, అదివరకు టర్కీ పాలనలోనుండిన లిబియాను జయించిరి. ఫ్రెంచి వారింతకంటె విశాలమగు దేశమును స్వాధీనపరచుకొనగలిగిరి. పదునెనిమిదవ శతాబ్దమందే వారు మడగాస్కర ద్వీపమును వశపరచుకొనియుండిరి. పందొమ్మిదవ శతాబ్దములో వారు ఆల్జీరియా, ట్యూనిస్ రాష్ట్రములను పూర్తిగ జయించిరి.

అటుతర్వాత మొరాక్కోలో చాలభాగమునకును, సెనిగల్, అప్పర్ నైజీరియా, గినీ తీర ప్రదేశము మొదలగువానికి పరిపాలకులైరి. సహారా ఎడారి అంతయు వారి సామ్రాజ్యములోనిదే. తక్కిన భాగములలోని రాష్ట్రము లనేకములను— పశ్చిమ ఆఫ్రికాలోని గంబియా, సిరాలియోన్, గోల్డుకోస్టు, నైజీరియా, తూర్పు ఆఫ్రికా, దక్షిణ ఆఫ్రికా, రోడీషియా, ఈజిప్టు మొదలగువానిని—ఇంగ్లీషువారు వశపరచుకొనిరి. ఇరువదియవ శతాబ్దము ప్రారంభమగునాటికి లైబీరియా, అబిసీనియా అనునవిమాత్రమే ఖండమందు స్వతంత్రరాజ్యములుగ నుండెను. తక్కిన ప్రదేశమంతయు యూరోపియన్ల పాలనలోనికి వచ్చెను.

ఆఫ్రికాను యూరోపియన్‌లు పంచుకొనిన విధానమును గురించి రెండు మూడు విశేషములు గమనించ దగియున్నవి. (1) ఈ పంపకమంతయు ఇరువది ముప్పది సంవత్సరములలో పూర్తి అయ్యెను. ఆఫ్రికా ఖండమున నివసించు నీగ్రోజాతులలోను ఇతర జాతులలోను ధైర్యసాహసములతో యుద్ధము చేయగలవారు లేకపోలేదు. కాని వారి రాజ్యములు మిక్కిలి చిన్నవి. వారి ఆయుధములు రాతి యుగమునాటివి. అట్టివారు యూరోపియన్‌ల నెదిరించుట సాధ్యముకాని పని. కనుక ఖండమును వశపరచుకొన దలచిన క్షణముననే యూరోపియన్ల కది వశమయ్యెను. (2) కొన్ని ప్రదేశములను వశపరచుకొనుటకు మాత్రము యుద్ధము లవసరమయ్యెను. ఈ యుద్ధములు కూడ అనాగరిక ప్రజలతో జరిగినవి కావు. సామ్రాజ్యమునకై పోటీచేయు

చుండిన యూరోపియన్ల మధ్య జరిగినవి కొన్ని; మరికొన్ని నాగరికతగాంచిన ఈజప్టు రాజులతోడను, టర్కీ సుల్తానుల తోడను జరిగినవి. పందొమ్మిదవ శతాబ్దపు ప్రథమ భాగము వరకు ఈజిప్టుదేశము టర్కీ సుల్తానుల పాలనలో నుండెను. క్రీ. వె. 1806 లో మహమ్మదాలీ అను గవర్నరు స్వతంత్ర పాలనను స్థాపించెను. క్రీ. వె. 1863 మొదలు క్రీ. వె. 1879 వరకు పాలించిన అతని మనుమడు ఇస్మేల్ పాశ్చాత్య నాగరికతను తన రాజ్యములో ప్రవేశపెట్ట సంకల్పించి పాఠ శాలలను, రైళ్లను, నౌకాశ్రయములను, నౌకలను నిర్మించి, సూయజ్ కాలువను కూడ త్రవ్వించెను. కాని వీనికి కావల సిన కోట్లకొలది ద్రవ్యము నతడధికమైన వడ్డీలకు ఇంగ్లీషు, ఫ్రెంచి సాహుకార్ల వద్దనుండి అప్పుదీసెను. అప్పటికికూడ నతని చిక్కులు తీరినవికావు. అందుచేత సూయజ్ కాలువ వాటాల నతడు ఇంగ్లీషు ప్రభుత్వమునకు విక్రయించెను. కాని క్రమక్రమముగ నతని కష్టము లధికమయ్యెను. అప్పు లను తీర్చుటకు తగిన స్థితిలోనికి నతడెన్నడు రా జాలడను అనుమానముతో ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు కలిసి, అధికా రమునుండి అతనిని తొలగించి మరియొకనిని పరిపాలకునిగ జేసి, అనేక సంస్కరణముల గావింపసాగిరి. అప్పుడు ఈజిప్టులోనివారు కొందరు తిరుగుబాటు చేసిరి. దానిని అణచుటలో ఫ్రెంచివారు ఇంగ్లీషువారికి సహాయపడని కార ణమున ఇంగ్లీషువా రొక్కరే దాని నణచి క్రీ. వె. 1882 లో తమ అధికారము నాదేశముపై స్థాపించిరి. కాలక్రమమున వారు ఈజిప్టునుండి దక్షిణదిక్కున వెళ్లి ప్రత్తిపంటకు

మిక్కిలి అనుకూలించిన సుడాన్ రాష్ట్రమును జయించి వశ పరచుకొనిరి.

ఈజిప్టు జయించుటకు యుద్ధము కొంత అవసర మయ్యెను. దక్షిణ ఆఫ్రికాను జయించుట కింతకంటె గొప్ప యుద్ధమును ఇంగ్లీషువారు చేయవలసినవారైరి. అచ్చట డచ్చివారు పదునేడవ శతాబ్దమున వలసల నేర్ప రచుకొనిరి. వానిని నెపోలియన్‌తో చేసిన యుద్ధముల సంద ర్భమున ఇంగ్లీషువారు వశపరచుకొనిరి. అందుపై అచట కాపురముండిన డచ్చివారనేకులు (వీరికి బోయర్లు అను పేరు) ఉత్తరముగను తూర్పుగను వెళ్ళి ట్రాన్స్వాల్, ఆరెంజిఫ్రీ స్టేటుఅను రాజ్యముల రెంటిని ఏర్పరచుకొనిరి. కొంతకాల మునకిందు వజ్రపుగనులు బంగారుగనులు బయల్పడెను. ఇంగ్లీషు పరిశ్రామికు లనేకు లచటికి వెళ్ళి లాభమును సంపా దింప దొడగిరి. కాని వారికిని, ఆ రాజ్యములను పాలించు బోయర్లకును మనస్పర్థలు కలిగి తుదకు యుద్ధము తప్ప దయ్యెను. క్రీ. శ. 1899 మొదలు క్రీ. శ. 1901 వరకు ఇంగ్లీషువారీ బోయరు యుద్ధమును సాగించి, బోయర్ల నోడించి, వారి రెండురాజ్యములను వశపఱచుకొనిరి. ఆఫ్రికాఖండమును స్వాధీనపరచుకొనుటలో నిట్టి యుద్ధములు కొన్ని జరిగినను మొత్తముమీద యుద్ధము లవసరము లేకయే యూరోపియన్లు ఖండమునకంతకు పాలకులైరి.

యూరోపియనుల పాలనము మూలమున ఆఫ్రికా వాసులు క్రైస్తవులైరి. అనేక ప్రదేశములలో రైళ్ళు, మోటారుకార్లుకూడ నడుచుటకు తగినరోడ్లు, టెలిగ్రాఫ్

తంతులు మొదలగు పాశ్చాత్య నాగరికతా చిహ్నములు నిర్మాణము కావింపబడెను. అరణ్యామయములైన ప్రదేశము లనేకములు వ్యవసాయ యోగ్యము లయ్యెను. అచ్చటచ్చట కొన్ని పట్టణములుకూడ నేర్పడెను. యూరోపియన్ దుస్తుల ధరించుట, వారి అలవాటుల ననుకరించుట, వారి భాషను మాటలాడుట—ఈ లక్షణములుకూడ నచ్చటచ్చట కనుపించుచున్నవి. అనాగరిక జాతులమధ్య నదివరకు జరుగుచుండిన యుద్ధములు, దోపిడులు ఇప్పుడు జరుగుట లేదు. క్రౌర్యముతో కూడిన ప్రాచీన ఆచారము లనేకము లడుగంటెను. కాని వీని యన్నిటిమూలమున ఆఫ్రికా ఖండవాసులు సుఖపడినట్లు భావించుటకు వీలులేదు. సారవంతములగు భూములను యూరోపియన్ యజమానులు పశపరచుకొనిరి. ఆఫ్రికనులచేత శక్తికిమించి పనిచేయించిన కారణమున వారిలో ననేకులు అకాలమృత్యువు ననుభవింపవలసిన వారైరి. కొన్నిజాతులవారు పూర్తిగ నశించిరి. యూరోపియన్ నాగరికతతో త్రాగుడు మొదలగు దురభ్యాసములుకూడ ప్రవేశించెను. క్రొత్త రోగములుకూడ ఖండమందు వ్యాపించుటకిది కారణమయ్యెను. కొన్ని సంవత్సరములనుండి ఆఫ్రికా జాతులలోకూడ రాజకీయ చైతన్యము మొలకలెత్తి వృద్ధిగాంచుచున్నది. వారి జనసంఖ్య పదునాలుగుకోట్లకు మించియున్నది. యూరోపియనులసంఖ్య నలుబదిలక్షలుమాత్రమే. ఇట్టి పరిస్థితులలో ఆఫ్రికా ఖండమందు జాతీయోద్యమము తప్పక వ్యాపించగలదు.

# 11

## "ఆశియాలో" పాశ్చాత్యుల ప్రాబల్యము

ఆశియాఖండమున సామ్రాజ్యముల సంపాదించుటకు యూరోపియన్లు పోటీచేయుట కారంభించిన నాటికా ఖండములో పశ్చిమభాగమున టర్కీ సామ్రాజ్యము, దానికి తూరుగున పర్షియా రాజ్యము, తదుపరి ఇండియాలోని మొగలుసామ్రాజ్యము, చైనా దేశములో మంచూ సామ్రాజ్యము, బర్మా, సయాం, కంబోడియా మొదలగు చిన్న చిన్న రాజ్యములు ఉండెను. అనేక విషయములలో నీ రాజ్యములు పాశ్చాత్య రాజ్యములతో సరిపోల్చ తగినవే. వానిలోని ప్రజలు వ్యవసాయమందును, పరిశ్రమలందును, వర్తక వ్యాపారములందును, విద్యలందును, కళలందును పాశ్చాత్యులతో సమానులుగ నుండుటయేగాక కొన్ని అంశములలో వారిని మించియుండిరి. కాని ఒక గొప్ప విషయ

ములో యూరోపియన్లకును ఆశియాఖండములోని వారికిని భేదమేర్పడెను. యూరోపియన్లు క్రొత్త పరిశోధనల గావించి, క్రొత్తజ్ఞానమును సంపాదించి, క్రొత్త సాధనముల నిర్మించు కొనుటయం దత్యంత శ్రద్ధగలవారుగ నుండిరి. ఆశియా ఖండవాసులలో అట్టి శ్రద్ధగాని, ఉత్సాహముగాని కనుపించ దయ్యెను. ప్రాచీనులు సంపాదించిపెట్టిన విజ్ఞానముతోడను, వా రేర్పరచిన ఆచార వ్యవహారములతోడను వారు సంతృప్తి చెందియుండిరి. ఆ కారణముచేత యూరోపియన్లతో సరి సమానముగ ప్రవర్తించుటకును, వారితో యుద్ధములు సంభ వించినపుడు తగిన సాధన సంపత్తితో వారి నెదుర్కొను టకును సమర్థులు కాజాలరైరి. యూరోపియన్లు వృద్ధి చంద్రునివలె దినదినాభివృద్ధి గాంచుచుండిరి. ఆశియాఖండ వాసులు క్షీణచంద్రునివలె కళావిహీనులగుచుండిరి. ఇందు చేతనే యూరోపియన్లు వారి ప్రాబల్యమును ఆశియాలో చాలభాగమందు వ్యాపించుకొనగల వారైరి.

రష్యావారు ఉత్తర అశియా, మధ్యఆశియాలను, ఇంగ్లీషువారు ఇండియా, సింహళము, బర్మాదేశములను, డచ్చివారు జావా మొదలగు తూర్పుద్వీపములను జయించిన కాలములో టర్కీ సామ్రాజ్యము, పర్షియా, ఆఫగన్‌స్థానము, చైనా, జపానులు మాత్రమే ఆశియాఖండములో స్వతంత్ర రాజ్యములను పేరునకు తగియుండెను. వీనిలో జపాను తప్ప తక్కిన దేశములుకూడ కాలక్రమమున ప్రత్యక్షముగనో, పరోక్షముగనో యూరోపియన్ల ప్రాబల్యమునకు లోబడ వల సిన స్థితిలోనికి వచ్చెను.

చైనాదేశము విస్తీర్ణమందును జనసంఖ్య యందును గొప్ప దేశములలో నొకటి. అయిదువేల సంవత్సరముల నుండి అవిచ్ఛిన్నముగ చైనాదేశమువారు వారి నాగరికతను నిలబెట్టుకొనిన వారగుటచేత వారికి దానియం దత్యంత గౌరవ మేర్పడెను. విదేశీయుల నుండి తాము నేర్చుకొన వలసిన దేదియు లేదని వారు భావించుట కిదియే కారణము. వారికి కావలసిన వస్తువులన్నియు వారి దేశమందే దొరకు చుండుటచేత నితర దేశములతో వర్తక వ్యాపారముల చేయుట వీరి కవసరము కాకుండెను. అందుచేత వర్తకము నకై వచ్చిన యూరోపియన్లకు వీరెట్టి యవకాశములను కల్పింపరైరి. అంతమాత్రముచేత యూరోపియన్లు నిరుత్సా హులు కాలేదు. యుద్ధము గావించియైనను ఇట్టి వసతులను సంపాదించుటకు ఇంగ్లీషువారు నిశ్చయించుకొని ఇండియా నుండి క్రీ. శ. 1839 లో కోటిరూపాయల విలువగల నల్ల మందును తెచ్చి చైనావారికి విక్రయించుటకు వచ్చిరి. నల్లమందును వాడుట హానికరమగు కారణముచేతను, దానిని కొనిన యెడల దేశములోని వెండి దానికిబదులుగ నియ్య వలసి వచ్చునను కారణముచేతను చైనా ప్రభుత్వమువారీ వ్యాపారమును నిషేధించి ఇంగ్లీషువారు తెచ్చిన నల్లమందును తమవశము చేసికొనిరి. అందుపై ఇంగ్లీషువారు యుద్ధము లోనికి దిగి క్రీ. శ. 1840–42 లో చైనావారి నోడించిరి. అప్పుడు విధిలేక చైనా చక్రవర్తి అయిదు రేవుపట్టణము

లలో యూరోపియన్లు వ్యాపారము చేయుట కంగీకరించి, హాంగ్ కాంగు ద్వీపమును ఇంగ్లీషువారికిచ్చి, యుద్ధమందు వారికి కలిగిన నష్టముకని కొంత పరిహార ద్రవ్యమునుకూడ నొసగెను. ఇంగ్లీషువారి వద్దనుండిన యుద్ధపరికరములుగాని నౌకాబలముగాని చైనావారికి లేకపోవుటయే ఈ అపజయమునకు హేతువు.

కాలక్రమమున ఇతర యూరోపియన్లుకూడ చైనా యెడల నిదేవిధముగ ప్రవర్తింపసాగిరి. ఫ్రెంచివారు, పోర్చుగీసువారు, డచ్చివారు, జర్మనులు, రషియావారు, యునైటెడ్ స్టేట్సువారు పదిసంవత్సరములలో వ్యాపార సౌకర్యములనేకములను సంపాదించిరి. క్రైస్తవ మతబోధకులు దేశములో ప్రవేశించిరి. చైనాదేశములో నివాసముచేయు పాశ్చాత్యులు చైనా చట్టములకు లోబడవలసిన అవసరములేక వారి వారి దేశముల చట్టముల ననుసరించ వచ్చునను హక్కునుకూడ సంపాదించిరి. తమతో సమానముగ నిలబడి యుద్ధముచేయు స్థితిలో చైనావారు లేరన్న విషయము నాధారముజేసికొని క్రీ. శ. 1860 లో రషియావారు ఆ మూడురాష్ట్రముల నపహరించి, వ్లాడివాస్టక్ పట్టణము నచ్చట నిర్మించి, అచ్చటనుండి మంచూరియాలోనికి ప్రవేశించి కుట్రలు చేయుచుండిరి. చైనా చక్రవర్తుల కప్పటివరకు కప్పము చెల్లించుచుండిన బర్మాను ఇంగ్లీషువారును, ఇండో చైనాను ఫ్రెంచివారును లాగివేసిరి. క్రీ. శ. 1887 లో పోర్చుగీసువారుకూడ మకో (Macao) ద్వీపము నాక్రమించిరి. క్రీ. శ. 1894—95 లో యుద్ధముజేసి జపాన్ వారు ఫార్మోసా

Formosa) ద్వీపము నాక్రమించిరి. 1898లో రషియా వారు పోర్టుఆర్థర్ అను గొప్ప రేవుపట్టణముతో కూడిన లియోటంగు (Liaotung) ద్వీపకల్పమును, జర్మనీవారు కియచోను, ఫ్రెంచివారు క్వాంగ్‌చోను హైనాన్‌ద్వీపమును, ఇంగ్లీషువారు వీహైవిక్వాలూన్‌లను జపాన్‌వారు (1910 లో) కొరియాను స్వాధీన పరచుకొనిరి. శవము చుట్టు చేరు గ్రద్దలవలె యూరోపియన్లు జపాన్‌వారు చైనావారి యెడల ప్రవర్తించుచుండిరి. యునైటెడ్ స్టేట్సువారు మాత్రము రాష్ట్రములను సంపాదించుట కిష్టపడక వ్యాపార స్వాతంత్ర్యము విదేశీయులవా రందరికి సమానముగ లభించవలెనను సూత్రమునకు చైనా ప్రభుత్వ మంగీకరించిన చాలునని వాదించి, అట్టిస్వాతంత్ర్య మందరికి లభించునట్లు చేసిరి.

పాశ్చాత్యుల మూలమునను జపాన్‌వారి మూలమునను తమకు కలుగుచుండు అవమానమును నష్టమును సహింపలేని చైనా ప్రముఖులు కొందరు దేశాభిమాన పూరితులై యూరోపియన్ల నోడించుటకు యూరోపియన్ నాగరికతను యుద్ధ సాధనముల నుపయోగించుటతప్ప మార్గాంతరము లేదను నిశ్చయముతో సంస్కరణోద్యమము నొకదానిని లేవదీసిరి. దేశము నాకాలమున పాలించుచుండిన చక్రవర్తి బాల్యమందుండినను, తనపై అధికారము వహించి యుండిన తల్లియొక్క బంధమును వదలించుకొని సంస్కరణోద్యమమునకు సుముఖుడై పాశ్చాత్య పద్ధతుల ననుసరించి విద్యాలయములను, సైన్యమును, పరిపాలన పద్ధతులను పునర్నిర్మాణము చేయ సమకట్టెను. కాని పూర్వాచార

పరాయణులును స్వార్థపరులును అగు ప్రాతకాలపు ఉద్యోగస్థులు అతని కెదురుతిరిగిరి. ఆదేసమయమని అధికారమును గోల్పోయిన చక్రవర్తితల్లి వారితోకలసి సైనికులలో కొందరి సహాయమున చక్రవర్తిని బంధించి స్వాధికారమును స్థాపించి సంస్కరణముల నన్నిటిని రద్దుచేసెను (1898). చైనాయొక్క పతనమున కామె నిరంకుశత్వము అధికార వ్యామోహము ప్రధాన కారణమయ్యెను. పాశ్చాత్య సంస్థలయందు పరమద్వేషముగలవా రామెకు సలహాదారులై తుదకు 1900 లో యూరోపియన్ అధికారులపై తిరుగుబాటుచేసి వారు నివసించుచుండిన ఇండ్లను, వారి చర్చీలను వర్తక శాలలను నాశముచేసి వారిలో కొందరిని చంపిరి. కాని యూరోపియన్ లు అమెరికావారు వారి నెదుర్కొని అతిసులభముగ వారి నోడించి ప్రధాన పట్టణమగు పికింగ్ (Peking) దోచిరి. ఈ బాక్సర్ తిరుగుబాటు (Boxer Rebellion) ముగిసినతర్వాత నష్టపరిహారమునకై చైనా ప్రభుత్వము పాశ్చాత్యులకు నూరుకోట్ల రూపాయల నిచ్చుకొనవలసి వచ్చెను.

దీనిమూలమున రాచమాతకూడ కొన్ని గుణపాఠముల నేర్చుకొని సైన్యమందును విద్యాలయములందును కొన్ని సంస్కరణముల గావించి దేశములో రైళ్ళను, టెలిగ్రాఫును, యంత్రసహాయమున పనిచేయు ఫ్యాక్టరీలను నిర్మించుటకు ప్రారంభించెను. ఆమె క్రీ. శ. 1908 లో చనిపోయెను. బాలచక్రవర్తికూడ అప్పుడే కాలధర్మమొందెను. శైశవ

దశయందుండిన అతని బంధువు సింహాసనము నధిష్ఠించెను. విప్లవము లేవదీసి, తమ దేశములో నూతన పద్ధతులను ప్రవేశపెట్టి పాశ్చాత్యుల అధికారమును నిర్మూలము చేయ సమకట్టినవారు క్రీ. వె. 1910—11 లో సంయాట్ సేన్ నాయకత్వమున విప్లవ మారంభించి చక్రవర్తిని తొలగించి ప్రజాస్వామ్యమును ప్రకటించిరి. కాని అది మొదలు దేశ మందు అధికారమునకై నాయకులమధ్య అంతఃకలహములు ప్రారంభమయ్యెను. తర్వాత మూడు సంవత్సరములకు మొదటి ప్రపంచయుద్ధము బయలుదేరెను. అందు చైనా దేశము మిత్రమండలి పక్షము వహించినను మిత్రమండ లిలో నొకటియగు జపాన్ దేశపు దురాక్రమణకు పాత్ర మయ్యెను. జపాన్ వారి ప్రాబల్యము దేశమందనేక భాగ ములలోవ్యాపించసాగెను. అట్టి పరిస్థితులలో సన్ యాట్ సేన్ చనిపోయెను. అతని శిష్యులలో నొకడగు చియాంగ్ కై షియక్ నాయకత్వమున జాతీయపక్షము కొంత బలమును సంపాదించి స్వాధికారమునకు ప్రాకులాడుచుండిన ఉత్తర చైనాలోని గవర్నరుల నోడించి దేశమునంత నొక పరిపాల నములోనికి తేగలిగెను. కాని అతడుకూడ జపాన్ ప్రాబ ల్యము నెదుర్కొనలేని స్థితిలోనుండెను. తుదకు జపాన్ చైనాదేశమును జయింపనెంచి క్రీ. వె. 1931 లో మంచూరి యాను వశపరచుకొనెను; ఆవిధముగ ప్రారంభమైన యుద్ధము క్రమ క్రమముగ వ్యాపించి తుదకు క్రీ. వె. 1940 లో రెండవ ప్రపంచయుద్ధములో నొక అంతర్భాగమయ్యెను. ఈ విధముగ చైనాదేశము పాశ్చాత్యులయొక్కయు జపాన్

వారియొక్కయు, దెబ్బలకు గురియై తొలికాలపు ఔన్నత్య మును కోల్పోయినట్టిదయ్యెను.

ఆధునిక యుగమున పాశ్చాత్యుల ప్రాబల్యము నెదు ర్కొని సామ్రాజ్య సంపాదనములో వారికికూడ పాఠముల నేర్పిన ప్రాచ్యదేశము జపాన్ ఒక్కటే. ఏదేశములతోటి సంబంధ మున్నయెడల దేశములోని ప్రజల నీతికి భంగము కలుగునను యుద్దేశముతో జపాన్ ప్రభుత్వమువారు క్రీ. వె. 1638 లో యూరోపియన్ లెవ్వరు తమదేశములో నడుగిడరాదని శాసించిరి. అదిమొదలు రెండువందల సంవ త్సరములకాలము జపాన్‌వారికి పాశ్చాత్యులతో ఎట్టి సంప ర్కము లేకుండెను. యూరపుఖండమందు కలిగిన శాస్త్రా భివృద్ధి, పరిశోధన ఫలితములు, యంత్రనిర్మాణము మొద లగునవి వా రెరుగకుండిరి. క్రీ. వె. 1837 లో నీ విషయము లందు గొప్పమార్పు ప్రారంభ మయ్యెను. ఆ సంవత్సర మున ఫిరంగులతో కూడిన యొక యునైటెడ్ స్టేట్సు నౌకా దళము జపానుకు వచ్చెను. అంతకుముందు జపాన్‌వారు పొగయోడలను ఫిరంగులను చూచినవారు కారు. కాని అదృష్టవశాత్తు వా రా నౌకాబలమును తరిమివేయ గలిగిరి. అప్పటినుండి అప్పుడప్పుడు అమెరికన్ నౌకలు జపాన్‌దీవు లకు వచ్చుచుండెను. క్రీ. వె. 1853 లో అమెరికన్ నౌకాధి పతి నాలుగు యుద్ధనౌకలతో దర్శన మిచ్చెను. క్రీ. వె. 1854 లో పది నౌకలతో నతడువచ్చి వ్యాపార సౌకర్య ముల నొసగవలసినదిగ కోరెను. అతని నెదిరించుటకు సాధన సామగ్రి లేనికారణమున జపాన్ చక్రవర్తి అందుల

కియ్యకొనెను. దానినిచూచి ఇంగ్లండు, హాలెండు, రషియా దేశములవారుకూడ సమాన సౌకర్యములను కోరిరి. విధిలేక వారికికూడ నట్టి సౌకర్యము లొసంగవలసి వచ్చెను. వర్తకమునకు వచ్చినవారొక్కొకప్పుడు జపాను ప్రభుత్వముతో పేచీలుబెట్టుకొని యుద్ధముమూలమున వానిని పరిష్కరించు ప్రయత్నములుకూడ చేయుచుండిరి. తమ బలహీనతయే దీనికంతకు కారణమని జపానువారు గ్రహించి పాశ్చాత్యులతో సమానమగు బలమును సంపాదించుటకు నిశ్చయించుకొనిరి. చైనాప్రభుత్వమువారికిని ఈ విషయమందే భేద మేర్పడెను.

అనాదిగ జపానుదేశము చక్రవర్తుల పాలనమందుండినను కొన్ని శతాబ్దములనుండి పరిపాలనాధికారము 'షోగన్' అను బిరుదు వహించిన ప్రధానమంత్రి వశమందుండెను. పాశ్చాత్యులకు వర్తక సౌకర్యముల నిచ్చినవా డితడే. ఇత డిట్లుచేయుట తక్కిన ప్రముఖులుగాని సామాన్య ప్రజలుగాని హర్షించినవారు కారు. తమ జాతిగౌరవమున కది భంగకరమని భావించి వారు అప్పటి ప్రధానమంత్రిని అధికారమునుండి తొలగించి పరిపాలనము నంతను చక్రవర్తి అధీనము గావించిరి. ఈ మార్పు మిక్కిలి ప్రధానమైనదిగ పరిణమించెను. అప్పుడు దేశమును పాలించుచుండినవాడు ముత్సుహిటో చక్రవర్తి (1867–1912). పాశ్చాత్యుల ప్రాబల్యమునకు మూలాధారములైన సైనిక సాధనములను నావిక పరికరములను తక్కిన యంత్రములను సమకూర్పనితడు నిశ్చయించి అందుకై జపానుయువకు లనేకులను

పాశ్చాత్యదేశములకు విద్యాభ్యాసమునకై పంపెను. కుశలు లగు అమెరికన్‌లను మరికొందరు పాశ్చాత్యులను తన రాజ్యమున కాహ్వానించి వారి సలహాసాధనమున గొప్ప సైన్యమును నౌకాబలమును తయారుచేసెను. నూతన విజ్ఞానము ప్రజలలో వ్యాపించుటకై సామాన్య విద్యాలయములను విశ్వవిద్యాలయములను పరిశోధన శాలలను స్థాపించెను. పాశ్చాత్య విధానము ననుసరించి చట్టములను మార్చెను. చంద్రమానము ననుసరించి సంప్రదాయసిద్ధముగ వచ్చుచుండిన పంచాంగమును మాని పాశ్చాత్య పంచాంగమును ప్రవేశపెట్టెను. బ్యాంకీలు, రైళ్లు, రోడ్లు, అధికార భవనములు, ఫ్యాక్టరీలు మొదలగువాని నన్నిటిని పాశ్చాత్య విధానము ననుసరించి నిర్మాణము గావించెను. ఫ్యూడల్ పద్ధతిని రద్దుచేసి ప్రజలలో సమభావమును నెలకొల్పెను. నిర్బంధ సైనిక విధానమును ఏర్పరచెను. ప్రజా ప్రతినిధుల సలహాతో పరిపాలనము జరుగునట్లు క్రొత్త రాజ్యాంగమును సృష్టించెను. దీనిమూలమున జపాన్ పూర్తిగ మారిపోయి బలిష్ఠములగు రాజ్యములలో నొక్కటియను ప్రఖ్యాతిని సంపాదించెను. పరిశ్రమలు వృద్ధి గాంచుటచేతను, వ్యవసాయము నూతన పద్ధతుల ననుసరించి జరుగుటచేతను, ప్రజల ఆరోగ్యము వృద్ధి యగుటకు కావలసిన ఏర్పాటుల నేకములు జరుగుటచేతను, శిశుహత్య మొదలగు ప్రాచీన దురాచారము లంతరించుటచేతను జనసంఖ్య వృద్ధిగాంచ సాగెను.

పాశ్చాత్యుల మూలమున కలుగుచుండిన ప్రమాదము నుండి దేశమును రక్షించుకొనిన తర్వాత పాశ్చాత్యులవలె

గొప్ప సామ్రాజ్యమును సంపాదించుటకు ముత్సుహిటో నిశ్చయించుకొనెను. ఏటేట వృద్ధిగాంచుచున్న జనసంఖ్యను పోషించుట కిట్టి సామ్రాజ్య మవసరమని అతనికి తోచెను. తూర్పు ఆశియానంతను మ్రింగివేయుటకు సంకల్పించిన రష్యాను నిరోధించినగాని జపాన్ యొక్క స్వాతంత్ర్యము స్థిర పడదని అతడును, అతని సలహాదారులందరును భావించిరి. గొప్ప సామ్రాజ్యమును సంపాదించి ఆశియా ఖండముపై నాయకత్వము వహింప ప్రముఖు లనేకు లభిలషించిరి. ఈ యుద్దేశములు కొనసాగుటకై జపాన్ వారు అనేక యుద్ధముల గావించిరి. క్రీ. శ. 1894–95 లో చైనాను ఓడించి కొరియా రాష్ట్రమును ఫార్మోసాద్వీపమును సంపాదించిరి. క్రీ. శ. 1904–1905 లో రష్యావారితో యుద్ధముచేసి, వారి నోడించి మంచూరియానుండి వారిని తరిమివేసి, సకీలియన్ ద్వీపములో దక్షిణ భాగమును, పోర్టుఆర్థరును మరికొన్ని ప్రదేశములను సంపాదించిరి. అంతకుపూర్వము రెండు, మూడు వందల సంవత్సరముల కిటీవల పాశ్చాత్యరాజ్యములను, ప్రాచ్యరాజ్యము లేవియు యుద్ధమున నోడించి యుండ లేదు. అందుచేతనే యుద్ధమందు జపాన్ వారికి లభించిన విజయ మపూర్వమైనదిగ భావింపబడెను. ఇదిగాక రష్యా సామ్రాజ్యముకాదు. అగ్రరాజ్యములలో నొక్కటిగ పరిగణింపబడినది. అట్టి రాజ్యము నోడించిన కారణమున జపాన్ వారి కీర్తి ప్రతిష్టలు వేయిరెట్లు వృద్ధిగాంచెను. ఆశియా ఖండపు ప్రజలందరిలో నిదియొక నూతన చైతన్యమును కలిగించెను. పాశ్చాత్యుల శృంఖలములను త్రెంచి స్వారా

జ్యమును సంపాదించుట సాధ్యమను విశ్వాసము వారిలో మొలకలెత్తెను.

ఈ విధముగ ప్రారంభమైన జపాన్ వారి ప్రాబల్యము క్రమక్రమముగ వృద్ధిగాంచెను. మొదటి ప్రపంచ యుద్ధమున వారు మిత్రమండలి పక్షమును వహించి, చైనాలో నదివరకు జర్మనీవారి వశమందున్న రాష్ట్రములను, పసిఫిక్ మహాసముద్రములో జర్మనీ పరిపాలనమందున్న ద్వీపములను ఆక్రమించుటయేకాక, అదివరకు పాశ్చాత్యుల చేతులలో నుండిన వర్తకవ్యాపారావకాశము లనేకములను తమ హస్తగతముచేసికొనిరి. ప్రపంచ యుద్ధానంతరము సంధి వ్యవహారములను పరిష్కరించుటకై వార్సేల్ పట్టణమున సమావేశమైన విజేతలసభలో ఇంగ్లండు, యునైటెడ్ స్టేట్సు, ఫ్రాన్సు, ఇటలీలతో సమానమగు గౌరవము జపాన్‌కు లభించెను. ప్రపంచములోని అయిదు అగ్రరాజ్యములలో జపాన్ ఒక్కటి అయ్యెను.

మొదటి ప్రపంచ యుద్ధము ముగిసినతర్వాత జపాన్ వారు చైనాపై తమ ప్రాబల్యమును స్థాపించుటకును, తూర్పు ఆశియాయందు పాశ్చాత్యు లెవ్వరు వర్తక వ్యాపారములందు తమతో పోటీ చేయకుండుటకును కావలసిన ఏర్పాటులలో నిమగ్నులైరి. కొంతవరకు పాశ్చాత్యుల మధ్య సంభవించిన పరస్పర వైషమ్యములు వారి కనుకూలించెను. అందుచేత వారు క్రీ. వె. 1931 లో చైనాపై దండెత్తి చైనాలోని రాష్ట్రములన్నిటిలో ప్రకృతి సంపదకు ప్రఖ్యాతి

గాంచిన మంచూరియాను వశపరచుకొనెను. చైనాప్రభుత్వము జపాను నెదిరించుటకు సామర్థ్యము లేనిదయ్యెను. నానాజాతిసమితివారు చైనా కెట్టి సహాయము చేయరైరి. అమెరికావారు మంచూరియా ఆక్రమణ ధర్మవిరుద్ధమని ఆక్షేపించిరేగాని దానికెట్టి ప్రతిక్రియ చేయుటకు సిద్ధపడినవారు కాకపోయిరి. అందుచేత జపాన్ వారు నిరాటంకముగ వారి యుద్యమమును సాగించి, చైనాలోని తూర్పుతీర రాష్ట్రములను వశపరచుకొను నుద్దేశముతో యుద్ధ మారంభించి క్రీ. శ. 1940 నాటికి చాలభాగమును వశపరచుకొనిరి.

అటు తర్వాత వారు అమెరికాతోడను, ఇంగ్లండుతోడను రెండవ ప్రపంచ యుద్ధమును ప్రారంభించి మొట్ట మొదట విజయముల ననేకములను సంపాదించి తూర్పు ఆశియా యందంతట తమ సామ్రాజ్యమును స్థాపింపగలిగినను తుదకు యుద్ధమందోడి సామ్రాజ్యము నేగాక స్వాతంత్ర్యమును కూడ కోల్పోయిరి.

ఆశియా ఖండమున యునైటెడ్ స్టేట్సుకూడ పందొమ్మిదవ శతాబ్దపు ఆఖరుభాగమున కొంత సామ్రాజ్యమును సంపాదించెను. తూర్పు ఆశియాతీరమున కావల పసిఫిక్ సముద్రములో ఫిలిప్పైన్ ద్వీపములున్నవి. పదునారవ శతాబ్దమున స్పెయిన్ పరిశోధకుడగు మెగల్లాన్ (Magellan) వీనిని కనుగొనిన కారణమున నప్పటినుండి వీనిని స్పెయిన్ రాజులు పాలించుచుండిరి. స్పెయిన్ వారు అక్కడి ప్రజలను క్రైస్తవ మతములోనికి మార్చిరి.

పందొమ్మిదవ శతాబ్దమున ప్రజలలో కొందరు యూరపునకు వెళ్ళి అచ్చటి విద్యలనేర్చుకొని పాశ్చాత్య పద్ధతులను తమ దేశములో ప్రవేశపెట్టుటకు ప్రయత్నించిరి గాని స్పెయిన్ అధికారులు వారి కడ్డు తగిలిరి. అందుచేత ప్రజలలో అతృప్తి అధికమై అప్పుడప్పుడు ప్రభుత్వమువారిపై తిరుగుబాటులు సంభవించుచుండెను. క్రీ. వె. 1898 లో స్పెయిన్ వారికిని యునైటెడ్ స్టేట్సువారికిని యుద్ధముజరిగెను. అందులో యునైటెడ్ స్టేట్సు వారు ఫిలిప్పైన్ ద్వీపములపై దండెత్తి వచ్చి స్పెయిన్ వారి నోడించి, ఆ ద్వీపములను వశపరచుకొనిరి. అది మొదలు రెండవ ప్రపంచ యుద్ధము ముగియు వరకు ఆ ద్వీపములు యునైటెడ్ స్టేట్సు పరిపాలనములో నుండెను. అటుతర్వాత యునైటెడ్ స్టేట్సువారు వారి పరిపాలనాధికారమును విరమించుకొని ఆ ద్వీపములకు స్వాతంత్ర్యము నిచ్చిరి.

మధ్యప్రాచ్య దేశములగురించి గమనింపవలసిన విశేషము లనేకములులేవు. రషియావారి సామ్రాజ్యము మధ్య ఆశియాలో వృద్ధిగాంచుచుండిన కారణమున ఆఫ్గన్ స్థానము కూడ వారి పాలనములోనికివచ్చి, దాని మూలమున ఇండియాలోని తమ యధికారమునకు ప్రమాదము కలుగునన్న భయము ఇంగ్లీషువారికి కలిగెను. ఇదేవిధముగ పర్షియాను కూడ రషియావారు మ్రింగివేయుదురను అనుమానముకూడ వారిని బాధించదొడగెను. కాని జర్మనీవారి సామ్రాజ్యోద్యమమును ప్రతిఘటించు సందర్భములో ఇంగ్లీషు వారును రషియావారును కలిసి పనిచేయవలసిన పరిస్థితు

లేర్పడుటచేత ఆఫ్గనిస్థానము పర్షియాలగురించి వారు కొన్ని ఒడంబడికలు చేసికొని క్రీ. శ. 1907 నాటి కొకవిధమైన రాజీకి వచ్చిరి. ఆఫ్గనిస్థానముతోగాని టిబెట్‌తోగాని తాము జోక్యము కలిగించుకొనకుండుటకు రషియావా రంగీకరించిరి. పర్షియా విషయములో ఉత్తరభాగము రషియావారి పలుకుబడిలోనికిని దక్షిణభాగము ఇంగ్లీషువారి పలుకుబడిలోనికిని వచ్చునట్లు ఉభయపక్షములవారు నిర్ణయించుకొనిరి. ఈ నిర్ణయము లేవియు పర్షియారాజుల అంగీకారములో జరిగినవికావు. ఇంగ్లీషువారినిగాని రషియా వారినిగాని ఎదిరించు స్థితిలో వారుండ లేదు. ఆశియా ఖండములోని దేశముల చేతగాని తనమున కిదియొక దృష్టాంతము.

ఆగ్నేయ యూరపునందు బయలుదేరిన జాతీయోద్యమము మూలమున నప్పటి టర్కీ సామ్రాజ్యము విచ్ఛిన్న మగుచుండెను. కాని టర్కీవారు పశ్చిమ ఆశియాలోని దేశము లనేకములకు పాలకులుగనుండిరి. సిరియా, పాలెస్టైన్, ఇరాన్, అరేబియా — ఇవి అన్నియు వారి సామ్రాజ్యములోని భాగములే. రషియావారు టర్కీ సామ్రాజ్య విచ్ఛిన్న మెప్పుడెప్పుడు సంభవించునాయని కనిపెట్టుకొని యుండిరి. కాని ఇట్టిది జరుగకపూర్వమే తమ యొక్క ప్రాబల్యమును పశ్చిమ ఆశియాలోని టర్కీ రాష్ట్రములపై స్థాపించుటకు జర్మనీవారు నిశ్చయించుకొనిరి. రషియాతో యుద్ధము సంభవించినయెడల జర్మనీవారు

తమకు సహాయపడుదురను విశ్వాసముతో టర్కీ సుల్తానులు జర్మనీవారిని దగ్గర చేర్చుకొనిరి. తగిన యవకాశము దొర కినదని జర్మనులు టర్కీ సైన్యములను చక్కగ తర్ఫీదుచేసి వానికి సైన్యాధిపతులైరి. జర్మన్ వర్తకసంఘములు టర్కీలో రైళ్ళను నిర్మించువారైరి. అచ్చటి వ్యాపార మంతయు వారి వశములోనికి వచ్చెను. జర్మనీ ముఖ్యపట్టణ మగు బెర్లిన్ నుండి టర్కీలోని బాగ్దాదువరకు మార్గమధ్య మున మారవలసిన అవసరములేని ఒకే రైలును వేయుట కేర్పాటులు జరిగెను. వీని అన్నిటిమూలమున టర్కీ సామ్రాజ్యము జర్మనుల అధీనములోనికి వచ్చు పరిస్థితు లేర్పడెను.

కనుక క్రీ. శ. 1914 లో మొదట ప్రపంచయుద్ధము ప్రారంభమగునాటికి జపాన్ దేశ మొక్కటితప్ప ఆశియా ఖండములోని తక్కిన దేశము లన్నియు పాశ్చాత్యుల ప్రాబల్యమునకు లొంగిపోయినవయ్యెను.

# 12

# సామ్రాజ్యముల వృద్ధి క్షయములు, ప్రాచ్యదేశముల స్వాతంత్ర్యము



ఖండములలో చిన్నదియగు యూరపుఖండమున నివసించు చుండినవారు క్రీ. శ. 1500 కును క్రీ. శ. 1900 కును మధ్య ప్రపంచమునంతను పంచుకొని సామ్రాజ్యాధిపతులైరి. ప్రాచ్య దేశములలో జపాన్ ఒక్కటే సామ్రాజ్యమును సంపాదించి వారితో సమానముగ వ్యవహరింపగలది అయ్యెను. కాని ఇట్లు జరిగిన పంపకము, సామ్రాజ్యము లున్నవారిలో కొందరికి సంతృప్తికరముగ నుండలేదు. వారిమధ్య దాయాది పోరు బయలుదేరి మొదటి ప్రపంచయుద్ధమునకు దారి తీసెను.

యూరపుఖండపు దేశములలో ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీ, రషియా రాజ్యములారింటికి గొప్ప

సామ్రాజ్యములుండెను. కాని వీనిలో కొన్ని విస్తీర్ణమందు పెద్దవిగను, కొన్ని చిన్నవిగను, కొన్ని సమస్తసంపదలతో కూడినట్టివిగను, కొన్ని సామాన్యములుగను ఉండెను. ఇంగ్లీషు సామ్రాజ్యము తొంబదిలక్షల చదరపుమైళ్ల విస్తీర్ణముగలిగి నలుబదియైదుకోట్ల జనముతో కూడి యుండెను; ఫ్రెంచిసామ్రాజ్యము డెబ్బదిలక్షల చదరపుమైళ్ల వైశాల్యము గలిగి అయిదుకోట్ల జనముతో కూడి యుండెను. రషియాసామ్రాజ్యము బాల్టిక్ సముద్రతీరమందుండి పసిఫిక్ మహాసముద్రమువరకు వ్యాపించి యుండెను. కానీ జర్మనీకిని ఇటలీకిని ఇంతటి సామ్రాజ్యములు లేవయ్యెను. ఇదిగాక ఇంగ్లండు, ఫ్రాన్సు, రషియా దేశములవారు చాలకాలమునుండి సామ్రాజ్య సంపాదన ప్రయత్నముచేసిన కారణమున ప్రపంచములో ఐశ్వర్యవంతములగు ప్రదేశములు వారి పాలనలోనుండెను. జర్మనీ ఇటలీలకు చెందిన ప్రాంతములు అధికముగా వెనుకబడిన ఆఫ్రికాఖండమందుండెను. ఇట్టి తరతమ భేదముండుట జర్మనీవారికి పూర్తిగ ఇష్టములేదయ్యెను. అందుచేత వారు యుద్ధముచేసియైనను విశాల సామ్రాజ్యమును సంపాదింప నిశ్చయించుకొని కోట్లకొలది ద్రవ్యము ఖర్చుపెట్టి నౌకాదళమును నిర్మించుకొనిరి. ఇట్టి యుద్దేశముతోడనే వారు టర్కీని తమవలలో వేసికొనిరి. ఈ రెండుచర్యలు ఇంగ్లీషువారికి ప్రమాదకరములయ్యెను. రషియా జర్మనీల మధ్య వైరమేర్పడుటకు కూడ నిది హేతువయ్యెను. టర్కీని కాజేయుటకు చాలకాలమందుండి రషియావారు పన్నుచుండిన

పన్నాగమునకు జర్మనులడ్డుతగిలినట్లు వారు భావించిరి. ఇది గాక ఫ్రెంచివారును జర్మనులును తరతరముల నుండి గర్భ శత్రువులుగ నుండినవారు. జర్మనులు చేయు యుద్ధసన్నాహ మంతయు తమ సామ్రాజ్యము నపహరించుటకు చేయబడు చున్నదని ఫ్రెంచివారూహించిరి. కనుక జర్మనీకిని ఇంగ్లండు రషియా ఫ్రాన్సు దేశములకును వైరము దినదినాభివృద్ధి గాంచెను. ఒకప్పు డనేక దేశములు ఆస్ట్రియా సామ్రాజ్య ములో చేరియుండెను. కాని పందొమ్మిదవ శతాబ్దములో వానిలో కొన్ని విడిపోయెను. ఆనష్టమును భర్తీచేసుకొను నుద్దేశముతో ఆస్ట్రియా చక్రవర్తులు ఆగ్నేయ యూరపు లోని చిన్న చిన్న రాజ్యములమీద కన్ను వేసియుండిరి. ఆ రాజ్యములలోని వారు స్లావుజాతివారు. రషియావారుకూడ స్లావు జాతివారే. ఇదిగాక ఆరాజ్యములు స్వాతంత్ర్యమును సంపాదించుటకై టర్కీ-సుల్తానులతో జాతీయ యుద్ధములను సాగించుచుండిన కాలములో రషియావారు వారికి సహాయ పడి యుండిరి. ఆకారణముచేత ఆస్ట్రియా నుండి కలుగ నున్న ప్రమాదమును తప్పించుకొనుట కారాజ్యములు రషియావారి సహాయ మపేక్షించుచుండెను. రషియావారు కూడ అట్టి సహాయము చేయుటకు సంసిద్ధులుగ నుండిరి. ఈపరిస్థితుల ఫలితముగ యూరపులోని అగ్రరాజ్యములు రెండు కక్షలుగ చీలిపోయెను. ఇంగ్లండు, ఫ్రాన్సు, రషియావారొక కక్షలోనుండిరి. జర్మనీ ఆస్ట్రియా ఇటలీవారు రెండవకక్షలో చేరిరి. ఉభయకక్షలవారు వారివారి సామ్రాజ్యముల వృద్ధిచేసికొనుటకు సన్నాహములు చేయుచుండిరి.

యుద్ధము ప్రారంభమగుటకేదో ఒక నెపమవసరముగ నుండెను. అట్టి నెపమొకటి క్రీ. వె. 1914 లో దొరకెను. దాని మూలమున మొదటి ప్రపంచయుద్ధము ప్రారంభమయ్యెను.

యుద్ధము ప్రారంభమైనప్పు డొకపక్షమున ఇంగ్లండు ఫ్రాన్సు రషియాదేశములు రెండవపక్షమున జర్మనీ ఆస్ట్రియాలు చేరెను. ఇటలీదేశము కొంతకాలము తటస్థముగ నుండి అటుపిమ్మట మొదటి పక్షమునచేరెను. జపాన్‌వారు కూడ అట్లేచేరిరి. జర్మన్ పక్షము ననుసరించిన తక్కిన దేశములు టర్కీ బల్గేరియాలు మాత్రమే. క్రమక్రమముగ ఇంగ్లండువారి పక్షమున ముప్పది యైదు దేశములు కలసెను. యుద్ధము ప్రథమమున యూరపుఖండములో ప్రారంభమైనను క్రమక్రమముగ ఖండము లన్నిటియందు వ్యాపించుటచేత ప్రపంచయుద్ధమను పేరునకు తగినదయ్యెను.

అనేక సంవత్సరములనుండి జర్మనులు యుద్ధ సన్నాహము చేయుచుండిన కారణమునను, క్రీ. వె. 1866, 1870—1 లో వారు ఆస్ట్రియాతోడను ఫ్రాన్సుతోడను గావించిన యుద్ధములను కొద్దికాలములో పూర్తిచేసిన కారణమునను, ఈ యుద్ధములోకూడ కొన్ని నెలలలో శత్రువు లందరిని ఓడించవచ్చునని భావించి దానికి తగినట్లు వ్యూహములు పన్నిరి. కాని వారి సైన్యాధిపతులు కొన్ని పొరబాటులు చేయుటచేతను, ఫ్రెంచివారు అపూర్వమైన ధైర్యసాహసముల చూపుటచేతను జర్మను లనుకొనినట్లు జరుగలేదు.

ఏక కాలమున వారు పశ్చిమ యూరపురంగమున ఇంగ్లీషు, ఫ్రెంచి సైన్యములతోడను, తూర్పురంగమున రషియావారి తోడను యుద్ధము చేయుటకుకూడ కష్టమయ్యెను. భూ యుద్ధమిట్లు స్తంభించిన కారణమున జలయుద్ధము చేయుటకు వారు సమకట్టి జలాంతరమార్గముల సాధనమున మిత్రమండలి వారి నౌకలను ముంచివేయసాగిరి. దీనివలన ఇంగ్లీషువారి కపరిమిత నష్టము సంభవించెను. కాని ఇంగ్లీషువారు జంకక క్రొత్త నౌకలను నిర్మించుకొని యుద్ధము సాగించుచుండిరి. అట్టి సందర్భములో విదేశములనుండి ఇంగ్లండునకు వచ్చు చుండు ఆహారపదార్థములను, యుద్ధపరికరములను రాకుండ చేయుట అత్యావసరమని జర్మనులు భావించి, ఆ సందర్భములో కొన్ని అమెరికన్ నౌకలనుకూడ ముంచివేసిరి. అందుపై అమెరికన్ వారు కూడ జర్మనులపై యుద్ధము ప్రకటించి మిత్రమండలిపక్షమున చేరిరి. అప్పటినుండి అమెరికా నుండి సైన్యములు, యుద్ధపరికరములు, నౌకాదళములు అపరిమిత ముగ యూరపునకు రా దొడగెను. వాని నన్నిటిని ఓడిం చుట జర్మనులకు సాధ్యము కాదయ్యెను. తుదకు వారు పరాజితులై యుద్ధమును మాని క్రీ. శ. 1918 లో మిత్ర మండలి శరణుజొచ్చిరి.

యుద్ధము ముగిసినతర్వాత మిత్రమండలి ప్రతినిధులు పారిసులోని వార్సేల్ నందు సమావేశమై సంధిషరతులను నిర్ణయించిరి. వాని మూలమున జర్మనీ, టర్కీ, ఆస్ట్రియా సామ్రాజ్యము లంతరించెను. అదివరకు వానిలో చేరి యుండిన యూరపుఖండపు దేశములు జాతీయసిద్ధాంతము

ననుసరించి ప్రత్యేక జాతీయరాజ్యము లయ్యెను. ఆ విధముగ నేర్పడిన రాజ్యములలో పోలెండు, జెకోస్లొవేకియా, యూగోస్లేవియా, ఫిన్‌లాండు, ఎస్తోనియా, లాట్వియా, లితుయేనియాలు ముఖ్యములైనవి. వీనిలో కొన్ని రషియా సామ్రాజ్యము విచ్ఛిన్న మగుటచేత ఏర్పడినవి. యూరపున కావల నితరఖండములలో జర్మనీ, టర్కీ పరిపాలనములో నుండిన ప్రదేశములను మిత్రమండలివారు పంచుకొనిరి. ఆఫ్రికాలోని జర్మన్ వలసరాష్ట్రము లనేకములు ఇంగ్లీషువారి వశమయ్యెను; పసిఫిక్ మహాసముద్రములోని ప్రదేశములలో కొన్నిటిని జపాన్‌వారును మరికొన్నిటిని ఇంగ్లీషువారును తీసికొనిరి. అదివరకు టర్కీ రాజ్యములో చేరియుండిన సిరియా ఫ్రెంచి పాలనములోనికిని, ఇరాక్ పాలెస్టైన్లు ఇంగ్లీషుపాలనలోనికి వచ్చెను. తమ సామ్రాజ్యమును కోల్పోవుటయేగాక జర్మనులు మిత్రమండలివారికి కోట్లకొలది ద్రవ్యమును నష్టపరిహారమునకై ఇయ్యవలసినవారైరి. వారి నౌకాబలము విజేతల వశమయ్యెను. వారి సైన్య మొక లక్షకు మించరాదను షరతునకు కూడ వారంగీకరింపవలసినవారైరి. క్రీ. వె. 1871 లో జాతీయరాజ్యమును నిర్మించుకొని, క్రీ. వె. 1914 వరకు పరిశ్రమలందును, శాస్త్రపరిశోధనములందును, ఆర్థిక విధాన నిర్మాణమందును, అద్వితీయమైన ప్రతిభను చూపిన జర్మన్‌లు సమస్తమును కోల్పోయిన కారణమున క్రోధావేశపరవశులై తమ కవకాశము లభించిన వెంటనే రెండవ ప్రపంచయుద్ధమునకు సన్నాహము గావింపదొడగిరి.

ప్రపంచ యుద్ధఫలితముగ అనేక చక్రవర్తులు, రాజులు సింహాసన భ్రష్టులైరి. వారి స్థానమున ప్రజలెన్నుకొనిన ప్రతినిధుల పాలనము స్థాపింపబడెను. జర్మనీ, ఆస్ట్రియా, జెకోస్లొవేకియా, పోలెండు, లిథుయేనియా, లాట్వియా, ఎస్తోనియా, ఫిన్లాండు, గ్రీసు, రషియా, టర్కీలలో ఇట్టిమార్పు జరిగెను. మరికొన్ని దేశములలో రాజు లుండినను వారి అధికారము నామమాత్ర మయ్యెను.

జాతీయ సిద్ధాంతము ననుసరించి రాజ్యము లేర్పడినందున యూరపు ఖండములోని రాజ్యముల సంఖ్య మున్పటికంటెకి పెరిగెను. విస్తీర్ణమం దవి మిక్కిలి చిన్నవగుటచేత రక్షణ విషయములోను వర్తక వ్యాపార విషయములలోను మిక్కిలి చిక్కుల ననుభవింపవలసిన వయ్యెను. మధ్య యూరపున వివిధ జాతులవారు కలసిపోయి యున్నందున ప్రతి జాతీయ రాజ్యమందును ప్రధానజాతితో స్వల్పసంఖ్యాకులగు జాతులు కొన్ని యుండుట తప్పదయ్యెను. రాజ్యముల చిక్కులకిదికూడ నొక కారణ మయ్యెను.

ప్రపంచ యుద్ధము మూలమున కలిగిన నష్ట మపారము. ఇందు సుమారు ఆరుకోట్ల యువకులు సైన్యములలో చేరిరి. కోటిసైనికులు ప్రాణముల కోల్పోయిరి. అనేకులు వికలాంగులైరి. ఆహార పదార్థములు దొరకని కారణమునను వ్యాధులు వ్యాపించుటమూలముననను మూడుకోట్ల సామాన్య జనులు మృతిజెందిరి. మృతి జెందినవారిలో ఎట్టి పాపమెరుగని స్త్రీలు, పిల్లలు, వృద్ధులు లక్షలాదిగ నుండిరి. యుద్ధము జరుపుటకై ప్రభుత్వము వారు

300,000,000,000 రూపాయల విలువగల పరికరములను పదార్థములను ఖర్చుపెట్టిరి. యుద్ధముమూలమున లెక్క లేని ఫ్యాక్టరీలు, పంటపొలములు, పల్లెలు, పట్టణములు నాశన మయ్యెను. పూర్వకాలపు యుద్ధములకును ఈ ప్రపంచ యుద్ధమునకును ఇదియే భేదము.

రాజ్యములమధ్య వివాదము లేర్పడినపుడు వానిని యుద్ధసాధనమున పరిష్కరించుట సనాతనపద్ధతి. కాని యుద్ధములింత ప్రమాదకరములుగను వినాశకరములుగను ఏర్పడిన కారణమున వివాదములను సాధనాంతరమున తీర్చుట అవసరమన్న భావము వ్యాపించెను. ప్రపంచములోని రాజ్యము లన్నియు ఒక సమితిగ నేర్పడి, అట్టి సమితిద్వారా వివాదముల పరిష్కరించుకొనుట ఉత్తమ మార్గమని అనేకులు తలచిరి. అట్టి భావము ననుసరించి వార్సైలులో సమావేశమైనవారు "జాతీయ సమితి" (League of Nations) నొకదానిని నిర్మాణము చేసిరి. యుద్ధములు రాకుండ జేయుట దీని ప్రధానోద్దేశము. ఇందుకై అది అనేక ప్రయత్నముల గావించెను. కాని దాని పరిష్కారము ననుస రించుటకు అగ్రరాజ్యములలో ననేకము లిష్టపడని కారణము నను, బలముగలవారందరు యుద్ధవిధానమందే విశ్వాసము కలవారగుటచేతను జాతీయసమితి నిరర్థకమయ్యెను.

ప్రపంచ యుద్ధఫలితముగ యూరపుఖండ ప్రాబల్య మునకు గొప్ప దెబ్బ తగిలెను. యుద్ధకాలమందు యూరపు ఖండములోనివారికి కావలసిన సైనిక పరికరములు ఇతర

పదార్థములు అమెరికానుండియు, ఆశియాలోని జపాన్ ఇండియా మొదలగు దేశములందుండియు రావలసిన అవసర మేర్పడెను. యుద్ధము ముగిసినతర్వాతకూడ యూరపులో వెంటనే పరిశ్రమలను పునర్నిర్మాణము చేయుట సాధ్యము కాదయ్యెను. ఇందుచేత యునైటెడ్ స్టేట్సు జపాన్ ప్రపంచమునకు ఆర్థిక కేంద్రములయ్యెను. వాని నౌకా బలము వృద్ధిగాంచెను. ఇదిగాక యుద్ధకాలమునను అటు పిమ్మటను ఆశియాఖండపు దేశములలో జాతీయ చైతన్యము వృద్ధిగాంచి యూరపువారి పరిపాలనముపై అనేక దేశము లలో తిరుగుబాటులు జరిగెను. ఇండియా, చైనా, జావా మొదలగువానిలో విప్లవోద్యమములు వృద్ధి గాంచెను. యూరపుయొక్క ప్రాబల్యము క్షీణించు సూచనలగుపడెను.

ప్రపంచయుద్ధములో రషియావారు పాల్గొనినను జర్మనులు వారి నోడించ గలిగిరి. దేశమందు క్షామబాధ విపరీత మయ్యెను. సైనికులలో అసంతృప్తి ప్రబలెను. యుద్ధమును సాగించుటకు కావలసినదీక్ష ఉద్యోగస్థులలో కూడ లేకుండెను. అనాదిగ దేశములో నిరంకుశ ప్రభుత్వ ముండెను. చక్రవర్తులు వారి కిష్టమువచ్చినట్లు ప్రజలను పాలించుచుండిరి. ఫ్రెంచి విప్లవమునకు పూర్వము ఫ్రాన్సు ఎట్టి స్థితియందుండెనో క్రీ. శ. 1917 నాటికి రషియా అట్టి స్థితియందే ఉండెను. ఆ కారణముచేత క్రీ. శ. 1917 మార్చిలో చక్రవర్తిపై తిరుగుబాటు లనేకములు జరిగెను. వాని నణచుటకు పంపబడిన సైనికులుకూడ అధికారులపై

తిరుగబడి విప్లవవాదులలో చేరిరి. విప్లవవాదులు చక్రవర్తిని సింహాసన భ్రష్టునిగావించి ప్రజాస్వామ్య విధానము ననుసరించి రాజ్యాంగమును నిర్మించిరి. కాని ఫ్రెంచివిప్లవములో జరినగిట్లు ఇచ్చటకూడ మితవాదులకును అతివాదులకును మధ్య చీలిక లేర్పడెను. అతివాదులు బోల్షివిస్టు పక్షమునకు చెందినవారు. వీరు మార్క్సు ప్రతిపాదించిన కమ్యూనిస్టు సిద్ధాంతము ననుసరించినవారు. వీరికి లెనిన్ నాయకు డయ్యెను. ఇతడు మితవాదుల నణచి, బోల్షివిస్టు పక్ష ప్రభుత్వమును స్థాపించి, విప్లవ పరిస్థితులలో జర్మనులలో యుద్ధము సాగించుట దుస్సాధ్యమన్న మాటను గ్రహించి, వారు విధించిన షరతులు రషియాకు నష్టతరములుగ నుండినను వారితో సంధి గావించుకొనెను. (1918). ఇతడు సాహుకారి పద్ధతిని రద్దుజేసి ఫ్యాక్టరీలు, గనులు, బ్యాంకీలు, ఇనుపదారులు మొదలైన ఆర్థిక సంస్థల నన్నిటిని ప్రభుత్వపరము గావించి ఉద్యోగస్థులద్వారా వానిని నడుపు పద్ధతిని ప్రవేశపెట్టెను; జమీందారీ పద్ధతిని రద్దుజేసెను. మతమువలన నష్టమేగాని లాభము లేదని భావించి మతాధిపతుల ఆస్తులను తీసికొని మతప్రచారమును నిషేధించెను. స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కులను కల్పించెను. క్రీ. శ. 1924లో లెనిన్ చనిపోయినతర్వాత మూడు సంవత్సరములకాలము నాయకత్వమునకై అతని అనుచరులలో ప్రధానులగు ట్రాట్స్కీ, స్టాలిన్ లకు పోటీజరిగి తుదకు స్టాలిన్ నాయకు డయ్యెను. ఫ్రెంచివిప్లవఫలితముగ ఫ్రాన్సుకు నెపోలియన్ నియంత యైనట్లు రషియాకు స్టాలిన్ నియంత

యయ్యెను. ప్రారంభదశలో నీ విప్లవము నణచుటకు ఇంగ్లండు ఫ్రాన్సు యునైటెడ్ స్టేట్సువా రనేక ప్రయత్నములు గావించిరిగాని లెనిన్ వారిని ప్రతిఘటించి విప్లవమును స్థిరపరచెను. స్టాలిన్ నాయకత్వమున సంస్కరణము లనేకములు జరిగెను. ప్రజలందరు అక్షరాస్యులైరి. వైద్య సహాయము ఆరోగ్యము వృద్ధిగాంచెను. వ్యవసాయము నవీనశాస్త్ర పద్ధతుల ననుసరించి యంత్రసహాయమున జరుగసాగెను. కాని పరిపాలనాధికార మంతయు కమ్యూనిస్టు పక్షములో చేరిన స్వల్పసంఖ్యాకుల వశమయ్యెను.

మొదటి ప్రపంచయుద్ధమునకును రెండవ ప్రపంచ యుద్ధమునకును మధ్య ఇరువది సంవత్సరము లుండెను. ఈ మధ్యకాలములో వార్సేల్ సంధిమూలమున జరిగిన ఏర్పాటులను ఆచరణలోనుంచుట దుస్సాధ్యమను విషయము స్పష్టమయ్యెను. ఇటలీయందును జర్మనీ యందును ఆ ఏర్పాటులను రద్దుచేయుటకు తీర్మానించుకొనినవారు క్రమక్రమముగ నధికారములోనికి రాగలిగిరి. క్రీ. శ. 1920 నాటికి యూరపుఖండమందు కమ్యూనిస్టు సిద్ధాంతముల కెక్కువ ప్రాపకము గలిగియుండెను, వీనిని ప్రతిపాదించిన వాడు కారల్ మార్క్సు (1818—1883) యంత్రయుగమునం దేర్పడిన పారిశ్రామిక పరిస్థితులే నితని సిద్ధాంతముల కాధారము. ఆ పరిస్థితులన్నియు ధనికవర్గమునకు చెందిన సాహుకార్ల కెక్కువ లాభకరములుగనుండెను. వారి యనుజ్ఞలకు లోబడి కార్మికులు నడుచుకొనవలసియుండిరి. క్రొత్త పద్ధతులమూలమున పదార్థముల నపరిమితముగ నుత్పత్తి

చేయుట కవకాశ మేర్పడినను, ఉత్పత్తియైనవానికి పంపకము లో కార్మికులకు న్యాయము లభించకుండెను. వారు పడుచుండిన కష్టములను అనుభవించుచుండిన బాధలను గమనించి వానిని నివారించుటకు తగిన సాధనములను మార్క్సు పరిశోధించెను. పదార్థముల నుత్పత్తి చేయుటకు కావలసిన భూములు, యంత్రములు మొదలగునవి సాహుకార్ల అధీనమందుండుటయే కార్మికుల దారిద్ర్యమునకు కారణమని అతడు భావించి అట్టి విధానము రద్దై, భూములు, యంత్రములు మొదలైనవి ప్రభుత్వమువారు వశపరచుకొనవలెననియు, అర్థోత్పత్తి యంతయు ప్రభుత్వమువారి యాజమాన్యమున జరుగవలెననియు, ఉత్పత్తియైన వస్తువులను కష్టపడి పని చేయువారుమాత్రమే అనుభవింప వలెననియు, పని చేయక తాతముత్తాతలు గడించిన ఆస్తితోగాని తదితరములగు ఆస్తులతోగాని కాలక్షేపము చేయు సోమరులకు సంఘమునందు స్థాన ముండరాదనియు, ఇట్టిమార్పు విప్లవసాధనమున రాగలదేకాని ప్రజాస్వామ్య విధానమున రాతగ్గది కాదనియు, కార్మికులిట్టి విప్లవమును లేవదీసి సాహుకారి విధానము తొలగువరకు నియంతృత్వ ప్రభుత్వమును స్థాపింపవలెననియు ప్రతిపాదించెను. కార్మికులలోను కార్మిక నాయకులలోను ఈ ప్రచారము వ్యాపించియుండెను. దీని ననుసరించి రషియా లోని బోల్షివిస్టు పక్షమువారు విప్లవమును లేవదీసిరి. అదేవిధముగ కార్మికవర్గములోని విప్లవవాదులు ఇటలీ మొదలగు నితరదేశములందుకూడ నిట్టి విప్లవమును

లేవదీయుటకు క్రీ. వె. 1919 తర్వాత ప్రియత్నముల గావించిరి,

ఇట్టి కమ్యూనిస్టు ఉద్యమమును ప్రతిఘటించుటకై మధ్యవర్గ నాయకులతో కూడిన రాజకీయ పక్షము ఫ్యాసిస్టు పక్షమను పేర ఇటలీలో ఏర్పడెను. దీనికి ముసాలిని నాయకు డయ్యెను. ఇటలీదేశము మిత్రమండలి పక్షము వహించి ప్రపంచయుద్ధములో పాల్గొనినను వార్సేల్ సంధిమూలమున నా దేశమునకు విస్తార లాభము కలుగ లేదు. ఇటాలియన్ల సామ్రాజ్య కాంక్ష కొంచెముకూడ తీరినది కాదు. కనుక దేశములో మిక్కిలి అలజడి వ్యాపించియుండెను. ఈసందర్భ ములను పురస్కరించుకొని ముసాలిని ఫ్యాసిస్టుల సహాయ మున రోంపట్టణము నాక్రమించి (1922) దేశమునకు నియంత అయ్యెను. పేరునకొక రాజు, ప్రజ లెన్నుకొనిన ప్రతినిధుల సభ ఉండినను అధికారమంతయు ముసాలినీ పర మయ్యెను. ఇతడు కార్మికుల విప్లవోద్యమమునణచి, అరా చకమును తొలగద్రోచి, దేశములో శాంతి భద్రతలను స్థాపించి, ఆర్థిక విషయములలో కొన్ని సంస్కరణము లను గావించి, ప్రజలలో దేశాభిమానమును జాతీయ భావమును బలపరచి, వాని సహాయమున సామ్రాజ్య సంపా దనమునకు గడగెను. దీని ఫలితముగ ఉత్తర ఆఫ్రికాలో లిబియాప్రాంత ప్రదేశములు, అబిసీనియారాజ్యము ఇతని వశమయ్యెను. ఫ్రాన్సు పరిపాలనలో నుండిన కార్సికా, ట్యూనిస్ మొదలగువానినికూడ జయించుట కితడు సమకట్టి జర్మనీ నియంతయగు హిట్లరుతో సంధిజేసికొనెను. యుద్ధము

చేసియైనను తన సామ్రాజ్యమును వృద్ధిగావించుకొనవలెనని ఇతను పట్టుబట్టుటచేత రెండవ ప్రపంచ యుద్ధము తప్పదయ్యెను.

జర్మనీలో కూడ క్రమక్రమముగ నిట్టి పరిస్థితులే ఏర్పడెను. వార్సేల్ సంధిమూలమున జర్మనులకు విపరీతమైన నష్టముకలిగెను. వారి బొగ్గుగనులు, ఇనుముగనులు, సారవంతములగు భూములు మొదలగువానిలో చాలభాగమును వారు కోల్పోయిరి. నష్టపరిహారము క్రింద వారు కోట్లకొలది ద్రవ్యము నిచ్చుకొనవలసినవారైరి. ఈనష్టమును వారు భరింపలేని స్థితిలోనికివచ్చిరి. క్రీ. శ. 1919 లో దేశమందు ప్రజాస్వామ్య విధానమేర్పడినను రాజకీయపక్షములనేకములు బయలుదేరుటచేతను, ఆర్థిక పరిస్థితులు చిక్కులతో కూడియుండినందునను ప్రజాప్రభుత్వము తృప్తికరముగ సాగకుండెను. ఇదిగాక అనేక శతాబ్దములనుండి నిరంకుశ ప్రభుత్వమున కలవాటుపడిన జర్మనులు ప్రజాస్వామ్యమందుత్సాహము చూపరైరి. తమజాతికంతకు నవమానమును కలిగించిన వార్సేల్ సంధిషరతులను రద్దుజేసి, జర్మన్ యొక్క గౌరవమర్యాదలను స్థాపించుట యొక్కటే కర్తవ్యమనియు, అది జరుగుటకు నియంతృత్వమే సాధనమనియు తలచిన నాజీపక్షమునకును, దానికి నాయకుడైన హిట్లరుకును దేశమందు పలుకుబడి అధికమయ్యెను. తుదకతడు క్రీ. శ. 1933 లో దేశమునకు నియంతయై సంధిషరతులను లక్ష్యపెట్టక బలమును సమకూర్చుకొనుట కారంభించెను. క్రమక్రమముగ సైన్యమును వృద్ధిజేసెను; సైనికపరికరముల

తయారుచేయుటకు క్రొత్త ఫ్యాక్టరీలను నిర్మించెను. నాలు గైదు సంవత్సరములలో దేశమునంత నొక యుద్ధశిబిరముగ మార్చెను. సన్నాహముల నన్నిటిని పూర్తిజేసికొని క్రీ. వె. 1938 లో నతడు ఆస్ట్రియాను వశపరచుకొని, జెకోస్లావే కియాపై దండెత్తెను. ఆ దేశమునకు సహాయముచేయునట్లు ఫ్రెంచివారొడంబడియుండినను హిట్లరు నెదిరించుటకు తగిన సైన్యములు లేనికారణమున వారా ఒడంబడిక ననుసరించ రైరి. ఇంగ్లీషువారు కూడ నతని నెదిరించలేని స్థితిలో నుండిరి. అందుచేత నతడు జెకోస్లావేకియాను ఆక్రమించి, క్రీ. వె. 1939 లో పోలెండుదేశముపై దండెత్తెను. అంత టితో రెండవ ప్రపంచయుద్ధము ప్రారంభమయ్యెను.

యుద్ధములు రాకుండ జేయుటకై ఏర్పడిన జాతీయ సమితి నిరర్థకమైన సంస్థగ మారిపోయెను. అవసరమై నప్పుడు వార్సేల్ సంధి షరతులను ఇతర ఏర్పాటులను ధర్మ సమ్మతముగ మార్చుటకు సమితి కధికారముండినను అట్టి బాధ్యతను వహించుట కది ఇష్టపడకుండెను. తమ బల మును పలుకుబడిని దాని ద్వారా వృద్ధిజేసికొనుటకు మాత్రమే ఆకాలపు అగ్రరాజ్యములు దాని నుపయోగింపసాగిరి. ఇటలీ జపాన్ మొదలైన అగ్రరాజ్యములు న్యాయవిరుద్ధముగ అబి సీనియాను, మంచూరియాను జయించినను సమితి వానిపై తగినచర్యను తీసికొనలేకపోయెను. కనుక ప్రారంభదశలో దానికుండిన పేరుప్రతిష్ఠలు క్షీణించి, దానిమూలమున సాధింప దగిన ప్రయోజన మెట్టిదియు లేకపోయెను.

వార్సేల్ సంధిషరతులకు విరుద్ధముగ హిట్లరు యుద్ధ సన్నాహము చేయుచుండిన కాలములో ఇంగ్లీషువారు ఉదాసీనులై యుండిరి. కమ్యూనిజము మూలమున ప్రమాదము రానున్నదనియు, దానిని వ్యాపించుటకు సమకట్టిన రషియాను నిరోధించుటలో హిట్లరు ప్రధాన సాధనమగుననియు ఇంగ్లీషు వారు భావించియుండిరి. యునైటెడ్ స్టేట్సువారు కూడ కొంతవరకిట్టి భావముతోడనే యుండిరి. అందుచేత సకాలమున వారు హిట్లరును నిరోధింపరైరి.

క్రీ. శ. 1939 లో ప్రారంభమైన రెండవ ప్రపంచ యుద్ధము ఆరుసంవత్సరముల కాలము జరిగెను. ఇది ప్రారంభమైన కొంతకాలమునకు ముసోలనీ హిట్లరుతో కలసెను. క్రీ. శ. 1941 లో జపాన్ వారు కూడ అతనితో కలసిరి. అది మొదలొక పక్షమున జర్మనీ, ఇటలీ, జపాన్ దేశములు, రెండవ పక్షమున ఇంగ్లండు, ఫ్రాన్సు, యునైటెడ్ స్టేట్సు మొదలైన దేశములు చేరియుండెను. క్రీ. శ. 1939 మొదలు క్రీ. శ. 1942 ఆఖరువరకు హిట్లరుకు అడ్డు లేని జయము లభించెను. అదేవిధముగ జపాన్ యుద్ధము లోనికి దిగిన తర్వాత జయమంతయు దానిదే. 1942 ఆఖరు నుండి యుద్ధగతి మారెను. అప్పటికి ఇంగ్లండు, యునైటెడ్ స్టేట్సు, రషియా మొదలగు మిత్రమండలివారు వారి సైన్యములను పరికరములను సమకూర్చుకొనగలిగిరి. హిట్లరు పురోగమన కాలమున స్పెయిన్, పోర్చుగల్, స్వీడన్ దేశములును, రషియాలో కొంతభాగమును తప్ప తక్కిన యూరపుఖండ మంతయు నతని యధీనములోనికి వచ్చెను.

ఇంగ్లండును జయించుట కతడు గావించిన ప్రయత్నములు మాత్రము భగ్నమయ్యెను. ఇదే విధముగ జపాన్‌వారు "మెరుపు" యుద్ధమును సాగించి సంవత్సరములోపల హాంగ్ కాంగు, మలయా, సింగపూరు, బర్మా, అండమాన్సు, సుమిత్రా, జావా మొదలైన తూర్పు ఇండియాద్వీపములు, ఫిలిప్పైన్ ద్వీపములను జయించిరి. క్రీ. శ. 1943 నుండి యుద్ధగతిమారెను. క్రమక్రమముగ హిట్లరు వశమందుండిన ప్రదేశములను, జపాన్‌వారు జయించిన దేశములను మిత్రమండలివారు ఆక్రమించిరి. జర్మనీ, ఇటలీ, జపాన్‌లు పూర్తిగ పడిపోయెను.

కాని యుద్ధము ముగిసిన తర్వాత జర్మనీ, జపానులతో సంధి ఏర్పాటులు జరుగుటకు వీలులేని పరిస్థితు లేర్పడెను. యుద్ధకాలమందు కలిసి పనిచేసిన ఇంగ్లండు, యునైటెడ్ స్టేట్సు, ఫ్రాన్సు, రషియాలు యుద్ధము ముగిసిన తర్వాత కలసి పనిచేయుటకు సిద్ధపడరైరి. రషియావారు తక్కినవారినుండి వేరుపడిపోయిరి. వీరి మధ్య మనస్పర్ధలు కాలక్రమమున వృద్ధిగాంచెను. తమ తమ సామ్రాజ్యములను వృద్ధిజేసికొనుటయందు వీరికిగల పట్టుదలయే ఈ మనస్పర్ధలకు కారణము. రషియావారు యుద్ధకాలమున జర్మనీవారు వశమందుండిన పోలెండు, లితుయేనియా, లాట్వియా, ఎస్తోనియా, జెకోస్లావేకియా, హంగేరీ, రొమేనియా, బల్గేరియా మొదలగు మధ్యయూరపు దేశములను ఆగ్నేయ యూరపు దేశములను ఆక్రమించుకొనిరి. వానిని వదలిపెట్టి వెళ్ళుటకు వారు సిద్ధపడరైరి. అదేవిధముగ వారు తూర్పుజర్మనీ,

తూర్పు ఆస్ట్రియాలను ఆక్రమించిరి. అట్లే పశ్చిమజర్మనీ పశ్చిమ ఆస్ట్రియాలను ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు, అమెరికావారు వారి వశములో ఉంచుకొనిరి. జపాన్ దేశమును, దక్షిణ కొరియాను, పసిఫిక్ మహాసముద్రమునందు జపాన్ వశమందుండిన ద్వీపములను అమెరికావారు స్వాధీనపరచుకొనిరి. ఉత్తర కొరియా రష్యావారి వశమయ్యెను. వీరిలో నెవ్వరుకూడ వారి వారి వశమందున్న ప్రదేశములను వదలి వానికి స్వరాజ్యమిచ్చుటకు సిద్ధపడియుండలేదు. ఈ విధముగ ప్రారంభమైన మనస్పర్థలు విరోధమునకు కారణములయ్యెను. రెండు పక్షములవారు వారి వారి బలములను పెంచుకొనుచు యుద్ధసన్నాహ నిమగ్నులైరి.

సామ్రాజ్యములకై వీరు చేయుచుండు పోటీ ఈ యుద్ధసన్నాహమునకు ప్రధానకారణమైనను, ఆర్థిక రాజ్యాంగ తత్వములలో వీరి మధ్య ఏర్పడిన భేదముకూడ కొంతవరకీ సన్నాహమునకు దోహదము కలిగించెను. రషియావారు కమ్యూనిష్టు సిద్ధాంతమందు పరమ విశ్వాసము కలవారు. వారభిమానించు రాజ్యాంగము నియంతృత్వము. ప్రపంచమందంతట కమ్యూనిజం వ్యాప్తిగాంచినగాని శాంతిభద్రతలు మానవకల్యాణము స్థిరస్థాయులు కాజాలవనియు, అట్టి స్థాపనము తమ ద్వారా జరుగవలసి యున్నదనియు, అది జరుగు వరకు తాము యుద్ధసన్నద్ధులై యుండవలసి యున్నదనియు రషియావారి తత్వము. ఇందులో వారు మధ్యయుగమునాటి మహమ్మదీయ మతావలంబకులను, ఆధునిక యుగములోని నెపోలియన్ నాయకత్వమునందుండిన ఫ్రెంచి విప్లవకారులను

పోలియున్నారు. ఇంగ్లండు, యునైటెడ్ స్టేట్సు, ఫ్రాన్సు దేశములవారికి కమ్యూనిజం గిట్టుటలేదు. వారు వ్యక్తి స్వాతంత్ర్యవాదులు; ప్రజాస్వామ్య మందు విశ్వాసముగల వారు. రషియా ప్రాబల్యము వ్యాపించినయెడల స్వాతంత్ర్యము నశించి, మానవకోటి బానిసత్వ మనుభవింపవలసి వచ్చునని వారి భయము. ప్రకృతిశాస్త్రములకు సంబంధించిన సత్యములను ప్రయోగములద్వారా ఋజువుచేయుట సాధ్యమగుచున్నది. వానిని గురించి అభిప్రాయభేదము లుండుటకు వీలులేదు. ఆర్థిక రాజ్యాంగ మతతత్వము లిట్టివి కావు. అవి సత్యములౌనా కావా అనువాదముల కంతములేదు. అట్టి వానిని గురించి వివాదములు జరుపుచుండు అగ్రరాజ్యముల మధ్య సామరస్యము కుదురుట కష్టసాధ్యము.

కారణము లేవైనను క్రీ. శ. 1950 నాటికి ప్రపంచములోని పరిస్థితులు తారుమారై మరియొక యుద్ధమునకు దారితీయునట్టి వయ్యెను. అగ్రరాజ్యములమధ్య నేర్పడిన విరోధమే ఇట్టి పరిస్థితులకు కారణము.

రెండవ ప్రపంచయుద్ధమునకు ఫలితముగ లాభము పొందిన దేశములు యునైటెడ్ స్టేట్సు రషియాలు మాత్రమే. తక్కినవన్నియు నష్టపడినట్టివే. యుద్ధమం దోడిపోయిన జర్మనీ జపానులకు పతనము తప్పదయ్యెను. యుద్ధమందు జయముసంపాదించిన ఖ్యాతి ఇంగ్లండు ఫ్రాన్సులకు లభించినను వారీయుద్ధము మూలమున నిజముగ చితికిపోయిరనియే చెప్పవలసియున్నది. సామ్రాజ్యమును నిలబెట్టుకొనుటకు

కావలసిన అంగబలముగాని, అర్థబలముగాని వారికి లేనికారణమున ఇంగ్లీషువారు క్రమక్రమముగ ఇండియా, బర్మా, సింహళము పాలెస్టైయిన్ దేశములలో తమ అధికారమును వదలుకొని, వెనుకకు వెళ్లిపోవలసినవారైరి. ఫ్రెంచివారు సిరియాను ఇండోచైనాను వదలుకొనవలసిన స్థితిలోనికి వచ్చిరి. మూడువందల సంవత్సరములుగ జావా మొదలగు తూర్పు ఇండియా ద్వీపముల నేలుచుండిన డచ్చివారు ఇండోనీషియాకు స్వాతంత్ర్యము నియ్యవలసినవారైరి. ఒక శతాబ్దముగ పాశ్చాత్యుల ప్రాబల్యమునకు లోబడియుండిన చైనా దేశము సంపూర్ణ స్వాతంత్ర్యమును సంపాదించెను.

ఆధునిక యుగమునకు పాశ్చాత్యుల ప్రాబల్యము ప్రపంచమందంతట వ్యాపించుట ప్రధానలక్షణము. గత నలువది ఏబది సంవత్సరముల మధ్య ఆశియాఖండవాసులలో క్రొత్త చైతన్య ముద్భవించి, పాశ్చాత్యుల ప్రాబల్యమును వినాశము చేయగలశక్తులు వృద్ధిగాంచెను. రెండు మూడు వందల సంవత్సరముల నుండి పాశ్చాత్యులలో ఆశియా ప్రజలకు కలిగిన సంబంధమే ఈనూతన చైతన్యమునకు కారణము. పాశ్చాత్యులు స్వలాభము నధికముచేసికొనగోరి, వారి పాలనలో నుండిన ప్రాచ్య దేశములలో విద్యాలయములను స్థాపించిరి. రైళ్ళు రోడ్లు మొదలగు ప్రయాణ సౌకర్యములను కల్పించిరి: వారికి కావలసిన ముడిపదార్థములను సులభముగ సంపాదించుటకు వ్యవసాయము నభివృద్ధిజేసిరి. జలాధారము లనేకములను విద్యుచ్ఛక్తి సంస్థలను పెంచిరి. తమ దేశములలో వడ్డీలు తగ్గిపోవుటవలనను, లాభముల నధిక

ముగ సంపాదించుటకు అవకాశము లోపించుటచేతను, పాశ్చాత్య సాహుకార్లు వారి పరిపాలనములో నుండిన ఇండియా మొదలగు దేశములకు వారి మూలధనమును తెచ్చి, రైళ్ళ నిర్మాణమునకు, ఫ్యాక్టరీల సంస్థాపనమునకును వినియోగించిరి. ఇట్టి పనుల నన్నిటిని వారి స్వలాభము నుద్దేశించి చేసినను వాని మూలమున ఆశియాఖండవాసులలో నూతన వికాసము కలిగెను. పూర్వాచార పరాయణత్వము తగ్గెను. స్వాతంత్ర్యప్రియత్వ మధికమయ్యెను. పాశ్చాత్యుల పరిపాలనమందు వారికి ద్వేషభావము పుట్టెను. ఇండియాలోని స్వరాజ్యోద్యమము, చైనాలోని విప్లవోద్యమము, బర్మా, సింహళము, ఇండోచైనా, ఇండోనీషియాలలోని జాతీయోద్యమము దీని ఫలితములే. ప్రాచ్య ప్రజలలో స్వాతంత్ర్య కాంక్ష లేని కాలమున అల్పసైన్యములతో వారిని జయించి పాలించుట పాశ్చాత్యులకు సులభముగ నుండెను. కాని ఇట్టి కాంక్ష వారిలోపుట్టి వృద్ధిగాంచినతర్వాత సామ్రాజ్యములను నిలబెట్టుకొనుట పాశ్చాత్యులకు కష్ట మయ్యెను. ఆధునిక యుగ చరిత్రముయొక్క ఆఖరు అధ్యాయమున ప్రాచ్యదేశములవారు దీర్ఘ నిద్రనుండి మేల్కొని స్వాతంత్ర్యసమరమును సాగించి స్వరాజ్యమును సంపాదించుట ప్రాధాన్యము వహించి యున్నది. ఈసంపాదనము వారనుకొనిన దానికంటె సులభతరముగను, వేగముగను లభించెనని చెప్పవచ్చును. నలువది సంవత్సరములు యుద్ధము చేసినగాని, డచ్చివారికి పదునారవ శతాబ్దమున స్వరాజ్యము వచ్చినది కాదు. ఇటలీవారు ఇరువది సంవత్సరము

లిందుకై యుద్ధముచేసిరి. అమెరికావారు ఏడు సంవత్సరములు స్వాతంత్ర్య యుద్ధమును సాగించిరి. ఇట్టి దీర్ఘ యుద్ధము లవసరములేక ఇండియా, బర్మా, సింహళము మొదలగు దేశములవారు స్వాతంత్ర్యమును సంపాదించిరి. దీనికి ప్రధానకారణము పాశ్చాత్యులలో సంభవించిన అంత ర్యుద్ధములే — సుందోపసుందులవలె వారిలోవారు రెండు బ్రహ్మాండమైన ప్రపంచయుద్ధముల జేసి వారి శక్తుల నన్నిటిని కోల్పోయిరి. వారి కదివరకు లోబడియుండిన ప్రాచ్య దేశములవారు రాజకీయ బానిసత్వమునుండి విముక్తులై స్వాతంత్ర్యమును సంపాదించగలుగుట కీ యుద్ధములే కారణము. నాలుగువందల సంవత్సరములనుండి ఏకధాటిగ వృద్ధి గాంచుచుండిన యూరోపియనుల ప్రాబల్యమునకు విరోధము కలిగెను. చైనా, ఇండియా మొదలగు ప్రాచ్యదేశములకు స్వాతంత్ర్యము లభించెను. ఈ కారణముగ రెండవ ప్రపంచ యుద్ధము ముగిసిననాటనుండి (1946) ప్రపంచ చరిత్రలో నూతన శక మారంభమయ్యెను.